# పరిచయం



## చేరాల వేంకట లక్ష్మీనరసింహారావు

| | | |
|---|---|---|
| జననం | : | **12.05.1947** |
| తల్లిదండ్రులు | : | **కీ॥శే॥ శ్రీ చేరాల పురుషోత్తమ రావు**<br>**కీ॥శే॥ శ్రీమతి లక్ష్మీతులశమ్మ** |
| విద్య | : | భాషా ప్రవీణ (ఆంధ్ర విశ్వవిద్యాలయం)<br>పి.ఓ.యల్., ఎం.ఏ. (ఆంధ్ర విశ్వవిద్యాలయం)<br>ఎం.ఫిల్. (నాగార్జున విశ్వవిద్యాలయం)<br>(పిహెచ్.డి) (నాగార్జున విశ్వవిద్యాలయం) |
| ఉద్యోగం | : | జూనియర్ లెక్చరర్ (తెలుగు)<br>ప్రభుత్వ జూనియర్ కళాశాల,<br>సిరిపురం (ఖమ్మం జిల్లా) |
| ఆసక్తి | : | సాహిత్య వ్యాసంగము, పురాణ పఠనము<br>ధార్మిక ప్రచారము |
| రచనా వ్యాసంగము | : | రేడియో ప్రసంగములు (సూక్తిసుధ)<br>వివిధ పత్రికలలో సాహిత్య వ్యాసములు<br>జానకిరామ శతకము (అముద్రితము)<br>వేంకటేశ్వర శతకము (అముద్రితము) |

# సంస్కృతాంధ్ర రామాయణ భారతములలోని యుద్ధ పద్ధతులు

పరిశోధకుడు

**చేరాల వేంకట లక్ష్మీనరసింహారావు**



పర్యవేక్షకులు

**ఆచార్య నేతి అనంతరామశాస్త్రి**, ఎం.ఏ., పిహెచ్.డి.,

**తిరుమల-తిరుపతి దేవస్థానము వారి**
**ఆర్థిక సహాయముచే ప్రచురింపబడినది**

ఎం.ఫిల్. పట్టము కొఱకై నాగార్జున విశ్వవిద్యాలయమునకు
సమర్పించిన లఘు సిద్ధాంత వ్యాసము

**ఆగస్టు, 1999**

# సంస్కృతాంధ్ర రామాయణములలోని
# యుద్ధ పద్ధతులు

పరిశోధకుడు

**చేరాల వేంకట లక్ష్మీనరసింహారావు**

పర్యవేక్షకులు

**ఆచార్య నేతి అనంతరామశాస్త్రి**, ఎం.ఏ., పిహెచ్.డి.,

**తిరుమల-తిరుపతి దేవస్థానము వారి**
**ఆర్థిక సహాయముచే ప్రచురింపబడినది**

**ఎం.ఫిల్. పట్టము కొఱకై నాగార్జున విశ్వవిద్యాలయమునకు**
**సమర్పించిన లఘు సిద్ధాంత వ్యాసము**

**ఆగస్టు, 1999**

# సంస్కృతాంధ్ర-రామాయణములలోని యుద్ధ పద్ధతులు

ప్రథమ ముద్రణ : జూన్, 2002
చిత్రభాను, జ్యేష్ఠ మాసము

ప్రతులు : 1000

రచయిత : చేరాల వేంకట లక్ష్మీనరసింహారావు

ప్రతులకు : 1. సి.వి.ఎల్.నరసింహారావు
తెలుగు లెక్చరర్
ప్రకాశం రోడ్, మధిర-507 203

2. కేశవరావుతోట, గొడుగుపేట
మచిలీపట్నం - 521 001

**మూల్యము : రూ.50.00**

*This book is published under the scheme*
**"FINANCIAL ASSISTANCE FOR RELIGIOUS PUBLICATIONS"**
TIRUMALA-TIRUPATHI DEVASTANAM – TIRUPATHI

**D.T.P. at :** విశ్వా టైప్ ఇన్‌స్టిట్యూట్, విజయవాడ

# అంకితం



తల్లియు దండ్రియు తానెయై ప్రేమతో
పెంచి పోషించిన పితరుడితడు
మధ్వ శాస్త్రంబును మానిత భక్తిని
కూర్మి నేర్పిన యట్టి గురుడితండు
చదువు సంధ్యల నిచ్చి సంస్కారమును దెల్పి
మనిషిగ జేసిన మాన్యుడితడు
అధ్యాత్మ తత్త్వంబు అధ్యాపకత్వంబు
దయతో యిచ్చినయట్టి దైవమితడు
జ్ఞాన విజ్ఞాన ఖనియనం ఘనత వెల్గి
పరమ పదమును జేరిన భవ్యమతికి
ధన్య **పురుషోత్తమా**ఖ్యుడౌ తండ్రి కిత్తు
అంకితంబుగ నీ గ్రంథమంజలించి

# కృతజ్ఞతాంజలి

ఈ సిద్ధాంత వ్యాస రచనకు తమ అమూల్యములైన సలహాల నిచ్చి, పర్యవేక్షకులుగా చేయూత నందించుటయే గాక, తమ ఆశీస్సులను అక్షర రూపంలో ఇచ్చిన సరస్వతీ మూర్తులు, గురువరేణ్యులు, మాన్యులు నగు ఆచార్య నేతి అనంతరామశాస్త్రి గారికి కృతజ్ఞతా పూర్వక నమస్సుమాంజలి నర్పించుచున్నాను.

పరిశోధనా వ్యాసంగమునకు పురికొల్పి, వెన్నుదట్టి విషయ సేకరణ యందును సహకరించి "మంచి-చెడు" తెల్పిన గురుతుల్యులు మాన్య మిత్రులు డా॥ కె.కోదండ రామాచార్యులు గార్కి....

విశ్వవిద్యాలయమున పరిశోధన కవకాశము కల్పించిన నాగార్జున విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులకు, సహకారాన్నందించిన విశ్వవిద్యాలయ సిబ్బందికి మరియు ప్రాచ్య భాషా శాఖలోని ఇతర అధ్యాపక, అధ్యాపకేతర వర్గమునకూ ......

ఉద్యోగ నిర్వహణకు భంగముగాని రీతిని పరిశోధన చేయుట కనుమతించిన ఇంటర్మీడియెట్ ప్రాంతీయ సంయుక్త సంచాలకులు, వరంగల్ గారికి, సిరిపురం ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కర్నాటి రామమోహనరావు గారికి ......

వాల్మీకి రామాయణాన్ని నాచేత చదివించి ఎల్లవేళలా నా ఉన్నతిని కోరుకుంటూ నన్ను ప్రోత్సహించు సన్మిత్రులు శ్రీ ఆర్.వి.యస్.సిద్ధాంతి, శ్రీ జె.నాగేశ్వరరావు, డా॥ వి.మధుసూదనరావు, శ్రీ కె.రంగారావు, గార్లకు నా నమస్సుమాంజలి నర్పించుకొనుచున్నాను.

ముఖ్యముగా ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయమందించిన తిరుమల-తిరుమతి దేవస్థానం, తిరుపతి వారికి ....

ఈ గ్రంథమునకు డి.టి.పి.చేసిన మిత్రులు జోశ్యుల సీతారామ శాస్త్రి మరియు శ్రీ కూనం రాఘవరెడ్డి, విజయవాడ వారికి నా ధన్యవాదములు తెలుపుకొనుచున్నాను.

ఇట్లు

సి.వి.యల్. నరసింహారావు

# ప్రస్తావన

ప్రాచీన ఇతిహాసాలైన రామాయణ, మహాభారతాలు భారతీయ సంస్కృతికి ప్రతిబింబాలుగా చెప్పదగిన ఉద్గ్రంథాలు. మానవ జీవితానికి సంబంధించిన అనేక విషయాలను ఆ గ్రంథాలు స్పృశించాయి. పోరాటతత్వం అనేది కూడా మానవ జీవితంలో ఒక భాగమే. అదుపుదప్పిన కామక్రోధాది దుర్గుణాలే ఈ తత్వానికి మూలకారణాలు. ఇరువురు వ్యక్తుల మధ్యగలిగే పోరాటం తగాదాగా చెప్పబడితే రెండు రాజ్యాల మధ్య కలిగేది యుద్ధమౌతుంది. యుద్ధము నకు సంబంధించిన విషయాలయందును, రామాయణ, మహాభారతాలు ప్రత్యేకతను కల్గియున్నాయి.

వాల్మీకి రామాయణములోని యుద్ధ ఘట్టాల వర్ణనలను పరిశీలిస్తే ఆనాటి యుద్ధాలు పూర్తిగా అనాగరికమైనవిగా కనబడలేదు. తెలుగు రామాయణాలు కూడా ఆ యుద్ధ ఘట్టాలకు మెరుగులు దిద్ది మనోహరంగా వర్ణించాయి. ఆనాటి వీరుల బలౌన్నత్యములు, వారి వ్యక్తిత్వాలు ధనుర్విద్యలో వారి నేర్పరితనం, అందును అస్త్ర విద్యలో వారు చూపించిన అద్భుతాలు ఆశ్చర్యాన్ని కల్గింపకమానవు.

చాలామంది రామాయణ యుద్ధాన్ని ముక్కిడి మూకల పోరాటంగానే భావించారు. అంతేగాక లోకంలో భారత యుద్ధ ఘట్టాలకు వచ్చిన ప్రాచుర్యం రామాయణ యుద్ధ ఘట్టాలకు రాలేదు. రామబాణం మహత్తరమైనదని తెలుసుకాని ఆయన ధనుర్విద్యలో చేసిన అద్భుతాలు సాధారణ జనులకు తెలియదు. రామాయణ యుద్ధం భిన్నజాతుల మధ్య జరిగినదైనప్పటికీ ఆ యుద్ధ పద్ధతు లందును కొంత సమన్వయం కనబడుతుంది. రామాయణ యుద్ధములందును ఒక నీతి, రీతి ఉన్నదని చెప్పవలెనను కుతూహలంతో చేసిన ప్రయత్నమే ఈ సిద్ధాంత వ్యాసరచన. తద్వారా ప్రాచీన భారతీయుల ఔన్నత్యాన్ని తెలియజెప్పడమే ఈ ప్రయత్న లక్ష్యము. గుణ గ్రహణ పారీణులగు పాఠకులు ఇందలి దోషములను సహృదయంతో మన్నింప వలసినదిగా కోరుచున్నాను.

– రచయిత

**Prof. N.A. RAMA SASTRY,** M.A., Ph.D. (Retd.)
Principal Investigator, Major Research Project (U.G.C.)
B-82, Patabhipuram, GUNTUR-522 006

## "ధర్మో రక్షతి రక్షితః"

ధర్మం సార్వత్రికమైంది. అది ఒక జాతికిగానీ, ఒక దేశానికి గానీ, ఒక సమాజానికి గానీ పరిమితం కాదు. అది సమస్త మానవజాతి కళ్యాణానికి దోహదం చేస్తుంది. మానవజాతిని ప్రమాదం నుండి కాపాడి రక్షించేది ధర్మం అని రామాయణం నొక్కి వక్కాణిస్తుంది. సత్యంచేత, వివేకంచేత, సత్ప్రవర్తన చేత, కార్యాకారణాల సమన్వయం చేత ధర్మం రక్షింపబడుతుందని రామాయణం ప్రతి సన్నివేశంలోనూ వివరిస్తుంది. వ్యక్తి శ్రేయస్సు కన్నా సమాజ శ్రేయస్సుకోసం అవసరమైతే వ్యక్తిని అధర్మ మార్గంలో రూపుమాపటం ధర్మమే అని రామాయణం ప్రతిపాదించింది.

'పోరాటం' అనేది అనాది నుంచి మనుష్యుల తత్త్వంలోనే జీర్ణించుకు పోయిన స్వభావం. ఇందుకు సులభంగా గోచరించే కారణాలు రెండు. (1) ఆత్మరక్షణ, (2) స్వయం వ్యాప్తి. మొత్తానికి తన్ను తాను కాపాడుకుంటూ వృద్ధిలోకి రావడానికి మానవుడు పోరాడే స్వభావాన్ని వ్యక్తం చేయడమే సూక్ష్మంగా రణరంగానికి రూపకల్పన ఇచ్చింది. ఈ విధానంతో అంటే మనిషితో మనిషి తరువాత తెగలతో తెగలు, జాతులతో జాతుల నుండి క్రమేపి రాజ్యాలతో రాజ్యాలు - యీనాటి వరకు యుద్ధాలు సాగిస్తూనే వచ్చాయి.

ప్రాచీన భారత రాజనీతిలో యుద్ధం చాలా ప్రముఖ పాత్ర వహించింది. పాలించిన మహారాజులు, చక్రవర్తులు అంతా గొప్ప కీర్తికోసమో, రాజ్యకాంక్షతోనో, అఖండమైన సిరిసంపదల కోసమో సమరాలు జరిపారు. మన దురదృష్టవశాత్తు ఎంతెంత పెద్దపెద్ద ఘోరమైన యుద్ధాలు జరిగినప్పటికీ, మహాయోధులెందరో ఉన్నప్పటికీ, ఆ యుద్ధ తంత్రాన్ని తెలియజెప్పే చరిత్ర వివరాలు వ్రాసి ఉండకపోవడం

చేత పూర్వం మనదేశంలో సైన్యం, వారి ఆయుధాలు, తంత్రాలు, యుద్ధ పద్ధతులు ఎట్లాంటివో తెలుసుకోవడానికి ఖచ్చితమైన ఆధారాలు తక్కువ.

ఇంతవరకూ ప్రాచీన కాలంలో ఉన్న యుద్ధ పద్ధతులను తెలుసుకోవటానికి ఆదికావ్యమైన రామాయణం ఉపకరిస్తుందనే సదుద్దేశ్యంతో శ్రీ సి.వి.యల్. నరసింహారావు నా పర్యవేక్షణలో **"సంస్కృత ఆంధ్ర రామాయణాల్లోని యుద్ధ పద్ధతులు"** అనే అంశాన్ని గ్రహించి ఎం.ఫిల్. డిగ్రీ చేశారు.

ఇప్పుడు ఆ సిద్ధాంత వ్యాసాన్ని, గ్రంథ రూపంలో ముద్రించ టానికి చేసిన సాహసం హర్షదాయకం, గ్రంథాలు చదివే వారు తక్కువైన యీ రోజుల్లో, ఇలాంటి పుస్తకాలు ముద్రిస్తే ఉండే పరిస్థితి వేరుగా ఉంటుంది. ఈ గ్రంథానికి ఈ పరిస్థితుల్లో తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఇచ్చే ఆర్థిక సహాయం కొంత ఊరట నిస్తుంది.

శ్రీ సి.వి.యల్. నరసింహారావు గారు స్వయంగా పండితులు. రామాయణాన్ని ఎన్నో పర్యాయాలు చదివి, పురాణంగా, ఉపన్యాసాలు గా లోకానికి అందించారు. ఆ అనుభవంతో ఈ అంశానికి న్యాయాన్ని చేకూర్చారు.

భారతంలో పద్దెనిమిది పర్వాలుంటే యుద్ధ పంచకం పేర ఐదు పర్వాలు యుద్ధమే. అంతేగాక, మిగిలిన పర్వాలన్నింటి యుద్ధం కలిపితే ఒక పర్వం యుద్ధమౌతుంది. దీన్నిబట్టి మూడవ వంతు భారతంలోనూ యుద్ధం ఉందన్న మాట.

మరి శ్రీమద్రామాయణాన్ని చూస్తే ఏడుకాండలు ఈ ఇతిహాసంలో ఒక కాండకాండమంతా యుద్ధమే. అదీకాక ప్రతి కాండలోనూ కొంతకొంత యుద్ధం ఉంటుంది, మొత్తం చూసుకుంటే రెండు కాండల యుద్ధం ఉన్నది. ఇంత యుద్ధం నిండిన శ్రీమద్రామాయణ భారతాదుల్ని చదివి నేను పాడయ్యానని ఎవరు ఎందుకన (లే)రు? కారణం ఒక్కటే. ఈ యుద్ధం నిండా ధర్మం, సత్యం, తపశ్శక్తి ఇమిడి ఉండటమే.

లోకంలో యుద్ధ ప్రధానమైన లేదా యుద్ధైక దృశ్యాలున్న చిత్రాలని చూస్తే చెడిపోవడం నిశ్చయంకదా! అందుకేకదా ప్రస్తుతం దానిమీద చర్చలు, వాదోపవాదాలు ఈ హింసమీద సాగుతున్నవి.

వాల్మీకి రామాయణంలోని యుద్ధ ఘట్టాల వర్ణనలను పరిశీలిస్తే ఆనాటి యుద్ధాలు పూర్తిగా అనాగరికమైనవిగా కనబడవు. ఆనాటి వీరులు బలోపేతులు, అంతేగాక ధనుర్విద్యలో నేర్పరులు. ఇంకా అస్త్రవిద్యలో వారు చూపిన అద్భుతాలు ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి. వీటన్నిటినీ శ్రీ సి.వి.యల్.నరసింహారావు గారు ఈ గ్రంథంలో ఎంతో వివరణాత్మకంగాను, ఇంకా తెలుగు రామాయణాల్లోని యుద్ధ పద్ధతులతో పోల్చి తులనాత్మకంగాను సోదాహరణంగా వివరించారు.

ఇందులో కోసల రాజ్యాధిపతులైన దశరథ-రాముల (మానవ), కిష్కింధాధిపతులైన వాలి-సుగ్రీవుల (వానరుల), లంకాధిపతులైన రావణ-కుంభకర్ణ (రాక్షసుల) యుద్ధ పద్ధతులు వర్ణింపబడ్డవి. దీన్నిబట్టి చాలామంది రామాయణ యుద్ధాన్ని ప్రుక్కడి మూకల పోరాటంగా భావిస్తారు. ఈ యుద్ధం భిన్నజాతుల మధ్య జరిగినప్పటికీ, ఆ యుద్ధ పద్ధతులందునూ కొంత సమన్వయం కనబడుతుంది. రామాయణ యుద్ధాలయందు ఒక నీతి, ధర్మం ఉన్నదని చెప్పాలి.

పైన చెప్పిన విషయాల నన్నింటిని దృష్టిలో పెట్టుకొని శ్రీ సి.వి.యల్. నరసింహారావు గారు ఈ గ్రంథాన్ని రూపొందించారు. రామాయణంలోని యుద్ధ పద్ధతులు ఈ గ్రంథం ద్వారా తెలుసుకుంటే ప్రాచీన కాలంలో భారతదేశంలో ఏపే యుద్ధ పద్ధతులు, వ్యూహాలు ఉన్నాయో తెలుస్తుంది. ఇట్టి వివరాలతో శ్రమకోర్చి మంచి పుస్తకాన్ని ప్రచురించిన శ్రీ సి.వి.యల్.నరసింహారావును మనసా, వాచా, కర్మణా అభినందిస్తున్నాను.

- నేతి అనంత రామశాస్త్రి



# మంచి - చెడు

– డా॥ కె.కోదండ రామాచార్యులు
M.A. (సంస్కృతము)
M.O.L., M.A., Ph.D. (తెలుగు)
పాంచరాత్రాగమ – "ప్రవర"
ఆంధ్రోపన్యాసకుడు,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, మధిర.

జయత్యాశ్రిత సంత్రాస ధ్వాంత విధ్వంసనోదయః
ప్రభావాన్ సీతయా దేవ్యా పరమ వ్యోమభాస్కరః॥

మంచికి – చెడుకి ఘర్షణ ఏర్పడుటే యుద్ధమునకు నాంది. ఇది వ్యక్తి గతము కావచ్చు, రాజ్యగతము కావచ్చు. వ్యక్తిగతమైతే అతనికి అతని బంధుతతికి కొంత నష్టము లేదా లాభము జరుగవచ్చు. కాని రాజ్యగతమైతే అది జన నష్టమునకు, ధన నష్టమునకు దారి తీస్తుంది. దానితోపాటు ఎవరికో ఒకరికి లాభము జరుగుతుంది.

వ్యక్తిగతమునకు వచ్చినపుడు అంతస్సంఘర్షణ, బహిస్సంఘర్షణ రెండూ ఉంటాయి. మనిషి మనసులో కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులు ప్రకోపించినపుడు వాని వ్యతిరేక గుణములతో పోరాటమేర్పడును. అలాగే దయా, సత్య, శౌచ, శీలాది సద్గుణములు వికసించినపుడు వాని వ్యతిరేక గుణములతో సంఘర్షణ కల్గును. దీనినే "అంతస్సంఘర్షణ" అని అందురు. వీని ఫలితమే బహిస్సంఘర్షణకు దారి తీయును. అపుడు ముఖమున రంగులు మారుట, బొమలు ముడిపడుట, కళ్ళల్లో నిప్పులు కురియుట, పళ్ళు పటపట లాడించుట, చేయెత్తుట, కాలు జాడించుట, అంతకు మించితే బాహాబాహి, కేశాకేశి, ముష్టాముష్టి – ఇవన్నీ బహిస్సంఘర్షణ ఫలితాలు. అందుకే శ్రీ కృష్ణ పరమాత్మ భగవద్గీతలో ఇలా సెలవిచ్చాడు.

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహవైరిణం (3–37)

రాజ్యమునకు, లేదా ప్రజలకు, నష్టం, కష్టం కలుగుతున్నప్పుడు ఒక రాజు ఇంకొక రాజుపై దండెత్తుట అది రాజ్యగత సంఘర్షణ అవుతుంది.

దీనిలో వ్యక్తిగత ద్వేషము కాని, వ్యక్తిగత లాభము కాని అంతస్సూత్రంగా ఉండి ప్రజా క్షేమము, రాజ్యక్షేమము ప్రధానంగా కన్పిస్తుంటుంది.

రామాయణంలో శ్రీరాముడు సాగించిన యుద్ధము, భారతంలో పాండవులు చేసిన యుద్ధము లేదా చేయించబడిన యుద్ధము, లోక క్షేమమును దృష్టియందుంచుకొని జరిగినవే కాని సామాన్య పాఠకునకు వారు తమతమ వ్యక్తిగత ద్వేషమునో - లాభమునో దృష్టియందుంచుకొని యుద్ధము చేసినట్లే యనిపించును. ఇటువంటి వానిలో ఇరుపక్షముల వారికి ప్రాణ, ధన నష్టములు సంభవించినా చెడుపై మంచితనమే విజయాన్ని సాధించినపుడు ఆ నష్టము పరిగణించబడదు.

ఇక్కడ మంచి - చెడు అనేది ఎలా గుర్తించాలి? ఇదొక సమస్య. పరపీడా పరాయణత్వం లేకుండా బహుజన హితాయ, బహుజన సుఖాయ చేసేది ఏదైనా మంచి అవుతుంది. దానికి భిన్నమైనదే చెడు అంటారు పెద్దలు.

వరగర్వంతో రావణుడు లోకకంటకుడై దేవతలను, మునులను బాధిస్తున్నప్పుడు అతనిని శిక్షించవలసిన అవసరము వచ్చింది. అందుకే శ్రీరాముడు అవతరించాడు. శ్రీరామ కళ్యాణము, రామపట్టాభిషేకమునకు విఘ్నము, వనవాస ప్రయాణము, ఖరదూషణాది రాక్షస సంహారము, శూర్పణఖ నాసికా కర్ణ ఖండనము, ఇంతవరకు రావణునితో శ్రీరామునికెట్టి ప్రత్యక్ష సంబంధము కాని వైరము కాని లేదు. సీతాపహరణంతో ప్రారంభ మవుతుంది. అది కూడ హనుమంతుడు లంకకు వెళ్ళి వచ్చిన తర్వాత స్పష్టమవుతుంది.

తాటక, సుబాహు, మారీచుల పీచమడంచుట, ఖరదూషణ కబంధ విరాభాది రాక్షసుల సంహరించుట, వాలిని పడగొట్టుట, మున్నగు వాని యందు శ్రీరామునకు జరిగిన నష్టము లేదు కాని ఇతరులకు కల్గిన మేలుతోపాటు, పరాక్రమవంతుడన్న కీర్తి లభించినది.

యుద్ధానికి కారణాలు, యుద్ధం వలన లాభనష్టాలు, బేరీజు వేస్తున్నామే కాని ఆ యుద్ధంలో ఎన్ని పద్ధతులున్నవో తెల్సుకోవాలిగదా, అందుకు శ్రీ సి.వి.ఎల్.నరసింహారావు గారు చేసిన పరిశ్రమ మనకు కొంత తోడ్పడుతుంది.

యుద్ధ పద్ధతులు, ఆయుధాల చిట్టా మనకెందుకంటారా? విజయం సాధించడానికి కొన్ని పద్ధతులవసరం - ఆయుధాలంటారా వాని అవసరం

లేకపోయినా ఇపుడింకో రకం ఆయుధాలున్నవిగా? రాజకీయ నాయకునిపై ఓటింగ్ ఆయుధం, ఉద్యోగిపై మెమొ, ఇంక్రిమెంట్ కోత, బదిలీ, సస్పెన్షన్, ఇలాంటివి ఎన్నో ఆయుధాలు. ఇలా కాకపోతే వాడి, వేడిగల వాక్య బాణపరంపర ఉండనే ఉంది. ఏ పద్ధతైనా, ఏ ఆయుధమైనా మంచిని పెంచడానికి, చెడును అణచటానికి ఉపయోగపడాలి. అదియే లోక సమ్మతము.

రామాయణంలో మానవ, వానర, రాక్షస జాతుల మధ్య పోరాటం అయినా ఒక నీతి, రీతి, ఉన్నవి కాబట్టే అది తర్వాతి యుద్ధాల కాదర్శమైందంటారు పరిశోధకులు. శ్రీరాముని చరితము సంస్కృతములోను తర్వాత ఆంధ్ర భాషలోని పద్య, ద్విపద, ప్రబంధాది ప్రక్రియలలోను ఏవిధంగా వర్ణించ బడిందో ప్రథమ ప్రకరణంలో వివరించారు శ్రీ నరసింహారావు గారు. వేద కాలంనాటి యుద్ధ పద్ధతులను సూచించి శుక్రనీతి, ధనుర్విద్యా విలాస, కామందకాది గ్రంథములలోనున్న రథికుల భేదములను, రామాయణమునందు చెప్పబడిన దండోపాయ భేదములును విగృహ్యా, సంధాయ, సంభూయ ప్రసంగ, ఉపేక్ష యానములనబడు వానిని చక్కగా వివరించినారు. వివరించబడిన మూల, భృతక, శ్రేణీ, మిత్ర, అమిత్ర, అటవీ, బలములన్నియు ఈనాడు ఇంకొక పేరుతో కన్పిస్తూనే యున్నవి. ద్వంద్వ యుద్ధమునకే అంకయుద్ధము, ఎక్కటి కయ్యము అన్నవి నామాంతరములు. ఈ యుద్ధము ఏర్పడుటకు పరిభూతము, భూమి, మత్సరము, మొదలగునవి కారణములు అని చెప్పిన విషయము ఈనాడు కన్పించుచునే యున్నది.

విలువిద్య, మల్లయుద్ధము, ముష్టియుద్ధము (బాక్సింగ్) నేడు క్రీడా జగత్తున కన్పించుచున్నవి. వానికి సంబంధించిన విషయములు – ధనుర్విద్యాభ్యాసమున నిలచియుండవలసిన తీరు, బాణ ప్రయోగ దశలు, మల్లయుద్ధము నందు అవలంభించవలసిన అవద్రుతం, అవప్లుతం, అవావృతం మున్నగు మండలములు. ఖడ్గములు నామములు, ఖడ్గ విద్యా ప్రచారకములు, ఖడ్గధారి దృష్టి విశేషములు – ఇలా ఒకటేమిటి అనేక ఆయుధముల విశేషములు వానితో చేయబడునట్టి యుద్ధములు విపులముగా వర్ణించబడినవి.

ఇంద్రజిత్తు రావణుడు చేసిన హోమ ప్రక్రియలను తాంత్రిక విద్యలను సూచించడం జరిగింది. కాని వాని ఫలితం తాత్కాలికంగా విజయాన్ని రుచి చూపించినా శాశ్వత నష్టాన్నే కలిగించినవి. కాన తాంత్రిక విద్యలు ఎప్పుడు వినాశకరములే అన్న విషయాన్ని గుర్తించాలి.

దశరథుడు, రావణుడు ఇర్వురు బాహ్య శత్రువులను జయించిన

వారే కాని అంతశ్శత్రువులకు లొంగిపోయారు. దశసు – దిక్షు అప్రతిహతః రథః – దశరథః కాని కైకేయి కారణంగా ఓడిపోయాడు. ఇక రావణుడు పుట్టగానే బాగా ఏడ్చాడు. పెరిగి లోకాలను ఏడ్పించాడు. కాని అంతశ్శత్రువుల చేతిలో తాను ఏడ్పించబడ్డాడు. వీరిర్వురిని చూస్తుంటే వ్యక్తికి అంతశ్శత్రువు లను జయించవలసిన అవసరమే ఎక్కువ ఉన్నదన్న భావన కల్గుచున్నది.

"ఆత్మానం మానుషం మన్యే" – అన్న శ్రీరాముడు వానర సైన్య సాయంతో యుద్ధాన్ని ప్రారంభించాడు. శస్త్రములను, దైవశక్తి ప్రేరితములైన అస్త్రములను ప్రయోగించాడు. ఈ విషయాన్ని పరిశీలించినపుడు మానవ నిర్మితములైన ఖడ్గ, గదా కులిశాద్యాయుధములు, శస్త్రములు వీనితోపాటు దైవదత్తములైన కరచరణాద్యవయవములు. ఆగ్నేయ, వారుణ, బ్రహ్మ, నారాయణాద్యస్త్రములు ఇవన్నియు ఉపయోగింపబడినపుడే దైవ, మానవశక్తి సమ్మిళితమైనపుడే దానవత్వముపై విజయము తథ్యమని స్పష్టమగుచున్నది.

వ్యక్తిలోని సత్త్వగుణమే పూర్తిగా పోరాడలేదు. దానికి కొంత రజోగుణం తోడు కావాలి అపుడే తమోగుణంపై గెలుపు తథ్యము. ఇదే అంశాన్ని శ్రీరామ, సుగ్రీవాదుల మైత్రి, రావణుని ఓటమి సూచిస్తున్నది.

రాజు – ఒకవ్యక్తి అనుకుంటే అతడు చేసే యుద్ధము – వ్యక్తి జీవన సమరానికి ప్రతీక. మంత్రి – వివేచనా జ్ఞానమునకు, సేనాధిపతి – క్రమశిక్షణాయుత ప్రవర్తనకు, చతురంగ బలములు – చతుర్విధ పురుషార్థ ములకు, వ్యూహ నిర్మాణము – సందర్భోచిత కావ్య ప్రణాళికకు, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణలు – దుష్టగుణ సంహార శిష్ట గుణ వికాసములకు ప్రతీకలు అని భావించినపుడు కావ్యములందు వర్ణించబడిన యుద్ధములన్ని వ్యక్తి యొక్క అంతర్యుద్ధములు బహిర్యుద్ధములే. అగును. ఏర్పడిన యుద్ధ ఫలితములును పరిశీలించి తన జీవితమును చక్కదిద్దు కొనుటయే పాఠకుని కర్తవ్యము.

ఆత్మీయులు, మిత్రులు, అయిన శ్రీ సి.వి.ఎల్. నరసింహారావు గారు తమ "సంస్కృతాంధ్ర రామాయణ యుద్ధ పద్ధతులన్న" ఎం.ఫిల్ గ్రంథమునకు ముందుమాటగా నా అభిప్రాయములను చెప్పుకొనుటకు అవకాశమిచ్చినందులకు కృతజ్ఞతాభివందనములు.

మధిర, బుధజన విధేయుడు

19.4.2002 **కె.కె. రామాచార్య,**

# విషయ సూచిక

# సంక్షిప్త పద సూచిక

| | | |
|---|---|---|
| 1. | మల్లయుద్ధము లేక బాహు యుద్ధము | మూ.రా. |
| 2. | బాలకాండము | బాల |
| 3. | అయోధ్య కాండము | అయోధ్య |
| 4. | కిష్కింధ కాండము | కి. |
| 5. | సుందర కాండము | సుం. |
| 6. | యుద్ధ కాండము | యు. |
| 7. | రంగనాథ రామాయణము | రం.రా. |
| 8. | భాస్కర రామాయణము | భాస్క.రా. |
| 9. | రామాభ్యుదయము | రామా. |
| 10. | మొల్ల రామాయణం | మొ.రా. |



# ప్రథమ ప్రకరణము

## 1.0 సంస్కృతాంధ్రములలో వచ్చిన వివిధ రామాయణములు :

### 1.1 రామాయణ విశిష్టత :

ప్రాచీన భారతీయ సంస్కృతికి వేదము మూలమైనది. వేదధర్మ ప్రతిష్టాపనే లక్ష్యంగా రచింపబడిన గ్రంథ రాజములు శ్రీమద్రామాయణ, మహాభారతములు. "వేదః ప్రాచేత సాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" యని కీర్తింపబడినది రామాయణము. పంచమ వేదముగా ప్రసిద్ధము మహాభారతము. ఆదికవి వాల్మీకి మహర్షిచే రచింపబడిన ఆది కావ్యమగు శ్రీమద్రామాయణము భారతీయ భాషలలోనే గాక, ప్రపంచ సాహిత్య చరిత్రలోనే యొక విశిష్ట స్థానమును బొందినది. కావుననే ఇది భారత జాతీయ కావ్యంగా పేర్కొనబడినది[1]. సంస్కృత భాషలో ఛందోబద్ధంగా రచింపబడిన గ్రంథములలో నిది ప్రథమమైన దగుటచే భారతీయ లైకిక వాఙ్మయంలో సకల పురాణేతి హాసాలు దీనిని "ఆది కావ్య"మని ప్రశంసించినవి[2]. మహాభారతం కంటె ముందుగా 'జయం' మను పేరు శ్రీమద్రామాయణమునకున్నట్లు భవిష్యత్పురాణము తెల్పుచున్నది*. రామాయణ కావ్య విశిష్టతను ప్రొఫెసర్ గ్రిఫిల్, విలియం జోన్స్, వింటర్ నిడ్స్, మిస్ మేరీ స్కాట్ వంటి పాశ్చాత్య విద్వాంసులును పొగడుటను బట్టి ఈ గ్రంథము ఖండాంతర ఖ్యాతి నందినదనుటలో విప్రతిపత్తి లేదు. శ్రీమద్రామాయణము పెక్కు భారతీయ భాషలలోనేగాక, నితర ప్రపంచ భాషలు కొన్నిటి యందును రచింపబడినది. రామాయణ కథ నాధారముగా జేసుకొని యనేక స్వతంత్ర గ్రంథములును వెలసినవి. పెక్కు భాషలలో రచింపబడిన గ్రంథము రామాయణము దప్ప మరియొకటి లేదనుట అతిశయోక్తి గాదు.

సంస్కృతాంధ్ర రామాయణములలోని యుద్ధ పద్ధతులను పరిశోధనాంశముగ గ్రహించుట వలన సంస్కృతాంధ్ర భాషలలో వచ్చిన రామ కథాత్మక కావ్యములను రేఖామాత్రముగ దెల్పెదను.

---

1. రామాయణ సుధాలహరి పేజి–3, (2) సంస్కృత వాఙ్మయ చరిత్ర పేజి–37, * అష్టాదశ పురాణాని రామస్య చరితం తథా కార్ష్ణోవేదః పంచమశ్చ యం మహాభారతం విదుః జయేతి నామ్నాత్వేతాంస్తు ప్రవదంత మనీషిణః

## 1.2 సంస్కృత రామాయణములు :

### 1.2.1 రామాయణ కథా కావ్యములు :

వాల్మీకము తరువాత సంస్కృత భాషలో శ్లోక రూపమున వచ్చిన రామాయణములలో కొన్ని చెప్పదగినవి. అవి : (1) జ్ఞాన వాసిష్ఠంగా చెప్పబడు "వాసిష్ఠ రామాయణం" (2) సీతా విజయమను పేరుగల "వసిష్ఠోత్తర రామాయణం (3) ఉమామహేశ్వర సంవాదరూపమై బ్రహ్మాండ పురాణాంతర్గతమైన "అధ్యాత్మ రామాయణం (4) సీత శతకంఠ రావణుని సంహరించిన "అద్భుత రామాయణం" (5) ఆనంద రామాయణం (6) ఆశ్చర్య రామాయణం (7) శ్రీ రామాయణ సారోద్ధారము (8) రామబ్రహ్మానంద కవి రచితమగు "బాల రామాయణం' (9) శబ్ద మంజరి యందలి రామానుజ కవి రచితమగు "బాల రామాయణం" మొదలగునవి గాక ఇతర పురాణములందు, మహాభారతమునందును రామాయణ కథ సంక్షిప్తంగా చెప్పబడినది.

కావ్య రూపమున చెప్పదగు వానిలో కాళిదాస మహాకవిచే రచింపబడిన "రఘువంశము", భట్టి రచితమగు లాక్షణిక కావ్యం రావణకథ, కుమారదాస రచితమగు "జానకీ హరణము", భోజరాజ విరచితమై భోజ చంపువుగా చెప్పబడు "చంపూరామాయణం", దేవయార్య రచితమైన "ప్రసన్న రామాయణం", సాళువ నరసింహరాజ కృతమైన "రామాభ్యుదయం", వామన భట్టబాణ విరచితమగు "రఘునాథ చరితము" మొదలగునవి గాక క్షేమేంద్ర రామాయణ మంజరి, శాకల్యమల్లుని "ఉదార రాఘవం" మధురవాణి రామాయణం, చిత్రకవి "జానకీ పరిణయం', రఘునాథుని "రామచరితం" శేషకవి "కళ్యాణ రామాయణం", వీరరాఘవుని "భద్రాద్రి రామాయణం", "రఘునందన విలాసం", "విక్రమ రాఘవం", "ఉత్తర రాఘవం" శరభోజి "రాఘవ చరితం", వేంకటేశ పండితుని "రామచంద్రోదయం", "రామయమకార్ణవం" రామకర్ణామృతం, "పాదుకా సహస్రం", "హంస సందేశం" యిత్యాదులు రామకథాత్మకములు. గద్య రూపమున వచ్చిన వానిలో వాసుదేవుని "రామకథ" పరదేశిక రామాయణం చెప్పదగినవి[1].

ఇవిగాక కొందఱు పండితకవులు సంస్కృత భాషలో రామకథను ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యములుగా కూడా రచించిరి.

---

1. తెలుగు సాహిత్యము – రామకథ – 31వ పేజి

### 1.2.2 ఆంధ్రభాషలో వచ్చిన రామాయణములు :

తెలుగు భాషలో వచ్చిన సాహిత్య ప్రక్రియ లన్నింటి యందును దాదాపు రామాయణ కథ గ్రహింపబడినది. వీనిలో పద్య గద్యాత్మకముగా కావ్య పద్ధతి ననుసరించి రచింపబడినట్టివి, ప్రబంధ పద్ధతి ననుసరించి నట్టివి, ద్విపద ఛందమున రచింపబడినట్టివి, రూపకములుగా రచింపబడినట్టివి, కేవలం వచన రూపమున రచింపబడినట్టివి, సంస్కృత కావ్యములకు అనువాదము లైనట్టివి, యగు గ్రంథము లనేకములు గలవు. ఇవి యథా మూలముగను, స్వేచ్ఛాను వాదములుగను సాగినవి.

### 1.2.3 తెలుఁగు పద్య రామాయణములు :

చంపూ పద్ధతి ననుసరించి రామాయణ కావ్య రచన చేసిన వారిలో ప్రసిద్ధుడు కవిత్రయంలో ఒకడైన ఎఱ్ఱాప్రగడ. ఎఱ్ఱన రచించిన రామాయణం నేడు అలభ్యము. అట్లే అలభ్యములగు రామాయణములలో ఆంధ్రకవి పితామహుడనే బిరుదుగల కొరవి సత్యనారన, తాళ్ళపాక అన్నమాచార్యులు రచించిన రామాయణములు గూడ చెప్పదగినవి[1]. ఎఱ్ఱన రచించిన రామాయణం సకల వర్ణనాపూర్ణమై సంస్కృత రామాయణానుసారి యైనట్లు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు తెలిపియున్నారు[2]. అట్లే తిక్కన నిర్వచనోత్తర రామాయణం "ఉత్తరకాండ" కథకు మాత్రమే సంబంధించినది. తరువాత పద్య రామాయణములలో మొదట చెప్పదగినది "భాస్కర రామాయణం". ఇది స్వేచ్ఛానువాదం. మరియొకటి ఆతుకూరు మొల్ల రచించిన "మొల్ల రామాయణం", ఇంకను చెప్పదగిన రామాయణములలో కొన్ని....

చిత్రకవి వేంకట రమణ కవి రచించిన "సకల వర్ణనాపూర్ణ రామాయణం" రఘునాథరాయల "రఘునాథ రామాయణం", ఘనగిరి రామకవి "యథా వాల్మీకి రామాయణం", మానూరి గోపాలరావుగారి "యథా వాల్మీక రామాయణం"[3], గద్వాల సంస్థాన విద్వాంసులు* రచించిన యథాశ్లోక తాత్పర్య రామాయణం, వావిలికొలను సుబ్బారావు గారి "ఆంధ్ర వాల్మీకి రామాయణం", జనమంచి శేషాద్రి శర్మగారి "ఆంధ్ర శ్రీమద్వాల్మీకి రామాయణం" మూలానుసరణములు. ఇంకను సర్వశ్రీ చెన్నూరు రామన్న, బసవకవి, వారణాసి లక్ష్మీపతి మొదలగు వారును రామాయణ కావ్య రచన చేసినారు. గోపీనాథం వెంకటకవి రచించిన "గోపీనాథ రామాయణం" శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారి "శ్రీకృష్ణ రామాయణం" ఆత్మకూరి గోవిందాచార్యుల "గోవింద

1. సమగ్ర ఆంధ్ర సాహిత్యం – 8వ సంపుటం (2) తెలుగు సాహిత్యము – రామకథ – 55వ పేజీ, (3) ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసవైఖరి– 116 పేజీ * కాణాదం పెద్దన సోమయాజీ, కొత్తపల్లి రామాచార్యులు, గార్గేయపురపు సుబ్బారావు, కామసముద్రం అప్పలాచార్యులు, తిరుమల కృష్ణమాచార్యులు, బోరవెల్లి శేషకవి యను ఆరుగురు.

రామాయణం" కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి "రామాయణ కల్పవృక్షం" మొదలగునవి గూడ స్వతంత్ర పద్ధతిన రచింపబడినట్టివే. కేవలం "ఉత్తరకాండ"ను మాత్రమే రచించిన వారిలో శ్రీ కంకంటి పాపరాజు, జయంతి రామభట్టు మొదలగు వారు ప్రసిద్ధులు.

సంస్కృతంలోని అధ్యాత్మ రామాయణాన్ని, వాసిష్ఠ రామాయణాన్ని చంపూ రామాయణాన్ని, అద్భుత రామాయణాన్ని, ఆనంద రామాయణాన్ని అనేకమంది కవులు ఆంధ్రీకరించారు. అట్లే హిందీ భాషలో ప్రసిద్ధమైన "తులసీ రామాయణాన్ని (రామ చరిత మానస్) కూడా తెలుగులో అనేకమంది రచించారు.

**1.2.4 తెలుఁగులో వచ్చిన ద్విపద రామాయణములు :**

ద్విపద ఛందస్సులో రామాయణాన్ని స్వతంత్ర కావ్యంగా రచించిన కవులనేకమంది గలరు. ద్విపద రామాయణాలలో మొదటగా చెప్పదగినది 'గోన బుద్ధారెడ్డి'చే రచింపబడిన "రంగనాథ రామాయణము". తరువాత చెప్పదగినవవి 'కట్టా వరదరాజు' రచించిన "వరద రాజ రామాయణం", 'భోసల ఏకోజే' రచించిన "ఏకోజే రామాయణం", రాఘవరెడ్డి గారి "ద్విపద రామాయణం", విజయరామకవి రచించిన "వినుకొండ రామాయణం", మానికొండ సత్యనారాయణ శాస్త్రి గారి "మానికొండ రామాయణం", గణపవరపు వేంకటకవి "బాల రామాయణం", లింగకవి "శతకంఠ రామాయణం", తరిగొండ వేంగమాంబ "వాసిష్ఠ రామాయణం", ఏలేశ్వరపు సుబ్రహ్మణ్య శాస్త్రి గారి "ద్విపద రామాయణం" చెప్పదగినవి. శ్రీ బేతపూడి కృష్ణమంత్రి రచించిన "జానకీ రాఘవం" అముద్రితము.

**1.2.5 ప్రబంధ పద్ధతిన రచింపబడిన రామాయణములు :**

ప్రబంధ రీతిలో రచింపబడిన రామాయణములలో మొట్టమొదటగా చెప్పదగినది 'శ్రీ అయ్యలరాజు రామభద్రకవి' చే రచింపబడిన "రామాభ్యుదయము", తరువాత 'రేవణూరి వేంకటార్యుడు' రచించిన "రామచంద్రోపాఖ్యానం", ఏనుగు లక్ష్మణకవి "రామ విలాసము", పసుపులేటి రంగాజమ్మ "రామాయణ కథా సంగ్రహం", అనంతరాజు జన్నయ "రామకథాభిరామము", దిట్టకవి పాపరాజ కవి "రామ కథాసారము" చెప్పదగినవి. మురారి అనర్ఘరాఘవానికి ప్రబంధాను సరణమైన బిజ్జల తిమ్మరాజు గారి 'అనర్ఘరాఘవం'', మిక్కిలి మల్లికార్జునుడు గారి

"రామచంద్రోపాఖ్యానము", వారణాసి వేంకటేశ్వర కవి "రామచంద్రోపాఖ్యానము", మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి "సీతా రామచరిత్రము", వడ్డాది తిమ్మరాజ కవి "శ్రీరామావతారము", చామర్తి శేషగిరి రాయకవి "రామకథా సుధాలహరి", మండ కామేశ్వర శాస్త్రి "రామకథా సార సంగ్రహం", జయదేవుని ప్రసన్న రాఘవానికి ప్రబంధానుసరణమైన శ్రీ బొడ్డుచర్ల తిమ్మయ్య గారి "ప్రసన్న రాఘవం", అప్పలరాజు గారి "సీతాచరిత్ర" మొదలగునవి ప్రబంధ పద్ధతిన వ్రాయబడిన రామాయణములు.

ఇవిగాక రామకథాత్మకములగు అనేక గ్రంథములు ప్రబంధ రీతిలో రచితములైనవి. అట్లే రామకథ "ద్వ్యర్థి కావ్యములు" "త్ర్యర్థి కావ్యములు, నిరోష్ఠ్య చిత్ర కావ్యములుగా, అచ్చతెనుఁగు కావ్యములుగా అనేకులచే రచింపబడినది.

ఈవిధంగా వివిధ సాహిత్య ప్రక్రియలలో రామాయణము ప్రాధాన్యమును సంతరించుకొనినది. రామాయణ కథా రచన ఇంతవరకు జరిగినదే గాక ఇంకను జరుగుచున్నది. ఇక ముందును జరుగునట్టిది.

**1.3 ప్రసిద్ధ రామాయణములు – యుద్ధ పద్ధతులు :**

**1.3.1 పరిశోధనకు గ్రహించిన ప్రసిద్ధ రామాయణములు :**

సంస్కృతాంధ్ర భాషలలో వివిధ సాహిత్య ప్రక్రియలలో రామాయణ రచన జరిగినది. ఆయా కవులు తమ తమ ప్రతిభా పాటవాలతో ఒకే కథకు తమదైన ప్రత్యేక శైలిలో నూతనత్వాన్ని కల్పించారు. ఆదికవియైన వాల్మీకి మహర్షి "విశ్వశ్రేయః కావ్యమ్"[1] అను ఉత్తమ కావ్య ప్రయోజనాన్ని కోరి ప్రపంచమునకు శ్రేయమును గల్గింపవలెనను సదాశయముతో రామాయణ రచన చేసినాడు. శ్రీరాముని వంటి ఆదర్శమూర్తిని నాయకునిగా జేసి "రాముని వలె ప్రవర్తింపవలెనని "రావణుని వలె" ప్రవర్తింపరాదని లోకమునకు సందేశమిచ్చినాడు. కథతోపాటు నాటి సమాజమును గ్రంథమున ప్రతిబింబింప జేసినాడు. కావ్య ప్రయోజనములలో కవి తన గ్రంథము ద్వారా సందేశము నిచ్చుట ప్రధానమైనది. తరువాత వివిధ అలంకార శాస్త్రవేత్తల అభిప్రాయముల ననుసరించి కావ్యప్రయోజనములలో వైవిధ్యము చోటు చేసుకొన్నది. కావ్య నిర్మాణ పద్ధతులందును మార్పు వచ్చినది. 'భామహుడు' సత్కావ్యము ధర్మార్థ కామమోక్షములందును, కళలందును, నేర్పును, కీర్తిని, ప్రీతిని గల్గించునని చెప్పగా కావ్య ప్రకాశ కర్తయగు "మమ్మటుడు" కావ్యము వలన యశస్సును, అర్థమును,

1. ఆంధ్ర శబ్ద చింతామణి – 1 సూ.

వ్యవహార జ్ఞానమును, అమంగళ పరిహారమును, సద్యః పరనిర్వృత్తియు, నుపదేశమును గలుగునని చెప్పియున్నారు[1★]. మనస్సును రంజింప జేయుటయు కావ్య ప్రయోజనమైనది. అందులకై శబ్దార్థ వైలక్షిణ్యమును కవులాశ్రయించుట జరిగినది. ఆవిధంగా వివిధ కాలములలో, వివిధ కవులచే రామాయణ రచన చేయబడినది. విషయమొక్కటియేయైనను కవులు చెప్పడంలో నేర్పును చూపించారు. ఈ దృక్పథంతో పరిశీలిస్తే సంస్కృతాంధ్ర భాషలలో వివిధ కవులచే రచింపబడిన రామాయణములన్నియు ప్రసిద్ధములైనవే. దేనికది విలక్షణమైనదే. కానీ పరిశోధనాంశమున కొక పరిధిని నిర్ణయించుకొనుట పరిశోధకున కవశ్యాచరణీయము గావున వివిధ కాలములకు చెందిన వివిధ సాహిత్య ప్రక్రియలకు చెందిన సంస్కృతాంధ్ర రామాయణములలో నైదింటిని మాత్రమే గ్రహించుట జరిగినది.

ఇందు మొదటిది సంస్కృత భాషయందు వాల్మీకి మహర్షిచే రచింపబడిన శ్రీమద్రామాయణము. సంస్కృత భాషయందు ప్రప్రథమమైనది. తరువాత కాలపు రామాయణ రచనల కాధారమైనట్టిది యగుటచే దీనిని స్వీకరించుట జరిగినది.

తరువాత నాలుగు తెలుగు రామాయణములను గ్రహించుట జరిగినది. ఇవి భిన్నకాలములలో రచింపబడినవి, వివిధ సాహిత్య ప్రక్రియలలో రచింపబడినవి, అవి :

**(i) రంగనాథ రామాయణము :** ఇది ద్విపద ఛందస్సులో క్రీ.శ. 1240 ప్రాంతమున గోన బుద్ధారెడ్డిచే రచింపబడినది. తెలుగు రామాయణములలో మొదటిది. పుట్టుక చేతనేగాక గుణముచేతను నిది అగ్రగణ్యమైనదే యని ప్రసిద్ధ పరిశోధకులు శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారి అభిప్రాయము[2]. దేశీయ ఛందమైన ద్విపదలో పూర్తి పద్య కావ్యముగ రచితమైనట్టిది. అంతేగాక అవాల్మీకములగు అనేక అంశములు చేర్చబడినట్టి రామాయణములలోను నిదే ప్రథమమైనది. మూలభిన్న గాథాకల్పనలే ఈ రామాయణమునకు విశిష్టత నాపాదించినవి[3].

**(ii) భాస్కర రామాయణము :** మార్గ కవితారీతిలో గద్య పద్యాత్మకముగా తెలుగున రచింపబడిన రామాయణములలో నిది మొదటిది. ఇది క్రీ.శ. 14వ శతాబ్దమునకు చెందినది. హుళక్కి భాస్కరుడు, మల్లికార్జున పండితుడు, కుమార రుద్రదేవుడు, అయ్యలార్యుడు, అను నలుగురు కవులచే రచింపబడినదని పరిశోధకుల

1. సాహిత్య సోపానము – 29 పేజి,
★ కావ్యం యశసే ర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షయే సద్యః పరనిర్వృతయే, కాంతాసమ్మితతయా ఉపదేశయుజే
2. రంగనాథ రామాయణం, పీఠిక – IX పేజీ
3. పైది, XIII పేజీ

అభిప్రాయము. బహుకర్తృకమైన రామాయణములలో నిది మొదటిది. ఈ రామాయణమున మల్లికార్జున భట్టు బాలకాండము, కిష్కింధ కాండము, సుందర కాండములను రచించినాడు. కుమార రుద్రదేవుడు అయోధ్య కాండమును రచించినాడు. భాస్కరుడు అరణ్యకాండమును, యుద్ధకాండమున మొదటి భాగమును రచింపగా అయ్యలార్యుడు యుద్ధకాండము చివరి భాగమును పూర్తి చేసినాడు. ఇది బహు కర్తృకమైనను నిర్దుష్ట కవితారీతితో, స్వతంత్రానువాద విధానము గల్గి సుమనోహర శైలీ సౌకుమార్యములతో సాటిలేని మేటి గ్రంథముగా పేరు పొందినది.

**(iii) మొల్ల రామాయణము :** ఇది అతుకూరు మొల్లచే రచింపబడినది. ఆంధ్ర కవయిత్రులలో రెండవది, రామాయణ రచయిత్రులలో మొదటిది. ఈమె క్రీ.శ. 1581కి కొంత పూర్వకాలమునకు చెందినదని శ్రీ ఆరుద్ర గారి అభిప్రాయము[1]. అంతేగాక ఎఱ్ఱన, అన్నమాచార్యులు వంటి మహనీయుల రామాయణములే కాలగర్భం లో కలసిపోగా కేవలం 871 గద్య పద్యములతో రచింపబడిన “మొల్ల రామాయణం” దొరకడం తెలుగుజాతి అదృష్టమే అంటారాయన. కవయిత్రిచే రచింపబడినది గావడం కూడా ఒక ప్రత్యేకతయే.

**(iv) రామాభ్యుదయము :** ఇది ప్రబంధ యుగమునకు చెందిన కవులలో నొకడైన శ్రీ అయ్యలరాజు రామభద్రకవిచే రచింపబడినది. ఇది మహాప్రబంధమని రామభద్ర కవియే చెప్పియున్నాడు. ఇది పూర్తిగా ప్రబంధ లక్షణములు గల గ్రంథము. ఇందు కాండల విభజన లేక ప్రబంధ పద్ధతిలో ఆశ్వాసముల విభజనయే కనిపించును. ఈ గ్రంథము క్రీ.శ. 1544కు తర్వాత కాలమున రచింపబడినట్లుగా పరిశోధకుల అభిప్రాయము.

రంగనాథ రామాయణము, భాస్కర రామాయణము, మొల్ల రామాయణము, రామాభ్యుదయములే ఆయా కాలములందు తెలుగులో వచ్చిన సమగ్ర రామాయణములుగా విమర్శకులచే గుర్తింపబడినవి. కావుననే కరుణశ్రీగా ప్రసిద్ధులైన శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు తమ “తెలుగు రామాయణములు” అను వ్యాసమున పైన పేర్కొనబడిన రామాయణములనే ప్రధానమైనవిగా వరుసలో చెప్పుట జరిగినది[2].

ఈ ప్రసిద్ధ రామాయణములందు కథతోపాటు అనేక విషయములు

1. సమగ్ర ఆంధ్ర సాహిత్యం – 8వ భాగం – 110 పేజీ.
2. రామాయణ సుధాలహరి – 2వ పేజీ

చెప్పబడినవి. అందును ముఖ్యముగా ఆనాటి పరిపాలనా విధానము, రాజ్యాంగ పద్ధతులు, అంతర్గత రాజ్యాంగ విధానము, యుద్ధ నిర్వహణ పద్ధతులు మొదలగున వెన్నియో గలవు.

పైన పేర్కొనబడిన సంస్కృతాంధ్ర రామాయణములలోని యుద్ధ పద్ధతులను ప్రతిబింబింప జేయుటయే ఈ లఘు సిద్ధాంత వ్యాస లక్ష్యము.

**1.3.2 యుద్ధ పద్ధతులను గ్రహించుటలో యుద్దేశ్యము :**

యుద్ధమున అవలంభించు పద్ధతులు యుద్ధ పద్ధతులుగా చెప్పబడును. రామాయణ కాలమునాటి యుద్ధతంత్ర విధానము, యుద్ధమునకు దారి తీయు పరిస్థితు లెట్టివో తెలుసుకొనవలసి యుండును. పోరాటమనేది మానవ జీవితంలో ఏదో ఒక రూపంలో ఏర్పడుతూనే యుంటుంది. ఇందుకు ప్రధానంగా కనిపించే కారణాలు ఆత్మరక్షణ, స్వయంవ్యాప్తి అంటారు ఆచార్య. నేతి అనంత రామశాస్త్రి గారు తమ "కవిత్రయ భారతం – రాజనీతి" అనే గ్రంథంలో[1], మానవుడు తనను తాను రక్షించుకోవడానికి, తన ఆధిక్యతను ప్రదర్శించడానికి పోరాట తత్వాన్ని ఆశ్రయిస్తాడనియు వారు పేర్కొన్నారు. అట్లే రాజ్యం యొక్క విదేశీ విధానాలు, యుద్ధం చేయడం క్షత్రియ ధర్మమనే విశ్వాసం, ప్రాచీన కాలపు యుద్ధాలకు దారి తీసిన అంశాలని "ప్రాచీనాంధ్ర కావ్యాలు – రాజనీతి" అనే గ్రంథంలో పేర్కొనబడింది[2]. ప్రాచీన కాలపు రాచరిక వ్యవస్థలో రాజు ధర్మ పరిపాలనకు బద్ధ కంకణుడై ప్రజా శ్రేయస్సునే పరమార్థంగా భావించాలని, సంస్కృతాంధ్ర రామాయణముల ద్వారా తెలుస్తున్నది.

లోకంలో రెండు రకములగు తెగలకు చెందిన జీవకోటి యున్నట్లు భగవద్గీత తెల్పుచున్నది[3]. ఒకరు దైవీ సంపత్తిగలవారు. రెండవ వారు ఆసురీ సంపత్తి గలవారు. ఆసురీ సంపత్తి గలవారే రాక్షసులు. వారివలన దైవీ సంపత్తి గల వారికి హాని కలుగుతూనే యుండును. రాజునకు రాక్షసుల బారినుండి సజ్జనులను రక్షింప వలసిన బాధ్యత ఉండును. ఈ మంచిచెడులకు గల్గు సంఘర్షణమే యుద్ధము. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ కొఱకై రాజు యుద్ధాన్ని తప్పక చేయవలసి యుంటుంది.

రామాయణ మహాకావ్యంలోని యుద్ధ పద్ధతులను వివరించడం పరిశోధనా వ్యాస లక్ష్యము గావున ప్రాచీన భారతదేశపు యుద్ధ తంత్రాన్ని గూడ కొంత చెప్పడం

1. కవిత్రయ భారతం – రాజనీతి – 180 పేజీ, 2. ప్రాచీనాంధ్ర కావ్యాలు – రాజనీతి, 169 పేజీ
3. భగవద్గీత – దైవాసుర సంవద్విభాగ యోగం – శ్లో॥

జరిగింది. కొందఱు పండితులు రామాయణము వేదకాలము కంటె ప్రాచీన మైనదనియు అభిప్రాయపడినారు. శ్రీ తట్టా రంగమన్నారు తమ "RAMAYANA – AMRITHAM" అనే వ్యాసంలో ఈ విధంగా అంటారు. "Ramayana is as old as Vedas. Evidence of this can be discerned from the tenth Mantra of 'Rigveda' in which the story of Rama briefly described".

భద్రో భద్ర యా సచమాన అగాత్
స్వసారం జారో అభ్యేత పశ్చాత్.
సుప్రకేతైః ద్యుభిః అగ్నిర్వితిష్టన్
రుశద్భిః వర్ణైః అభిరామ మస్థాత్![1]

In the four charanas of Sloka four prime events of the Ramayana are dalineated – In the first line sarva Mangala swaroopa (i.e.) Ramabhadra went to the forest with Sarva Mangala Swaroopini (i.e. Sita). In the second line. lewdster (Ravana) came near her with evil intentions. In the third line the sky scrapers and mansions of Lanka were consumed in fire and in the fourth line with his brightful army (Ravana) faced Rama[2].

రామాయణము వేద ధర్మము నాశ్రయించినదని పెక్కుఱు పండితులు తెల్పియున్నారు. వాల్మీకి మహర్షియే స్వయముగా "వేదోపబృంహణార్థాయ', వేదైశ్చ సమ్మితమ్' అని తెల్పినారు. అంతేగాక "వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే। వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" 'రామాయణం వేదసమమ్' ఇత్యాది ఋషి వాక్కుల ననుసరించియు రామాయణము వేదతుల్యమని నిరూపింపబడుచున్నది. కావుననే వేదకాలంనాటి యుద్ధ పద్ధతులను గూడా సంగ్రహముగ తెల్పుట జరిగినది.

ఆధునిక పరిశోధకుల అభిప్రాయము ననుసరించియు రామాయణ యుద్ధము క్రీస్తు పూర్వ కాలమునకు చెందినది. భారతీయ సిద్ధాంతముల ననుసరించి యుగములలో రెండవదైన త్రేతాయుగమునకు చెందినది. ఈవిధముగా భారత దేశమునకు సంబంధించి రామాయణ యుద్ధము అతిప్రాచీనమైన దనుటలో విప్రతిపత్తి లేదు. అకాలం నాటి సైనిక వ్యవస్థ, వ్యూహ నిర్మాణము, యుద్ధ పద్ధతులు మొదలగు విషయములను ఈ వ్యాసమున వివరించుట ద్వారా నాటి భారతీయ సంస్కృతీ వైభవము తెల్పినట్లగును. ఈ కాలంనాటి యుద్ధాలకు, ప్రాచీన కాలపు యుద్ధాలకు చాలా తేడా కనిపిస్తుంది. యుద్ధ వీరులలోను, వారుపయోగించు అయుధములలోను

1. ఋగ్వేదము – 10.3.3
2. రామాయణ సర్వస్వము – 1వ పేజీ

చాలా వైవిధ్యం కనిపిస్తుంది. యుద్ధ లక్ష్యాలలోను తేడా కనిపిస్తుంది.

రామాయణ, భారతాది ఇతిహాస కాలపు యుద్ధాలలో ధర్మ రక్షణ ప్రధాన ధ్యేయంగా కనబడుతుంది. ఆనాటి వారికి ధర్మమే జయిస్తుందనే నమ్మకం ఉండేది. కావుననే "యతో ధర్మస్తతో జయః", "ధర్మో రక్షతి రక్షితః" వంటి సూక్తులు పుట్టినాయి. రామాయణమున మానవ, వానర, రాక్షస జాతుల మధ్య జరిగిన యుద్ధాలు వర్ణింప బడినాయి. ఏ జాతికి సంబంధించిన యుద్ధ పద్ధతులు ఆ జాతికి యున్నప్పటికి యుద్ధతంత్రంలో కొంత సమన్వయం కనబడుతుంది. బ్రహ్మశ్రీ చందూరి వెంకట సుబ్రహ్మణ్యం గారు తమ "శ్రీమద్వాల్మీకి రామాయణం" అనే గ్రంథంలో వానరులు, రాక్షసులు గూడ భిన్న తెగలకు చెందిన మనుష్యులే నని వివరించారు[1]. ఆనాడు సామ, దాన, భేద, దండోపాయములను ప్రయోగించడంలో ఒక క్రమాన్ని పాటించే వారు. యోధుల శరీర బలం ఆయుధాలను ప్రయోగించడంలో నేర్పు యుద్ధంలో ప్రధానంగా పరిగణింపబడేవి. దొంగదెబ్బ దీయడాన్ని వీరుడు అవమానకరంగా భావించేవాడు. శక్తివంతమైన ఆయుధములున్నప్పటికి వీరులు సంయమనం పాటించే వారు. "చెల్లియుండియు సైరణ సేయునతడు" పుణ్య పురుషుడుగా పరిగణింప బడేవాడు. కావుననే ప్రళయాన్ని సృష్టింపగల ఆయుధాలున్నప్పటికి తొందరపడి ప్రయోగించే వారుకారు.

యుద్ధం వినాశకారి. అది రాజును, రాజ్యాన్ని నాశనం చేస్తుంది. కనుక రాజైన వాడు సాధ్యమైనంత వఱకు యుద్ధానికి పూనుకొనరాదనే రామాయణ, మహాభారత యుద్ధాలు ఉపదేశిస్తున్నాయి. పోరాటతత్త్వం మానవునకు సహజ లక్షణమైనప్పటికి అది సంయమన పూరితం కావాలి. సజ్జన సంరక్షణ ధర్మ రక్షణలకే పరిమితం కావాలి. ఇతరుల సంపదను దోచుకోవడానికి ప్రయత్నించువాడు నాశనాన్ని పొందుతాడని గ్రహించాలి. ప్రతి రాజ్యము రామరాజ్యము కావాలి. ప్రతిపాలకునకు రాముడు ఆదర్శప్రాయుడు కావాలి.

ఈవిధంగా ధర్మరక్షణకై జరిగిన రామాయణ కాలంనాటి ప్రాచీన భారతీయ యుద్ధ పద్ధతులను, వాని విశిష్టత ఇందు తెల్పుట జరిగినది.



1. శ్రీమద్వాల్మీకి రామాయణం – 73వ పేజీ

# ద్వితీయ ప్రకరణము

## 2.1 యుద్ధము - దాని తత్త్వము :

"యుధి - యోధనే" అను సంస్కృత ధాతువు నుండి నిష్పన్నమైన రూపమే 'యుద్ధము'. తెలుగులోను, సంస్కృతములోను యుద్ధమనే పదానికి అనేక పర్యాయ పదములున్నవి. అపకారమే యుద్ధము లేక విగ్రహమగునని కౌటిల్యుడు తెల్పినాడు.

దేనివలన విరోధము అణచివేయబడుతుందో, లొంగదీయబడుతుందో అదే యుద్ధమని శుక్రనీతి తెల్పుచున్నది[1].

విరోధులు రెండు రకములుగా నుంటారు. వారు (1) అంతశ్శత్రువులు (2) బాహ్య శత్రువులు. అంతశ్శత్రువులను మానవుడు శమ, దమాది గుణ సంపత్తితో జయింపగలడు. బాహ్య శత్రువులను ఆయుధ సంపత్తితో, శరీర బలంతో జయింప గలడు. దశరథుడు, రావణుడు వంటి వారు కామానికి లొంగి అంతశ్శత్రువుల చేతిలో పరాజయాన్ని పొందినారు. ఈ విధమైన వేదాంత భావనలతో చూచినను రామాయణమున అనేక ఉదాహరణలు కనబడతాయి. బాహ్య శత్రువులను గూడా ద్వంద్వాతీతుడై యుద్ధమున చంపినప్పటికి పాపము గలుగదని భగవద్గీతబోధిస్తున్నది.*

సాధారణంగా యుద్ధమనే పదం బాహ్య శత్రువులపై చేసే పోరాటమును తెల్పునదిగనే రూఢమైనది. ఈ పోరాటతత్త్వం మానవ జాతి ఆవిర్భవించిన కాలం నాటి నుండియే మానవ స్వభాంలో మిళితమై యున్నది. వేదకాలం నాటి నుండియే భారతీయులు యుద్ధతంత్ర జ్ఞానమును పొందియున్నారు.

## 2.2 వేదకాలం నాటి యుద్ధ పద్ధతులు :

వేదాలలో ఋగ్వేదం అతి ప్రాచీనమైనది. ఆ ఋగ్వేద కాలంలో 'ఆర్యులు'గా పిలువబడునట్టి వారు కృషియే ప్రధాన వృత్తిగా స్వీకరించినప్పటికి కొందఱు శస్త్ర జీవులైనారు. ఆనాటికే భారతదేశమున రాచరిక వ్యవస్థ గలదు[1]. ఋగ్వేదమున దాశరాజ యుద్ధం వర్ణింపబడినది. ఇది సిందునదీ తీరమున జరిగినది. సప్తసింధులో వేఱువేఱుగా నున్న ఆర్యజనులను ఏకతాబద్ధం చేయుట ఇందు చెప్పబడినది. పదిమంది రాజులు కలసి సుదాసుతో యుద్ధం చేసినారు. ఋగ్వేద కాలంనాటి మరొక భీషణమైన

---

1. శుక్రనీతి, 4-7 పేజీ 468
2. ఆర్ష విజ్ఞాన సరస్వతి - 92 పేజీ

* సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభే జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వనైకం పాపమవాప్స్యసి 2-38 శ్లో

యుద్ధం 'దస్యుహత్య' లేక 'శంబర యుద్ధం'. ఇది దివోదాసునకు శంబరునికి జరిగిన యుద్ధం. భరద్వాజుడు, వసిష్ఠుడు, వామదేవుడు, శంబర యుద్ధాన్ని గుఱించి చెప్పినారు[1].

ఆనాటి సైనిక వ్యవస్థ క్రమశిక్షణతో కూడినది. సేనకంతటికి ప్రధానాధికారి రాజు. రాజు తర్వాత పెద్దగా చెప్పదగిన వాడు సేనాని. శుక్ల యజుస్సంహితలో ఆనాటి రాచరికపు వ్యవస్థ; యుద్ధతంత్ర విశేషాలు విపులంగా చెప్పబడినవి. సామాన్యంగా సంవత్సర కాలమంతయు దండయాత్రలతోనే గడిచేది. రాష్ట్రంలో అంతర్గత శత్రువులను శిక్షించడానికి ఆయా ఋతువులలో ఆయా దిక్కులకు జైత్రయాత్రకై వెళ్లెడివారు. రాజులకు రాజ్య విస్తర కాంక్ష అధికంగా ఉండేది. రాజులు యుద్ధానికి బయలుదేరి వెళ్ళునప్పుడు మంత్రి కుడిప్రక్కన ఉండేవాడు. విద్వాంసులు వేదఘోష చేయుచుండగా రాజులు యుద్ధానికి బయలుదేరే వారు[2]. ఆ కాలం నాటికి చతురంగ బల వ్యవస్థ లేదు. త్రిరంగ సేనయే గలదు. రథబలము, అశ్వబలము, కాల్బలములు మాత్రమే ఉన్నవి. ఇంకా గజబలం ఏర్పడలేదు[3]. మూడు చక్రాల రథములును గలవు. రథములకు బలమైన గాడిదలను కట్టెడి వారు. ఆ విషయాన్ని ఈ మంత్రార్థము తెలియజేయుచున్నది.

"ఓ అశ్వనీ దేవతలారా! మీ మూడు రథముల మూడు చక్రములెక్కడ? బలమైన గాడిదలను కట్టుకొని ఎప్పుడు యజ్ఞమునకు వచ్చెదరు[4]". రథబలమును గూర్చిన ప్రశంస సంహితలయందును, బ్రాహ్మణముల యందును గూడా పెక్కుచోట్ల కనబడుచున్నది. ఐతిరేయి బ్రాహ్మణకాలము నుండి రథి, సారథులు వేరువేరుగా నేర్పడినారు. అంతకు పూర్వము రథికుడే స్వయముగా సారథ్యము చేసుకొనవలసి వచ్చెడిది.

యుద్ధములలో గుఱ్ఱముల నుపయోగించుట అథర్వవేద కాలమునకు అధికమైనది. యుద్ధమున పదాతిదళ ప్రాశస్త్యమును గూర్చి అగ్ని పురాణము పదాతి దళ మధికముగా నున్న ప్రభువే ఎల్లప్పుడు శత్రువును జయింపగలడని తెల్పియున్నది.★

యోధులు యుద్ధమునకు బయలుదేరునపుడు శిరస్త్రాణములను, లోహ కవచములను ధరించెడి వారు. శిరస్త్రాణము, ఉష్ణీషము (తలపాగా) రెంటిని 'శిప్ర' అనెడివారు. వామదేవుని ఋక్కునందలి 'శిప్ర' పదము[5] శిరస్త్రాణము అను అర్థము

1. ఋగ్వేద ఆర్యులు - 106 పేజీ
2. ఋగ్వేదము - 17-41
3. ఋగ్వే ఆర్యులు - 146 పేజీ
4. ఋగ్వే ఆర్యులు - 156 పేజీ

★ సేనా పదాతి బహుళా శత్రూన్ జయతి సర్వదా

5. ఋగ్వేదము 4 - 37-4

నిచ్చునదిగా రాహుల్ సాంకృత్యాయన్ అభిప్రాయపడిరి.

ఋగ్వేద కాలంలో యుద్ధం చేయడానికి రాగి లేక ఇత్తడితో చేయబడిన గండ్రగొడ్డళ్లు, బల్లెములు, కత్తులు, కటారులు, ఆయుధములుగా నుపయోగించెడి వారు. ధనుస్సు ప్రధానాయుధంగా చెప్పబడింది. ఋగ్వేదం ఆఱవ మండలంలోని డెబ్బది యైదవ సూక్తమగు 'మన్యు సూక్తము'న ధనుస్సు యొక్క విశిష్టతను గూర్చి ఇట్లు చెప్పబడినది.

ఓం ధన్వనాగా ధన్వనాజిం జయేమ
ధన్వనా తీవ్రా స్సమదో జయేమ
ధనుశ్శత్రోరపకామం కృణోతి
ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ[1]

ధనుస్సువలన శత్రువుల ఆయుధములను తునాతునకలు చేయుదుము. ధనుస్సు చేతనే యుద్ధరంగమున తీక్ష్ణమై మదముతో నున్న శత్రువులను జయింతుము. ధనుస్సు శత్రువులను భిన్న మనోరథులుగా చేయును. ధనుస్సు చేతనే దిక్కులన్నిటిని జయింతుము గాక! అని దాని భావము.

బాణముల కొనలు లేడికొమ్ములతో, ఇనుముతో చేయబడెడివి. బాణాలు 45 అంగుళముల నిడివిగలవి కూడా యుండేవి. బాణమునకు నాలుగు భాగము లుండెడివి. ముందు భాగాన్ని అదేకమని, అందులోను పదునైన భాగాన్ని శల్యమని, చివరి భాగాన్ని తేజనమని, తోక పర్ణమని పిలువబడేది.

ఇతర ఆయుధాలలో కులిశము లేక వజ్రము, పరశువు (గండ్ర గొడ్డలి) చెప్పదగినవి. కత్తులు ఆయుధములుగా ఉపయోగపడేవి[2]. అగ్ని కూడా ఆయుధంగా ఉపయోగపడేది[3]. వైదిక మంత్రాలు ఆయుధాల్లాగా పనిచేసేవి. మంత్రోచ్చారణలో స్వరవర్ణాది లోపం లేని మంత్రాలు శబ్ద ప్రధానాలై శక్తివంతమైన ఆయుధాల వలె పనిచేస్తాయని ఆనాటి వారి నమ్మకము. వృత్రాసురుడు ప్రార్తన చేయుచూ "ఇంద్ర శత్రుర్వర్థస్వ" అనే మంత్రాన్ని తప్పుగా పల్కటం చేత ఆతడు ఇంద్రునిచే సంహరింప బడినాడు.

శిరస్త్రాణములనేగాక యోధులు భుజకీర్తులును ధరించెడి వారు. ఇవి

1. ఋగ్వేదం, 6-75-2
2. పైది, 16-12
3. పైది 16-54

చర్మముతోను, ఎముకలతోను, లోహములతోను తయారు చేసెడివారు.

మల్లులను గురించి గాని, మల్ల విద్యను గురించి గాని, ఋగ్వేదము పేర్కొనలేదు. తరువాత కాలంలో ఈ విద్య ప్రసిద్ధికి వచ్చింది. ముష్టి యుద్ధాన్ని గురించి విశ్వామిత్రపుత్రమధుచ్ఛందుడు స్పష్టంగా చెప్పాడు[1]. దాని భావము "ఓ ఇంద్రా నీచే రక్షితమైన గుఙ్ఞములతోను, ముష్ఠి హత్యతోను, మేము శత్రువులను అడ్డగించెదము". ఇందు 'హత్య' అనగా యుద్ధమని అర్థము. ముష్ఠి హత్య అనగా ముష్ఠి యుద్ధము.

అథర్వ వేదమున సీసపు గుండ్లతో ప్రయుక్తములైన తుపాకుల ప్రసక్తి గలదు. కానీ అవినీతి తుపాకుల వంటివి గావు. తైత్తిరీయ సంహిత 1వ కాండము 5వ ప్రశ్నయందు శతఘ్నిని గూర్చి చెప్పబడింది.

"ఏషావై సూర్మీకర్ణకా వత్యేతయా హస్మివై
దేవా అసురాణాగ్ం శత తర్హాం స్తృహంతి
యదేతయ సమిధ మాధధాతి వజ్రమేవై
తచ్ఛతఘ్నీం యజమానో భ్రాతృవ్యాయ ప్రహరతి"

ఆదిమవాసులతో ఆర్యులకు జరిగిన యుద్ధాలను గూర్చి 'ANCIENT INDIA" అనే ఆంగ్ల గ్రంథంలో శ్రీ రమేష్‌చంద్ర దత్త్ Wars with aborigins అనే ఛాప్టరునందు ఋగ్వేదంలో చెప్పబడిన యుద్ధ విషయాలకు సంబంధించిన ప్రార్థనలను వివరించారు[2].

## 2.3 వేదకాలం తరువాత గల యుద్ధతంత్రం :

శత్రువులను జయించడానికి భారతీయులు సామదాన భేద దండోపాయ ములను ప్రయోగించెడి వారు. మొదటి మూడు ఉపాయములతో శత్రువు లొంగనపుడే దండనీతి ననుసరించి యుద్ధానికి సిద్ధపడేవారు. గౌతముడు దండనీతికి నిర్వచనం చెప్తూ 'నియంత్రణ' జేయడం అంటాడు. రాజు ధర్మాన్ని అతిక్రమించిన వానిని 'దండన' ద్వారా నియంత్రిస్తాడు. మహాభారతం శాంతిపర్వంలో భీష్ముడు ధర్మరాజునకు దండనీతి జన్మ ప్రకారాన్ని వివరంగా తెలియజేస్తాడు[3]. ఆ విషయ సారాంశము.

"కృతయుగంలో దండనీతి అవసరమే లేకపోయింది. క్రమంగా మానవులలో రాగద్వేషములు వృద్ధిచెంది అధర్మం పెచ్చు పెరిగింది. అప్పుడు ఇంద్రాది

1. ఋగ్వేదం, 1-8-2
2. Ancient India - Chapter-II, పేజీ-II

దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్లి ప్రార్థింపగా, ఆయనచే స్వామి, అమాత్యుడు, రాష్ట్రము, దుర్గము, కోశము, సుహృద్బలములు, అన్వీక్షకీ, త్రయీ, వార్త, దండనీతి, అరిమిత్ర, ఉదాసీనాదులతో గూడిన నూఱువేల అధ్యాయముల గ్రంథము బోధింపబడినది.

పై విషయమును బట్టి అధర్మమును నియంత్రించుటయే దండనీతి ప్రయోజనమని తెలియుచున్నది.

ప్రాచీన భారతీయులకు యుద్ధ శాస్త్రమును గుఱించి పూర్తి పరిజ్ఞానము గలదు. వైద్యశాలలు, పాఠశాలలు, దేవాలయ ప్రదేశములు, పుస్తక భాండాగారములు, చారిత్రక స్మారక చిహ్నములు గల ప్రదేశములు శత్రువుల దాడులకు గురికాకుండా నిషిద్ధము చేయబడినవి. ఈ విషయములకు సంబంధించిన వివరణ మహాభారతము నందును, ధర్మ శాస్త్రములందును గలదు.

శత్రుమర్దనమే ప్రధాన లక్ష్యముగా సాగునట్టి యుద్ధమునందు కూడా ప్రాచీన భారతీయులు వివేకమును, అనుకంపను ప్రదర్శించిరి. ఇందులకు మన ప్రాచీన సాహిత్యమున పెక్కు ఉదాహరణములు గలవు. యుద్ధారంభమునకై శుభతిథిని నిర్ణయించుకొనెడి వారు. రాజు శాంతికాముకుడైనను సర్వదా యుద్ధ సన్నద్ధుడై యుండెడి వాడు. రాజే స్వయంగా సైన్యాన్ని నడిపించేవాడు. ఆ విషయాన్ని గూర్చి శ్రీ వి.యమ్.ఆప్టే ఈవిధంగా అంటారు.

As regards military matters, the King must be always prepared for war. He should lead his fighting hosts personally be brave and fearless in the field[1].

రాజు యుద్ధరంగంలో సకవచుడై, సాయుధుడై, యథాశక్తిని "యశోవా మృత్యుర్వా" యన్నట్లు యుద్ధం చేస్తాడు. యుద్ధరంగంలో మరణించిన వీరునికి వీర స్వర్గం లభిస్తుందని భావించే వారు. అందువలన వీరులు వీర మరణాన్నే వాంఛించే వారు.

రాజులు రాజ్యరక్షణకై పటిష్ఠమైన దుర్గ నిర్మాణాన్ని చేసుకొనే వారు. యుద్ధ తంత్రంలో దుర్గ రక్షణయు ప్రధానమైనది. రాజ్యానికి ఉండవలసిన సప్తాంగాలలో

1. History & Culture of the Indian People V of I.

దుర్గం నాల్గవది. మత్స్యపురాణంలో కోట యొక్క ఆవిర్భవాన్ని గురించిన కథ చెప్పబడింది. దేవతల బారినుండి రక్షింప బడటానికై మాయ, విద్యున్మాలి, తారకాసురుడు బ్రహ్మదేవుని గురించి ఘోరమైన తపస్సు చేశారు. బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకొనుమనగా భూ జల చరాదుల నుండి రక్షణగల కోటను వారు కోరుకున్నారట. బ్రహ్మ వారికి మట్టికోటను నిర్మించుకొనుడని చెప్పి అదృశ్యుడైనాడట. మనువు ఆరు రకాల దుర్గాలను చెప్పాడు. వానిలో గిరిదుర్గం శ్రేష్టమైనదిగా చెప్పబడింది. కోటలకు చుట్టూ అగాధములైన పరిఖలుండేవి.

యుద్ధాన్ని యోధులు తమకు సములైన వారితోనే చేసెడివారు. సాధారణంగా ఆశ్వికుడు ఆశ్వికునితోను, రథికుడు రథికునితోను, గజారూఢుడు గజారూఢుని తోను, బంటు వేఱొక బంటుతోను యుద్ధము చేయుట నీతిగా భావింపబడేది. విష పూరితములైన శస్త్ర శరముల నుపయోగించెడి వారు కారు. యుద్ధ మొనర్చునపుడు యోధుడు అతిక్రుద్ధుడుగా నుండరాదు. శరణాగత రక్షణము ముఖ్య ధర్మముగా భావింపబడెడిది.

యుద్ధా చరణమున తుల్య సంఖ్యా బలములు చేకూఱనపుడు వేఱు నియమములు పాటించెడి వారు. ఒక గజారూఢుని ఐదుగుఱు ఆశ్వికులుగాని, పదిహేను మంది పదాతులుగాని ఎదిరింప వచ్చును. అట్లే ఒక ఆశ్వికుని ముగ్గురు పదాతులు ప్రతిఘటింప వచ్చును. వ్యవసాయ వృత్తి నాశ్రయించిన రైతులు, మరియు శ్రామికులు మొదలగు వారి జీవనమునకు యుద్ధము భంగము గల్గింపరాదు. ఇట్టి భారతీయ యుద్ధనీతిని గూర్చి తెలుసుకొనిన విదేశీ యాత్రికుడైన మెగస్తనీస్ (క్రీ.పూ. 4వ శతాబ్దికి చెందినవాడు) ఆశ్చర్యమును పొందినాడు[1].

యుద్ధ రంగమున గాయపడిన యోధులను దయతో చూచుట భారతీయుల స్వభావము. సాధారణముగా సూర్యాస్తమయమునకు యుద్ధ విరమణ జరుగు చుండెడిది. కాగడాల వెలుగులో రాత్రి యుద్ధము చేయుటయు గలదు. యుద్ధ విజయమును పొందిన రాజు భగవదాశీర్వాదముల నందుటకై విజయోత్సవములు

1. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశం – 6వ సంపుటం, 228 పేజీ

నిర్వహించెడి వారు. బ్రాహ్మణులకు, బీదలకు సంతర్పణలు జరిపి దక్షిణల నిచ్చెడి వారు.

భారతసేన సాధరణముగా చతురంగ బలముగా విభజింపబడినది. అది గజబలము, అశ్వబలము, రథబలము, కాల్బలము అను చతుర్విధ అంగములతో సంకలితమైనది. నౌకాదళ వ్యవస్థ కూడ పనిచేసేది. ప్రాచీన భారతమున సేనా విభాగముల విభజన అనేక విధములుగా గలదు. పత్తి, సేనాముఖము, గుల్మము, గణము, వాహిని. పృతన, చమువు, అనీకిని, అక్షౌహిణి అనునవి నాటి సేనా విభాగములు. నేటి బెటాలియనులు, రెజిమెంట్లు, కంపెనీలు. ఈ విధమైనట్టివే. అన్నింటిలో పత్తి విభాగము అత్యల్పమైనది. ఇందు ఒక రథము, ఒక ఏనుగు, మూడు అశ్వములు ఐదుగురు పదాతులు ఉందురు. పత్తి విభాగమునకు మూడు రెట్లు సేనా ముఖముగా చెప్ప బడును. మూడు సేనా ముఖములు కలిసినచో ఒక గుల్మమగును. మూడు గుల్మములు కలసి గణమగును. మూడు గణములు కలసి ఒక వాహిని యగును. మూడు వాహినులు గలసిన 'పృతన' యని చెప్పబడును. మూడు పృతనలు కలసిన ఒక చమువు అగును. మూడు చమువులను ఒక 'అనీకిని' యందురు. పది అనీకునులు ఒక అక్షౌహిణియగును.

**ఈ క్రింది పట్టికలో వానికి సంబంధించిన వివరములు చెప్పబడినవి :**

| నెం. | సేనల పేరు | రథములు | గజములు | అశ్వములు | కాల్బలము |
|---|---|---|---|---|---|
| 1. | పత్తి | 1 | 1 | 3 | 5 |
| 2. | సేనాముఖము (3 పత్తులు) | 3 | 3 | 9 | 15 |
| 3. | గుల్మము (3 సేనాముఖములు) | 9 | 9 | 27 | 45 |
| 4. | గణము (3 గుల్మములు) | 27 | 27 | 81 | 135 |
| 5. | వాహిని (3 గణములు) | 81 | 81 | 243 | 405 |
| 6. | పృతన (3 వాహినులు) | 243 | 243 | 729 | 1215 |
| 7. | చమువు (3 పృతనలు) | 729 | 729 | 2187 | 3645 |
| 8. | అనీకిని (3 చమువులు) | 2187 | 2187 | 6561 | 10935 |
| 9. | అక్షౌహిణి (10 అనీకములు) | 21870 | 21870 | 65610 | 109350 |

అక్షౌహిణీ సంఖ్య వీనిలో పెద్దదిగా చెప్పదగినది. ప్రతి పటాలమునకు ఒక అధిపతి యుండెడివాడు. ఆ అధిపతులను పత్తిపాలకుడు, సేనా ముఖుడు, గౌల్మికుడు, గణపతి, వాహినీపతి, పృతనాపతి, చమూపతి, అనీకినీపతి, అక్షౌహిణీపతి యను పేర్లతో పిలిచెడి వారు. అన్నివిధాల పదాతి దళమే శ్రేష్టమైనది. హరిహయ చతురంగమను యుద్ధశాస్త్రము ఆయా బలముల విశిష్టతను వివరంగా తెలియజేసినది.

చతురంగ బలములకు సంబంధించిన సేనా వ్యవస్థ శ్రీమద్రామాయణ, మహాభారతములందు గలదు. భారతదేశపు ప్రాచీన యుద్ధములలో రథమునకు గల ప్రాముఖ్యము అర్థశాస్త్రమున విశేషముగా చెప్పబడినది[1]. రథస్థుడైన యోధుడు మిక్కిలి సులభముగా శత్రుసైన్యము నెదిర్చి వారిని చెదరగొట్టగలదు. రథములకు గుఱ్ఱములనేగాక ఎద్దులు, గాడిదలు మొదలగునవియు కట్టెడివారు. అనేక విధములగు రథములను శుక్రనీతి వర్ణించియున్నది. రథములకు ధ్వజములను కట్టెడివారు. రథ బలమునకు ఆ ధ్వజములే జీవము. కనుకనే దానిపేరిట సేనకు "ధ్వజిని" యనుపేరు గల్గినదని పండితుల అభిప్రాయము. యుద్ధమున రథికుడు ధ్వజమును గూడా కాపాడు కొనవలెను. వసు చరిత్రమునందు ఏకచక్ర రథము[2], హరివంశమున అష్టచక్ర రథము, శృంగార నైషధమున కామగమనము గల రథము[3], హంసలను పూన్చిన రథము[4] వర్ణింపబడినవి. తరువాత చారిత్రక యుగమునాటికి రథబల సంప్రదాయము క్రమక్రమముగా క్షీణించినది. బాణుని హర్షచరిత్ర నాటికి రథముల ప్రశంసయే కనబడదు.

రథబలము తరువాత చెప్పదగినది గజబలము, గజముల నుపయోగించి దుర్గమములగు ప్రదేశములందును విజయము సాధించుటను గూర్చి హరిహయ చతురంగము దెల్పిన విషయములను సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ మీవిధముగా తెల్పినది[5].

జలే స్థలేచదుర్గేచ । శాఖిభిః సంకటే తథా
సమేచ విషమే చైవ । జయో నాగవతాం ధ్రువం

జల ప్రదేశములలోగాని, దుర్గారణ్య ప్రదేశములలోగాని, సమ, విషమ ప్రదేశములలో గాని, గజ బలమునుపయోగించుకొనుటకై వానికి ప్రత్యేక శిక్షనలనిచ్చెడి వారు. గజ బలము సేనకొక పెట్టనిగోడగా నుండెడిది.

1. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, III పార్టు పేజి-594, 2. వసుచరిత్ర - 1-95
3. శృంగార నైషిధం 8-24, 4. Ibid 2-105, 5. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము,పేజి-595

సేనలో గజబలము తరువాత ముఖ్యమైనది అశ్వబలము. అశ్వబల ప్రాశస్త్యమును హరిహయ చతురంగ మిట్లు తెల్పినది.

శక్య మశ్వసహస్రేణ కృత్స్నాంజేతుం వసుంధరాం
నయచ్ఛక్యం గజైర్జేతుం పత్తి భిర్వా ప్రహారిభిః[1]

గజ పదాతి బలములచే జయింపరానిదెల్లను అశ్వబలముననే గెలువవచ్చును. ప్రాచీన భారతమున అశ్వశిక్షను గూర్చి తెల్పు శాస్త్రములును పెక్కులున్నట్లు తెలియును. అశ్వాయుర్వేదము, అశ్వ శాస్త్రము, అశ్వ చికిత్సితము, మొదలగునవి లక్షణ ప్రకాశములో చెప్పిబడినవి. అశ్వదళమున చేర్చుకొనునపుడు, గుఱ్ఱము యొక్క వయస్సు, బలము, పరిణామము మొదలగునవి చూచెడివారు.

యుద్ధ వార్తలను రహస్యముగా చేరవేయుటకు, శత్రుసేనలోనికి చొచ్చుకొని పోవుటకు అశ్వసేన నుపయోగించెడి వారు.

సేనకు నాల్గవ అంగము పదాతి బలము. దీనినే "కాల్బలము" అందురు. భారతదేశమున కాల్బలము ముఖ్యమైన యుద్ధాంగముగా పూర్వము నుండియు పరిగణనను పొందినది. కౌటిల్యుడు తన అర్థశాస్త్రమున పదాతిదళములు ఒక ప్రత్యేకోద్యోగి నిర్వహణము క్రింద యుండునని తెల్పినాడు. గ్రీకు రాయబారి మెగస్తనీస్ తన గ్రంథము నందీ అంశమును ధృవపరచినాడు. పదాతి బలము తన సొంత ప్రజ్ఞచే ప్రవర్తించి విజయమును సాధింపగలదు. కావుననే ఈ బలము శ్రేష్టమైనదిగా చెప్పబడినది. "హరిహయ చతురంగము" పదాతి బలమును గూర్చి ఈ విధంగా చెప్పినది.

దుర్గయుద్ధే రాత్రియుద్ధే ప్రశస్యంతే పదాతయః
యత్రగంతుం వనే శైలే పత్తయస్తత్ర యోధినః[2]

దుర్గ, వన, పర్వత యుద్ధములలోను, రాత్రి యుద్ధము నందును పదాతి బలమే శ్రేష్ఠమనదగునని దాని భావము.

ఈ పదాతి బలమునందే షడంగ బలములును గలవు. అవి 1. మూల

1. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము III, పేజి-596, 2. Ibid పేజి 596.

బలము, 2. భృత్య బలము, 3. శ్రేణీ బలము, 4. మిత్ర బలము, 5. అమిత్ర బలము, 6. అటవీ బలము.

"నీతి ప్రకాశిక" యను గ్రంథమున సైనికుల విధులన్నియు పేర్కొనబడినవి. చతురంగ బలములను నడుపు ముఖ్యయోధుడు సేనాపతిగా పిలువబడెడి వారు. సేనాపతుల నుండి ఎన్నుకొనబడిన నాయకాగ్రేసరుడు సర్వసైన్యాధిపతిగా నుండెడి వాడు.

యొధులు తమ సామర్థ్యములను బట్టి అతిరథ, మహారథ, అర్థరథులుగా పిలువబడెడివారు. ఈ విధమైన విభజన కృష్ణమాచార్య ప్రణీతమైన ధనుర్విద్యా విలాసమున ఇట్లు గలదు.

తన మేను రథము, రథ్యములు, సారథి గాచి
యనిసేయువాడు మహారథుండు
మును పన్నిదములాడి మొనసిన విరథుడై
యందంద పఱచువా డర్థరథుడు
విరథుడయ్యును బోవ వెన్నీక యచలుడై
యాలంబుసేయు వాడతి రథుండు
రథముప్రీలిన బాసి రథికుడై క్రమ్మఱ
జావమొత్తెడు వాడు సమరథుండు
మ్రందనిహయంబు, లుడివోని మార్గణములు,
కందని రథంబు, విఱుగని కార్ముకంబు,
పడని సారథి, సడలని పడగగలుగు
సింహ విక్రము డతిరథ శ్రేష్ఠుడనఘ[1]

తన శరీరమును, రథమును గుఱ్ఱములను, సారథిని రక్షించుకొనుచు యుద్ధము చేయువాడు మహారథుడు, పంతములు పల్కి యుద్ధరంగమున విరథుడై పాఱిపోవు వాడర్థరథుడు, విరథుడయ్యు వెన్నుజూపక స్థిరంగా యుద్ధము చేయువాడు అతిరథుడు. రథము విఱుగగా తొలగి మరొక రథమును బొంది పరాక్రమించువాడు సమరథుడు. నొవ్వని గుఱ్ఱములు, మొక్కవోని బాణములు, విఱుగని రథము, ధనుస్సు, పడని

1. ధనుర్విద్యా విలాసం – 3-83, పేజి 140

సారథి, ఛత్రము గల సింహపరాక్రముడు 'అతిరథ శ్రేష్ఠుడు' నగుచున్నాడు.

ప్రాచీన భారతీయులు పెక్కు శస్త్రములను, యుద్ధ యంత్రములను గూడ కల్పించుకొనినారు. ఈ ఆయుధములు ముక్తములు, అముక్తములు, యంత్ర ముక్తములు, ముక్తాముక్తములు అని నాలుగు విధములుగా చెప్పబడినవి. ముక్తములు అనగ చేతితో విసరి వేయబడునవి. అముక్తములు అనగా చేతిన వదలిపెట్టనివి. యంత్ర ముక్తములనగా యంత్ర సహాయమున గాని లేక మరియొక ఉపాయముచే గాని విడువబడునట్టివి. ముక్తాముక్తములనగా చేతిని వదలక ముందునకు వెళ్లునవి.

**ముక్తములు** - భిండివాలము, ద్రుఘణము, తోమరము, లగుడము, శక్తి, చక్రము, ముసుండి మొదలగునవి.

**అముక్తములు** - ఈ తెగకు చెందినవి ఇరువది ఆయుధములు గలవు. అవి వజ్రము, పరశువు, గోశీర్షము, అసిధేను, లవిత్రము, అస్త్రము, కుంతము, స్థూణము, ప్రాసము, పినాకము, గద, ముద్గర, సీర, ముసల, పట్టిస, పౌష్టిక పరిఘ, మయూఖి, శతఘ్ని అసి అను పేర్లుగలవి. ఇందు వజ్రము ఆరంచులు గలది. గోశీర్షము అనునది ఎద్దుకొమ్మువలె నుండు ఒకవిధమగు బల్లెము. అసిధేను అనగా చురకత్తి. దీనికి మూడంచులు ఉండును. లవిత్రము అనగా కొడవలి. అస్త్రము అనగా వంకరగా నుండు పలుచని కఱ్ఱతో చేయబడిన బాణము. విసరిలాగుట కుపయోగించును. కుంతము, ఈటె, స్థూణము అనునవి మనుష్యుని నిడివి ఎత్తుండును. స్థూణము స్తంభాకృతిని యుండి అగ్రమున పెక్కు బొడుపులు గలిగియుండును. పౌష్టికమనగా పిడికిలిలో నుండు కత్తి. మయూఖి అనగా గంటలు గల బాణాకఱ్ఱ. శతఘ్ని ఒక గదవలెనుండును. అంతేగాక శతఘ్ని పదము ఫిరంగికిని అన్వయించును. అసి అనగా ఖడ్గము. ఇది అముక్త ఆయుధములలో శ్రేష్ఠమైనది. ఈ ఖడ్గములందనేక రకములు గలవు.

యంత్ర ముక్తములు - చాపమ, శతఘ్ని, శల్యాదులు.

ముక్తాముక్తములు - పాశం, వాగుర, రజ్జు మొదలగునవి.

మంత్రశక్తిగల ఆయుధములను సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము ముక్తా ముక్తములుగా చెప్పినది[1].

---

1. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము III, పేజి 600

ఇవి రెండు విధములు: 1. సోపసంహారములు, 2. ఉపసంహారములు. సోపసంహార ములనగా బయటకు వేయునవి. ఉపసంహారమనగా వెనుకకు లాగునవి. సోపసంహా రములు 43 విధములు, ఉపసంహారములు 53 విధములు ఇందు చెప్పబడినవి.

భారతదేశమున ధనుర్విద్య ధనుర్వేదముగా పొగడబడినది. ధనుర్వేదము మానవుడు కనిపెట్టిన ప్రప్రథమ యుద్ధ శస్త్ర విద్య. ఈ ధనుర్వేదము విశ్వామిత్ర ప్రణీతముగా చెప్పబడినది. ఇది యజుర్వేదమున కుపవేదముగా చరణ వ్యూహమున చెప్పబడినది.

"యథా ఋగ్వేదస్యోపవేదః ఆయుర్వేదః చికిత్సా శాస్త్రం
యజుర్వేదస్య ఉపవేదః ధనుర్వేదో యుద్ధశాస్త్రం[1]

ధనుశ్శబ్దము కేవలము ధనుస్సునకు మాత్రమేగాక సర్వ ప్రహరణములకును వర్తించు ననియు ధనుర్విద్యా విలాసము తెల్పుచున్నది. ఆ గ్రంథ పీఠికలో శ్రీ మానదల్లి రామకృష్ణకవి గారు ధనుశ్శబ్దము వింటికి రూఢమైనను ముక్తాముక్తాది చతుర్విధ ప్రహరణములకును వర్తించునని దెల్పినారు.

ముక్తాముక్తాది చతుర్భేదములు గాక 'నియుద్ధ' మను (మల్లయుద్ధం) పంచమ భేదమును గూడ తరువాత వచ్చిన శాస్త్రజ్ఞులు గ్రహించిరి. దీనినుండి వచ్చిన మఱియొక యుద్ధభేదమే ముష్టి యుద్ధము. యోధులు బాహాబాహి, ముష్టాముష్టీ కచాకచి పోరాడుట భారత యుద్ధతంత్రమున పెక్కుచొట్ల వర్ణింపబడినది.

అయ్యలరాజు నారాయణామాత్యుడు ప్రాచీనకాలపు ఆయుధములు ముప్పది రెండింటిని తన 'హంస వింశతి' లో ఈ విధముగా తెల్పినాడు.

బిండి వాలాసి కోదండ భల్లాతక
నారాచ కోహణ నఖర వజ్ర
ముష్టి ముద్గర శూల ముసల భుసుండిక
ప్రాస ప్రకూరక్మ కర్పట కటారి
కాగరాయో దండ కణయ కుంతాంతళ
పరశు తోమర చక్ర పరిఘ పట్ట

1. ధనుర్విద్యా విలాసం – పీఠిక, పేజి-120

సములు కంపిణికాది సబళంబు
చల్వీడ యాదిగా నిలనుతింప
దనరు ముప్పది రెండాయుధములు...............[1]

దాదాపుగా నివే అయుధములు ఖడ్గ లక్షణ శిరోమణి యందు ప్రథమ వర్గమునకు చెందినట్టివిగా, మానవ లోకకళ్యాణమునకై విశ్వకర్మచే లక్షణశాస్త్ర విరాజితములుగా నిర్మింపబడినట్లు చెప్పబడినది[2].

యోధులకు దెబ్బలు తగులకుండా కవచములుండెడివి. ఈ కవచములు నాలుగు విధములు. 2. చేతులతో సహా ఆపాదమస్తకము కప్పి యుంచునవి. 2. శిరస్సును, వక్షః స్థలమును కప్పునవి. 3. హస్తముల నావరించునవి. 4. నడుమునకు కొల్లాయి గుడ్డవలె చుట్టుకొని యుండునవి[3]. శిరస్త్రాణము, కంఠత్రాణము, కింపన, కంచుకము, వారవాణ, పట్ట, నాగోదార్క, పేతి, చర్మ, తాళమూల, భమనిక, కవాట, కిటిక, అప్రతిహత, వలాహకాంట అనునవి కవచముల పేర్లుగా చెప్పబడినవి. గజములకు, గుఱ్ఱములకును కవచములను ధరింపజేసెడివారు. కవచములు సాధారణముగా ఉక్కుతోను, చర్మముతోను, చెక్కతోను, గడ్డితోను తయారుచేసు కొనెడి వారు.

చతుర్విధ సేనాంగములను యుద్ధమునందు తంత్ర దృష్ట్యా వివిధాకారము లతో విన్యాసమొనర్చుట వ్యూహముగా చెప్పబడును. దండయాత్ర చేయునట్టి వాని వ్యూహము ననుసరించి ఆత్మరక్షణ చేసుకొను రాజు, దానికి ప్రతి వ్యూహమును పన్నును. వ్యూహ రచన యుద్ధము చేయు ప్రదేశమును బట్టి యుండెడిది. సమతలముగల మైదానమున దండ వ్యూహము, మండల వ్యూహము పనికి వచ్చునని చెప్పబడినది. భూమి నిమ్నోన్నతముగ నున్నపుడు భోగ వ్యూహము, అసంహత వ్యూహము, భూతలము విషమముగా నున్నపుడు విషమ వ్యూహము ఉద్దిష్టములైనవి. రోమనులు, గ్రీకులు దృఢవ్యూహ నిర్మాణమునకై పదాతి బలమును మాత్రమే ఉపయోగింపగా భారతీయులు గజాశ్వ రథ బలములను గూడ ఉపయోగించిరి.

దండయాత్ర సమయములలో సైన్యము వెంట భోజనాదికములను కల్పించువారు, వైద్యబృందములు నుండెడివి.

1. హంసవింశతి, 1–105, 2. ఖడ్గ లక్షణ శిరోమణి, పేజి–4, 3. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం III – పేజి–601

ఈ విధముగా భారతీయ యుద్ధతంత్రము పూర్వము పటిష్టమైనదై సమకాలీన విదేశీయులకు ఏమాత్రము తీసిపోకుండా క్రమశిక్షణగలదై, నీతిబద్ధమై విరాజిల్లినది.

## 2.4. రామాయణ యుద్ధములోని ప్రత్యేకతలు :

రామాయణ కాలమున జరిగిన యుద్ధాలలో కొన్ని ప్రత్యేకతలున్నవి. ముఖ్యంగా మానవులు, రాక్షసులు, వానరులు అను మూడు భిన్నజాతుల మధ్య జరిగిన యుద్ధాలు వర్ణింపబడినవి. అంతేగాక జటాయువు వంటి పక్షులు విరాధ కబంధుల వంటి విచిత్రాకృతి గల వ్యక్తులు అసాధారణ దేహములు గల రాక్షసులు రామాయణ యుద్ధాలలో కనిపిస్తారు. ఆకాశ యుద్ధాలు, మాయా యుద్ధాలు, యుద్ధ జయాన్ని గోరి యుద్ధరంగంలో చేసే క్షుద్రహోమాలు వంటివి రామాయణ యుద్ధ ప్రత్యేకతలు. మహాభారత యుద్ధం సుశిక్షితులైన సైనికులచే నిర్వహింపబడగా రామాయణ యుద్ధం కొంత అనాగరికులైన, సుశిక్షితులు గాని వానర, రాక్షస యోధులచే నిర్వహింపబడింది. అంతమాత్రం చేతనిది పూర్తిగా ఒక పద్ధతి లేని అనాగరిక పోరాటం గాదు.

ఎందుకనగా వానరులలో సుగ్రీవుడు, హనుమంతుడు, అంగదుడు, నీలుడు, మరికొందరు వానర యూధపులు ఆయుధ విద్యలు తెలిసిన వారే. శత్రువులు ప్రయోగించు ఆయుధములను ఎదుర్కొనగలవారే. అవసరమును బట్టి శత్రువుల చేతులలోని ఆయుధములను లాగికొని వానితోనే వారి నెదిరించినారు. అంతేగాక మంత్రపూతములైన అస్త్రములను గుఱించియు తెలిసిన వారు గలరు. అందులకు హనుమంతుడే నిదర్శనము. మిగిలిన వానర సైనికులంతా కొండరాళ్లు, శిఖరములు, చెట్లు, గోళ్లు, దంతములు ఆయుధములుగా పోరాటము చేసిన వారే.

ఇక రాక్షసులలో రావణుడు, రావణ పుత్రులు, ప్రహస్తుడు ఆదిగాగల రావణుని సేనాపతులు ఆయుధ విద్యలలో సుశిక్షితులే. ఆ విషయ మాయావీరులు చేసిన యుద్ధ ఘట్టములందు నిరూపింపబడును. మిగిలిన రాక్షస సైన్యము గూడ ఖడ్గ, శూల, ప్రాస, ముసల, ముద్గరాది ఆయుధములను ప్రయోగించుటలో నేర్పరితనము గలది.

ఈ విధంగా వానర రాక్షస సేనలమధ్య యుద్ధం సమానాయుధములు గల్ల యోధుల మధ్య జరిగినది కాకపోవుటచే ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది.

రాక్షసులలో చతురంగ బల వ్యవస్థ గలదు. కానీ వానరులదంతయు పదాతి బలమే. వానర, రాక్షస లిఋవురి యందు సేనాపతులున్నారు. వానర యూథవులకు సంబంధించిన సుదీర్ఘమైన వర్ణన రామాయణమునందుగలదు. రాక్షసులకు ప్రహస్తుడు సర్వసేనాధిపతి కాగా వానర బలమునకు నీలుడు సర్వసైన్యాధిపతి. యుద్ధమున ఒక సేనాపతి మరణించిన తర్వాత మరొక సేనాపతిని నియమించు పద్ధతి రామాయణ యుద్ధమునందు గలదు. భారత యుద్ధమునందలి సర్వ సైన్యాధిపతుల పేర్లతో (భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య మొదలగు వారి పేర్లతో) పర్వములుండుటచే వారి పేర్లు సుప్రసిద్ధములైనవి. మహాభారత యుద్ధమున విజయమును పొందిన పాండవుల పక్షమున ధృష్టద్యుమ్నుడు చివరి వరకు సేనా నాయకునిగా నుండగా, రామాయణ యుద్ధమున రాముని పక్షమున నీలుడే చివరి వరకు సేనా నాయకునిగా నున్నాడు.

సర్వసైన్యాధిపతి వ్యూహ నిర్మాణము చేయుట రామాయణ యుద్ధము నందును గలదు. చతురంగ బలముల నొకపద్ధతి ప్రకారము యుద్ధ సన్నద్ధులను జేసి ఉపాయముగా సేనలను నడుపుటయే ఇందు వ్యూహముగా చెప్పబడినది. రామాయణమున ఒక్క 'గరుడవ్యూహము' మాత్రమే ప్రస్తావింపబడినది.

యుద్ధము చేయుటకు లేదా హాని తలపెట్టుటకు సిద్ధపడిన స్త్రీలను శిక్షించు సందర్భములలో రామాయణమున ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. స్త్రీని విరూపిగా చేయుట ద్వారానే శిక్షింపదలచెడి వారు. కావుననే తాటకను సంహరించుటకు ముందు రాముడామెను చంపదలపక ముక్కు, చెవులను మాత్రమే కోసినాడు. అట్లే లక్ష్మణుడు శూర్పణఖను, అయోముఖిని ముక్కుచెవులు కోసి శిక్షించినాడు.

శత్రువును లొంగదీయుటకు రాజుపయోగించు దండోపాయము రామాయణమునందు ఐదు విధములుగా చెప్పబడినది. అవి విగృహ్యాయానము, సంధాయ యానము, సంభూయ యానము, ప్రసంగ యానము, ఉపేక్ష్య యానము[1].

(i) విగృహ్యాయానము : పార్ష్ణి గ్రాహాదులు లేకయే శత్రువుపై ఒంటరిగా దండెత్తుట. పార్ష్ణి గ్రాహులనగా రాజునకు వెనుకనుండు వారు.

(ii) సంధాయ యానము : పార్ష్ణి గ్రాహాదులతో కలసి యుద్ధమునకు పోవుట.

1. మూ.రా. అయోధ్య 100 – 70

(iii) సంభూయ యానము : సామంతులతో కలసి దండెత్తుట. రాముడు సుగ్రీవుని సహాయంతో రావణునిపై దండెత్తుట ఈ విభాగమునకు చెందినదే.

(iv) ప్రసంగ యానము : ఒకనిపై దండెత్తుచున్నట్లు ప్రకటించి అకస్మాత్తుగా మరికరిపై దండెత్తుట.

(v) ఉపేక్ష్య యానము : శత్రువుపై దండయాత్ర కుద్దేశించి మధ్యలో వానిని వీడి వాని మిత్రునిపై తలపడుట. రాముడు వాలిని సంహరించుట ఈ తరగతికి చెందినదే.

ఈ విధముగా రామాయణ యుద్ధం కొంత నియమబద్ధంగా మరికొంత అనియమబద్ధంగా జరిగినప్పటికి తరువాత కాలము వారికి అది మార్గదర్శకమైనట్టిదే గాని కేవలము ముక్కిడి మూకల అనాగరిక యుద్ధము కాదు.

## గరుడ వ్యూహము




❑❑❑

# తృతీయ ప్రకరణము

## 3.1. సైనిక వ్యవస్థ :

యుద్ధ తంత్రమున ప్రధాన భూమికను నిర్వర్తించునది సైనిక వ్యవస్థ కౌటిల్యునికి పూర్వంనుండే రాజ్యం సప్త ప్రకృతులు గలిగియున్నది. ఈ సప్తాంగములలో సైన్యం ఆఱవదిగా పేర్కొనబడింది. అంతేగాక నిదియే శ్రేష్ఠమైనదిగను చెప్పబడింది. కౌటిల్యుడు అర్థశాస్త్రంలో సూచించిన ప్రకారం 'కోశం' కన్నా సైన్యమే రాజ్యానికి ఎక్కువ ముఖ్యమైనది. కామందకము కూడా సైన్యానికే ప్రాధాన్యమిస్తూ "బలవంతమైన సైన్యముగల రాజు శత్రువులను గూడ మిత్రులుగా జేసికొని నిరాటంకముగా భూమి నేలుతాడ" ని తెల్పింది. శుక్రనీతి సైన్యం మానవునకు మేధ వంటిదని చెప్పినది. సైన్యం లేకుండా ఏ రాజ్యమును ఉండదు. సైన్యంవలననే రాజ్యం నిలబడుతుంది. రాజ్య రక్షణకు రాజు మనుగడకు సైన్యం తప్పనిసరి.

### 3.1.1. షడంగ బలములు :

ప్రాచీన భారతదేశంలో సైన్యాన్ని షడంగ దళముగా విభజించినట్లు పురాణములు, కౌటిల్యుని అర్థశాస్త్రము, కామందకము, మానసోల్లాసము మొదలగు వాని వలన తెలియుచున్నది.

(i) మూల బలము, (ii) భృతక బలము, (iii) శ్రేణీ బలము, (iv) మిత్ర బలము, (v) అమిత్ర బలము, (vi) అటవీ బలము అను అఱింటిని షడంగ బలములని అందురు. వాని లక్షణాలను అర్థశాస్త్ర కర్త ఈ విధంగా తెల్పినాడు.

**(i) మూలబలము (Heredity Troops) :**

ఇది వంశపారంపర్యముగా రాజును నమ్మకంగా సేవించుచూ వచ్చునట్టిది, శాశ్వతమైనది. రాజు తన విజయానికి ఎక్కువగా ఈ బలం మీదనే ఆధారపడతాడు. ఈ బలం కూడ రాజు మెప్పు పొందడానికి రాజు కొఱకై తెగించి పోరాడుతుంది.

**(ii) భృతక బలము (Macenaries) :**

యుద్ధ సమయములందు తాత్కాలికముగా జీతమును పుచ్చుకొని యుద్ధమున పాల్గొనునట్టిది. యుద్ధంలో ముందుగా కదిలే బలం ఇదే.

(iii) శ్రేణీ బలము (Glids) :

రాజ్యానికి చెందిన వారే తమతమ నాయకుల యాజమాన్యమున సంఘములుగా నేర్పడి యుద్ధకాలమునందు రాజుకు సహాయం చేయుదురు.

(iv) సుహృత్ బలము (మిత్ర బలం) :

మిత్రుడైన రాజు యుద్ధ సమయమున సహాయముగా పంపు సైన్యము.

(v) ద్విషత్ బలము (అమిత్ర బలం) :

ఒకప్పుడు శత్రువుగా నుండి జయించుట ద్వారాగానీ, సంధి ద్వారాగానీ స్వాధీనుడైన సామంతుడు యుద్ధ సమయమున సహాయముగా పంపునది.

(vi) అటవీ బలం (Forest Tribes) :

ఆ రాజు యొక్క రాజ్యమునగల పుళిందులు, శబరులు మొదలగు ఆటవిక జనులతో కూడినది.

ఈ ఆఱింటిలో మూలబలమే శ్రేష్ఠమైనదని కౌటిల్యుడు, కామందకుడు తెల్పియున్నారు. ఆంధ్ర కామందక కర్త ఈ విధంగా తెల్పినాడు.

సీ॥ కైజీతమగు మూక కంటెను కల్మిలే
 ములకు లోనగు ప్రాతమూక మేలు
కూటంబు కంటె నెక్కుడు స్వామివశమైన
 జీతంబు చెందుకై జీతగాండ్రు
మిత్ర సైన్యము కంటె మేలగు దనసీమ
 సమసుఖంబొందు కూటముల మూక
శత్రుసైన్యము కంటె మిత్రసైన్యము మంచి
 దేకార్థమతి నెయ్యమొనయు కతన
మిగుల చెడుగులగుచు మెలగి నిల్కడ లేని
యడవి మూక కంటె నరయ మేలు
శత్రుసైన్య మిట్టి చందంబు బలముల
తారతమ్య మెఱుగ దగు విభుండు[1]

---

1. ఆంధ్ర కామందకము – 8–5

తాత్కాలికముగా జీతము తీసుకొని యుద్ధమున పాల్గొను భృత బలము కంటె కలిమిలేములలో రాజును విడువకుండా నుండు మూల బలము మేలైనది. యుద్ధ సమయములలో కూటముగా నేర్పడి సాయము చేయు శ్రేణీ బలముకంటె రాజునకు అందుబాటులో నుండు భృత బలము శ్రేష్ఠమైనది. ఇతర దేశముల నుండి వచ్చి యుద్ధమున సాయముచేయు మిత్ర బలము కంటె స్వదేశమునకు చెందిన శ్రేణీబలము మేలైనది. బలవంతముగా లొంగదీయబడి రాజుపై అభిమానము లేకుండా మ్రొక్కుబడిగా వచ్చి యుద్ధమున సాయముజేయు అమిత్ర బలముకంటె మిత్ర బలము మేలైనది. మిక్కిలి చెడ్డతనము గలిగి నిలకడ లేనట్టి ఆటవిక బలముకంటె అమిత్ర బలము మేలైనది. రాజు వీని మధ్యగల తారతమ్యమును గుర్తించి ప్రవర్తింప వలెను.

ఈ అమిత్ర, అటవీ బలములు రెండును దోపిడిని, అరాచకాన్ని కాంక్షిస్తూ ఉండి దోచుకొనే అవకాశం లేక అసహనంతో రాజుకు ప్రక్కలో బల్లాలుగా ఉంటాయని కౌటిల్యుని అభిప్రాయము. మహాభారతంలో భృత, శ్రేణీ బలాలు సమాన ప్రాముఖ్యము గలవిగా చెప్పబడినాయి[1]. మానసోల్లాసము మూల, భృత, సుహృద్బలాలు ఉత్తమ మైనవని, శ్రేణి మధ్యమమని, అటవి అధమమని, ద్విషద్బలం అధమాధమమని చెప్పినది.

శ్రీమద్రామాయణము షడంగబలములలో ఐదింటిని మాత్రమే చెప్పింది.

మిత్రాటవీ బలం చైవ మౌలం భృత్య బలం తథా
సర్వమేతత్ బలం గ్రాహ్యం వర్జయిత్వా ద్విషద్బలం.[2]

మిత్రబలము, అటవీ బలము, మూల బలము, భృతక బలమ, ద్విషద్బలము, అను ఐదింటిలో ద్విషద్బలము విడిచివేయ దగినదని, మిగిలిన నాలుగును గ్రహింప దగినవని విభీషణుని స్వీకరించే విషయంలో వానరరాజగు సుగ్రీవుడు రామునితో చెప్పాడు.

రామాయణమున ప్రధానంగా సుగ్రీవుని మరియు రావణుని మూల బలములే వర్ణింపబడినాయి.

రావణుడు వానర బలమును చూచుటకై ఒక పెద్ద సౌధము నధిరోహించి చూచి వానర వీరులను గూర్చి తెల్పవలసినదిగా కోరగా సారణుడు సుగ్రీవుని సైన్యాన్ని గురించి చెప్తూ అతని మూల బలాన్ని తెల్పుటను భాస్కర రామాయణము ఈ విధంగా తెల్పింది.

---

1. ప్రాచీన సైనిక వ్యవస్థ - భారతి - నవంబర్-1961, 2. మూ.రా. యుద్ధ. 17-22

సీ॥ శంఖంబు లేక వింశతి సహస్రంబులు
బృందంబులవి రెండువేలనూర్లు
గలయ్యుల పెను మొనగాసివి మనమీద
మ్రొగ్గెడు సుగ్రీవు మూల బలము
కామరూపులు దేవ గంధర్వులకు జనిం
చినయట్టి వారు కిష్కింధ వారు
వృక్షభూధర ఘోర వృష్టి లంకాపుర
గోపురాదుల గుప్ప గూల్తు మనచు
నాకసంబు దెసలు నార్పుల నద్రువను
త్తాల తాలహతులందార లురల
నేపు తోడ నాజి కెదురు సూచుచునున్న
వారు రాక్షసేంద్ర వారు కంటె[1]

ఈ పద్యమున వానర వీరుల సంఖ్యతోపాటు వారి విశిష్టత కూడ చెప్ప బడినది. ఇరువది యొక్క వేల శంఖములు, రెండువేల నూర్ల బృందముల సంఖ్య గల సుగ్రీవుని మూల బలము దండెత్తుటకు సిద్ధముగా నున్నదని, ఆ వానర వీరులు కామరూపులని, దేవతల యొక్క గంధర్వుల యొక్క అంశలతో జన్మించిన వారని, చెట్లు, కొండలు మొదలగు వానిని లంకపై వర్షింపజేసి గోపురాదులను కూల్చెదమని దిక్కులు మారుమ్రోగునట్లు అరచుచున్నారని వర్ణింపబడినది.

ఈ సందర్భంగా సంస్కృతాంధ్ర రామాయణములు నేటి లెక్కల కందని సంఖ్యామానాన్ని తెల్పినవి. వానిని వాల్మీకం ఈ విధంగా చెప్పింది.

శతం శత సహస్రాణాం కోటిమాహుర్మనీషిణః
శతం కోటి సహస్రాణాం శంఖ ఇత్యభిధీయతే
శతం శంఖ సహస్రాణాం మహాశంఖ ఇతిస్మృతమ్
మహాశంఖ సహస్రాణాం శతం బృందమిహోచ్యతే
శతం బృంద సహస్రాణాం శతం పద్మమిహోచ్యతే
శతం పద్మ సహస్రాణాం మహాపద్మమితి స్మృతమ్

1. భాస్క రా.యుద్ధ - 355 పద్యం

మహాపద్మ సహస్రాణాం శతం ఖర్వమిహోచ్యతే
శతం ఖర్వ సహస్రాణాం మహాఖర్వ మిహోచ్యతే
మహాఖర్వ సహస్రాణాం శతం సముద్రమభిదీయతే
శతం సముద్ర సాహస్ర మోఘ ఇత్యభిధీయతే
శత మోఘ సహస్రాణాం మహౌఘ ఇతివిశ్రుతః

నూరు లక్షలు కోటి (7 సున్నలు), నూరువేల కోట్లు ఒక శంఖము (12 సున్నలు), నూరువేల శంఖములు ఒక మహాశంఖము (17 సున్నలు), నూరువేల మహాశంఖములు ఒక బృందము (22 సున్నలు), నూరువేల బృందములు ఒక మహా బృందము (27 సున్నలు), నూరువేల ఒక మహా బృందములు ఒక పద్మము (32 సున్నలు), నూరువేల పద్మములు ఒక మహాపద్మము (37 సున్నలు), నూరువేల మహాపద్మములు ఒక ఖర్వము (42 సున్నలు), నూరువేల ఖర్వములు ఒక మహాఖర్వము (47 సున్నలు), నూరువేల మహాఖర్వములు ఒక సముద్రము (52 సున్నలు), నూరు వేల సముద్రములు ఒక ఓఘము (57 సున్నలు), నూరు ఓఘములు ఒక మహౌఘము (62 సున్నలు), దీనిని బట్టి ఆ కాలమున అతి పెద్ద సంఖ్య 62 సున్నలుగల మహౌఘము అనునది. దీనిని బట్టి సుగ్రీవుని మూల బలమెంతయో తెలుసుకొనవచ్చును.

సుగ్రీవుని మూల బలము 21 వేల శంఖములు + 2 వేల నూర్ల బృందములు అనగా 21000 + 12 పన్నులు + 200000 + 22 సున్నలు కలిపిన సంఖ్య. ఈ సంఖ్యా మానాన్ని రంగనాథ బాస్కర రామాయణములును అనుసరించినవి. భాస్కరుడు మహౌఘమును చెప్పలేదు.

పై మూల బలముగాక మొత్తం వానరసేనను గూర్చి రావణుని చారులైన శుక సారణులు రావణుని వద్దకు వచ్చి సేనా వివరములను ఈ విధంగా చెప్పారు. "ఆయా సేనాపతుల క్రింద వేర్వేరుగా వేయికోటులు, నూరు శంఖములు, వేయి మహాశంఖములు, నూరు బృందములు, వేయి మహాబృందములును, నూరు పద్మములును, వేయి మహాపద్మములును, నూరు ఖర్వములును, నూరు సముద్రములును, నూరు మహౌఘములును, కోటి మహౌఘములును గల వానర సేన సముద్రమువలె అంతులేనిదై యుండగా విభీషణుడు, ఆతని మంత్రులు ముందు

1. మూ.రా.యు. 28 - 34 నుండి 39 శ్లోకములు

నడుచుచుండగా మహాపరాక్రమ వంతుడగు సుగ్రీవుడు యుద్ధముజేయ వచ్చుచున్నాడని తెల్పెను !

**రావణుని మూలబలము :** రావణుని మూలబలము గూడ అసంఖ్యాకమైనది. రాముడు సుగ్రీవుడు మొదలగు వారితో మంత్రాలోచన చేయు సమయమున విభీషణ/డు రావణుని మూల బలాన్ని గూర్చిన విషయములు చెప్పడాన్ని భాస్కర రామాయణ కర్త ఈ విధంగా వర్ణించాడు.

అఱువది లక్షలు రావణు
నుఁ బాహుబలంబు వీరులొగి నాలములం
గఱకెక్కినారు వారం
దఱు మూలంబు దొరలు ధరణీనాథా ![2]

గొప్ప బాహుబలము గల వీరులు, అనేక యుద్ధములందు రాటుదేలినవారునగు అఱువది లక్షలమంది రావణుని మూల బలముగా నున్నారని దాని భావము.

రావణుని మూలబలం సుగ్రీవుని మూలబలంతో లెక్కిస్తే చాలా తక్కువైనట్టిది. సుగ్రీవుని మూలబలాన్ని గూర్చి ఆవిధంగా చెప్పడంతో అది అసంఖ్యాకమైనదని రావణుని బలముకంటె అధికమైనదని నిరూపించబడినది.

తరువాత రావణుని మొత్తం బలమును గూర్చి చెప్పుచు భాస్కర రామాయణ కర్త ఈ విధంగా వర్ణించాడు.

కరులుఁదేరులు వాజులుఁ గాల్బలంబు
వేయుఁ బదివేలు నిరువది వేలు లక్ష
వేలు గల లెక్క బ్రోవది వినుము సార్థ
కోటి భటులును కోటాను కోటులధిప[3]

రావణుని చతురంగ బలములు వేయి, పదివేలు లక్ష, అరకోటి వంటి సంఖ్యల సమూహముతో కూడినట్టిదిగా ఇందు చెప్పబడినది.

వాల్మీకి రామాయణము రావణుని మూల బలమును గూర్చి వేరు లెక్కలనిచ్చినది. రాముడు గాంధర్వాస్త్రమును ప్రయోగించి రావణుని మూల బలాన్ని నాశనం చేసే సందర్భంలో ఈ లెక్కలీయబడినాయి.

---

1. మూ.రా.యు. 28-40 నుండి 43 శ్లో॥, 2. భాస్కరా.యు. 434 పద్యం, 3. భాస్కరా.యు. 435 పద్యం

"ఏడు కోట్ల ఇరువది తొమ్మిది లక్షల రథములు, పదమూడు కోట్ల పంద్రెండు లక్షల ఇరువది వేల బలవంతములగు గజములు, పదికోట్ల ఇరువది లక్షల అఱువది వేల రౌతులతో గూడిన గుఱ్ఱములు, నూట నలుబది యైదు కోట్ల ఎనుబది లక్షల పదాతి దళములుగనున్న కామరూపులగు రాక్షసులను శ్రీరాముడు తన అగ్నిజ్వాలల వంటి బాణములతో పగటిలో ఎనిమిదవ పాలులోనే తానొక్కడే నాశనము చేసినట్లు వర్ణింపబడినది[1].

రామాభ్యుదయ కర్త ఈ సంఖ్యామానాన్ని మరొక విధంగా చెప్పాడు

కః॥ పదివేలు పసిడి తేరులు
పదునాలుగు వేల్గుఱాలు భద్రగజంబుల్
పసునెనిమిది వేలున్, మే
లు దొరల్ పంద్రెండు లక్షలుం బొడియైనన్[2].

పదివేల బంగారు రథాలు, పదునాల్గు వేల గుఱ్ఱాలు, పదునెనిమిది వేల భద్ర గజములు, పంద్రెండు లక్షల మంది భటులును సంహరింపబడిరని దాని బావము.

షడంగములలో మూల బలముగాక మిగిలిన వాని ప్రసక్తి రామాయణమున అధికముగా లేదు. రావణుని, సుగ్రీవుని, మిగిలిన బలములలో కొన్ని భృత బలములు, మిత్రబలములు, అటవీ బలముల వంటివి ఉండవచ్చును. ఆయుధాలతో గాక చెట్లు, రాళ్లతో పోరాడిన రాక్షసులు అటవీ బలమే గావచ్చును. రామునికి సహాయంగా వచ్చిన సుగ్రీవుని బలమంతా మిత్రబలమే. రాముని పక్షాన చేరిన విభీషణుడు ద్విషద్బలముగాను చెప్పవచ్చును.

### 3.1.2. చతురంగ బలములు :

భారతదేశమున రాజనీతి సామ, దాన, భేద, దండోపాయములని నాలుగు విధములుగా విశిష్టతను పొందినది. వీనినే చతురుపాయలములందురు. ఇందలి దండ శబ్దమునకు 'సేన'యని అర్థము. అట్టి సేన భారతీయ దండదృష్టిలో "రథ, గజ, తురగ, పదాతులని నాలుగు అంగములతో కూడియున్నది. వానికే

1. మూ.రా.యు. 94 – 31 నుండి33 శ్లోకములు, 2. రామాభ్యుదయం – 8–193

"సేనాంగములు" లేక "చతురంగములు" అను పేర్లు గలవు. చతురంగ బల వ్యవస్థ రామాయణ కాలము నాటికే కుదురుకొనినదని చెప్ప వచ్చును.

చతురంగముల విషయమున మరొక వాదము కూడ గలదు. సేన యందలివి చతురంగములా లేక షడంగములాయను మీ మాంసయు గలదు. కామందకము ఈ విషయమునిట్లు దెల్పినది.

"ఏతన్మేలాది షడ్భేదం, చతురంగ బలం విదుః
షడంగం మంత్ర కోశాభ్యాం, పదాత్యశ్వ రథ ద్విపైః[1]

చతురంగములలో మంత్ర కోశములుగలసి షడంగములుగా లెక్కింపబడినవి. అట్లే భారతము శాంతి పర్వమున సేన అష్టాంగముగా పేర్కొనుటను సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము దెల్పినది.

రథా నాగా హయాశ్చైవ । పాదాతాశ్చైవ పాండవ
విష్టిర్నావశ్చైప । దేశికా ఇతిచాష్టమః
అంగాన్యేతాని కౌరవ్య! ప్రకాశాని బలస్యతుః

అని చతురంగ బలములుగాక – విష్టి, నావలు, చారులు, దేశికులు అను వానితో అష్టాంగములు చెప్పబడినవి.

సేనాంగములుగా గాక చతురంగ బల వ్యవస్థను గూర్చి యనునపుడు రథ, గజ, అశ్వ, పదాతి దళములను గూర్చియే చెప్పుకొన వలసి యుండును. ఈ బలములు లేకుండా రాజు రాజ్యపరిపాలన సక్రమముగా జేయలేడు. ముఖ్యముగా యుద్ధ సమయములందివి యత్యావశ్యకములు. ఈ చతురంగ బలవ్యవస్థ కూడ క్రమ పరిణామాన్ని చెందినదని చరిత్రకారుల విశ్వాసము. మొదట రథ, అశ్వ, కాల్బలములు యుద్ధమున ఉపయోగింపబడగా తరువాత గజముల నుపయోగించుట జరిగినది. ఒక కాలంలో సైన్యానికి ముందుభాగంలో రథములుంచు పద్ధతి యుండగా మరొక కాలంలో గజాలను ముందు నిలిపే క్రమం వచ్చింది.

**(i) రథబలము :** రామాయణ కాలంనాటి చతురంగ బల వ్యవస్థలో రథబలము మొదటగా చెప్పదగినది. ఇవి గొప్ప శిల్పులచే నిర్మితములై దృఢమైన చక్రములు

1. కామందకము – 19-24, 2. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం – III పేజి 593

గల్గి, మంచి గుఱ్ఱములచే పూన్చబడి, సుధ్వజ పతాకములతో అలంకరింపబడి, సమస్త యుద్ధపరికరములు అమర్చబడి యుండెడివి. రథముపై నుండి యుద్ధము చేయువాడు రథికునిగా, రథమును నడుపువాడు సారధిగా చెప్పబడినారు. రథస్థడగు యోధుడు శత్రు బలమును సులభముగా చెదరగొట్ట గలడు. సాధారణముగా రథమును గుఱ్ఱములే లాగెడివి. రామాయణమున గాడిదలు, ఎద్దుల వంటి వానిచే రథములు లాగించుటయు కనబడును. రథమునకు వెనుక భాగమున ఒక ధ్వజము పతాకాలంకృతమై యుండును. భారతీయ యుద్ధ శాస్త్రమున రథస్వరూపమిట్లు చెప్పబడినది. అది ఎత్తులో పది పురుషుల ప్రమాణమును, వెడల్పులో ఆఱు నుండి పండ్రెండు పురుషుల ప్రమాణము గల్గి యుండును. రథములలో ఆఱు రకములగు భేదములు గలవు. వానిలో మూడు సాంగ్రామికములుగా చెప్పదగినవి[1].

ఆంధ్ర కామందక కర్త రథబలము యొక్క విశిష్టతను గూర్చి ఇట్లు తెల్పినాడు.

తన సేనల రక్షించుట
యని చెదరిన గూర్చుకొనుట యరిసేనలు దా
కొని యుండిన భేదించుట
యును నరికట్టుటయు రథము లొనరించు పనుల్[2].

తన సైన్యాన్ని రక్షించుకోవడం, చెదరిన సైన్యాలను కూర్చుకోవడం, శత్రుసేనను ఛేదించడం యనునవి రథికుడు చేయవలసిన పనులు.

రామాయణమున జరిగిన యుద్ధ వర్ణనలలో రావణుడు, రావణ పుత్రులు, రావణ సేనానాయకులు, చివరి యుద్ధమున రాముడు రథముపై నుండి యుద్ధమును చేసినారు. రథములను గూర్చిన విపుల వర్ణనలు రామాయణమున గలవు. అయోధ్యా నగరమునందలి చతురంగ బలములను వర్ణించు సందర్భమున దశరథుని రథ బలము గూర్చి తెల్పుచూ భాస్కర రామాణ కర్త ఈ విధంగా అంటారు. "హరి రథము చౌకజేసెడి గురురథములు పెక్కుగలవు"[3].

1. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం – III పేజి 593, 2. ఆంధ్రకామందకం – 8-52, 3. భాస్క రా.బాల-38

అరణ్యకాండయందు ఖరదూషణులు, త్రిశిరుడు, రథములపైననే రాముని పైకి దండెత్తినారు. వాల్మీకి ఖరుడధిరోహించిన రథమును

"తతః సూర్య నికాశేన రథేన"[1].

సూర్యుని వలె ప్రకాశించుచున్నట్లు వర్ణించినాడు. అతని రథము బంగారు ఆభరణములతోఅలంకరింపబడినది.

"హయాన్కాంచన సన్నాహా న్రథయుక్తాం త్ససారథీన్"[2] యని వాల్మీకి వర్ణించినాడు. ఆ కాలమున వీరులుపయోగించు రథములు మంచి చక్రములు, మంచి ఇరుసు, మంచి కాడిమాను, మంచి నొగలు గల్గినవై అమ్ముల పొదులు, ధనుస్సులు ఈటెలు, కత్తులు, ప్రాసములు, పరిఘులు మొదలగు వానతో నిండి యుండెడివి అతికాయుడు అట్టి రథము నధిరోహించినట్లు వాల్మీకము వర్ణించినది[3].

యుద్ధకాండమున రావణుడు రామునిపైకి యుద్ధమునకు బయలుదేరు సందర్భమున ఆతని రథమును గూర్చి భాస్కర రామాయణ కర్త ఈ విధంగా వర్ణించినాడు.

"షోడశ చక్ర సంఘటితంబును, బటుతర కోటిద్వయ ఘంటా కలితంబును, భల్లూక చర్మ వర్మ సమాచ్ఛాదిత పవనజవన తురంగ సహస్ర వాహ్యమానంబున గాలకేతు సమాఖ్యాక సూత నియమితంబును, రాహుశిరశ్చిహ్న కేతన త్రయ విరాజమానంబును, నగు మహారథంబు"[4].

రావణుని ఆ మహారథము 16 చక్రములు గలిగి రెండుకోట్ల ఘంటికలతో కూడినది. వాయు వేగముగా పోవు గుఱ్ఱములను భల్లూక చర్మము కవచముగా కప్పబడినది. కాలకేతుడను సూతునిచే నడుపబడునది. రాహువు యొక్క శిరస్సు గుర్తుగా గలిగిన మూడు కేతనములచే ప్రకాశించునదై యున్నది.

సుందరకాండలో హనుమంతు నెదిరించిన జంబుమాలి గాడిదలు కట్టిన రథముపై వచ్చినట్లు "రథేన ఖరయుక్తేన"[5]. అని వాల్మీకిచే వర్ణింపబడడినది. అట్లే యుద్ధకాండలో ఇంద్రజిత్తు కూడా గాడిదలు కట్టిన రథముపై వచ్చినట్లు వాల్మీకి

1. మూ.రా.యు. 28-14, 2. మూ.రా. అరణ్య - 25-22, 3. మూ.రా.యు. - 69-26,
4. భాస్క రా.యు. 1947, 5.మూ.రా. సుం. 44-8

యిట్లు వర్ణించినాడు.

"సమారురోహానిల తుల్యవేగం రథం ఖరశ్రేష్ఠ సమాధి యుక్తం"[1]

శ్రేష్ఠమైన గాడిదలచే కట్టబడినది, వాయువేగమున పోవునట్టిది యగు రథము నాతడధిరోహించెను. ధూమ్రాక్షుడు తోడేలు, సింహము వంటి ముఖములు గల గాడిదలను పూన్చిన రథము నధిరోహించినాడు[2]. అకంపనుని మరణానంతరం మహాకాయుడు "గార్ధభ ప్రతతి బూనిన యరదము"[3] నే అధిరోహించినాడు.

ఈవిధంగా రామాయణ కాలమున గుఱ్ఱములకు బదులు ఆ జాతికి ఆకార సామ్యముగల గాడిదలు రథములకు కట్టబడినవి. ఇవన్నియు రాక్షస జాతికి చెందిన వారి రథములకు కట్టబడుట గమనార్హము.

రామాయణ కాలమున క్రూరమృగములను గూడ రథముల కశ్వముల వలె కట్టుట కలదు. ఇంద్రజిత్తు హనుమంతునిపైకి యుద్ధమునకు బయలుదేరు నపుడు అతని రథమునకు క్రూరమృగములు కట్టబడినట్లు వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

"సపక్షి రాజోపమతుల్య వేగైః వ్యాళైః చతుర్భిః సిత తీవ్ర దంష్ట్రైః"[4]

గరుత్మంతుని వంటి వేగము గలవి. తెల్లని తీక్షణములైన దంతములు గలవి యగు నాలుగు క్రూరమృగములు ఇంద్రజిత్తు రథమునకు కట్టబడినాయి. ఇచ్చట "వ్యాళైః" అను పదమునకు వ్యాఖ్యాతలు సింహములు లేక తోడేళ్లు అని అర్థమునిచ్చిరి. భాస్కర రామాయణ కర్తక్రూరమృగములని చెప్పక భయంకరాకారములు గల గుఱ్ఱములుగనే ఇట్లు వర్ణించినాడు.

"తీవ్ర దంష్ట్రాముఖంబులు, గరుడ వేగంబులు గల యాభీల తురంగం బులంబూన్చిన యాదిత్య నిభంభగు నొక్క రథంబెక్కి"[5].

ఈ గుఱ్ఱములు భయంకరములగు కోరలతో గూడిన ముఖము గలవి.

రామాయణమున దివ్య రథముల ప్రసక్తియు గలదు. అరణ్యకాండమున రావణుడు సీతాపహరణ సందర్భమున దివ్యరథముపై వచ్చినాడు. అది మాయా

---

1. మూ.రా.యు. 73-8, 2. Ibid 51-28, 3. రంగనాథ రామాయణం 324 పేజి
4. మూ.రా.సుందర 48-19, 5. భాస్కరా. సుం. 409

మయము, దివ్యము, సువర్ణమయము, కామగమనము గలది[1]. అదియు గాడిదల చేతనే కట్టబడినది. సుందరకాండలో అక్షుని రథము అనేకములగు తపస్సులచే సంపాదింపబడినదిగా, బంగారు వలలతో ప్రకాశించునదిగా, చిన్న చిన్న పతాకములతో అలంకరింపబడినదిగా రత్నాలంకృతమై ధ్వజము గలదిగా మనోవేగముతో పోవు ఎనిమిది గుఱ్ఱములచే కట్టబడినదిగా, ఎక్కడికైనా అడ్డు లేకుండా ప్రయాణము చేయునదిగా, సూర్యకాంతితో సమానమైన కాంతిగల గంటలు కట్టినదిగా, బంగారు మాలలు గలదిగా, ఆకాశమున సంచరింప గలదిగా, ఆయా స్థానము లందమర్చబడిన తూణీరములు, ఎనిమిది ఖడ్గములు, శక్తి, తోమరములు గలదిగా వాల్మీకి వర్ణించినాడు[2].

రావణునకు బ్రహ్మదత్తమైన, సహస్ర ఖరయుక్తమైన దివ్యరథమున్నట్లు రామాయణమున చెప్పబడినది. అట్లే త్రిశిరుడును తనకు "బ్రహ్మదత్తములైన శర, శరాసన, శక్తి కవచంబులు, సశ్వ సహస్ర యుతంబగు దివ్య రథంబులు గలవని అంటాడు[3]. ప్రహస్తునకును దివ్య రథము గలదు[4].

ఇంద్రజిత్తు యుద్ధరంగమున హోమ కార్యములు చేసి పొందిన రథమును రంగనాథ రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

> "................ నిరుపమంబైన, హయ చతుష్టయముతో నతిఘోరలీల
> నురుతర బాణాస నోజ్జ్వలంబగుచు, సురుచిరాలంకార శోభితంబగుచు
> సరినొప్పు సింహార్ధచంద్ర చిహ్నముల, బరగుచు వైదూర్య భాసురంబయిన
> పడగచే నమరుచు బ్రహ్మాస్త్ర రక్ష, నడరుచునని నదృశ్యంబయి యుండు
> నట్టి యా రథమెక్కి యనికి నేగుచును, [5]........

ఆ రథము బ్రహ్మాస్త్ర రక్ష గలది. అదృశ్యమై యుండునది. వైదూర్యములచే ప్రకాశించు పడగగలది.

రాముని కొఱకై ఇంద్రుడు మాతలి ద్వారా పంపిన ఇంద్రరథ సౌందర్యమును భాస్కర రామాయణ కర్త మనోహరముగా వర్ణించినాడు.

---

1. మూ.రా.అరణ్య. 49-19, 2. మూ.రా.సుం. 47-4 నుండి 6 శ్లో॥., 3. భాస్కరా.యు. 983
4. మూ.రా.యు. 57-25, 5. రంగనాథ రామాయణం, యుద్ధకాండ 393 పేజి

సీ॥ కింకిణీ మాలికా ఝుంకార ముఖరంబు
సురుచిర నవరత్న శోభితంబు
తటిదుజ్జ్వలోచ్చ కేతన దండ సహితంబు
గురుతర వైడూర్య కూబరంబు
జలజలోచన చక్ర చక్ర సన్నద్ధంబు
నక్షత్ర సంకలి తాక్ష యుగము
దుస్సహానిలవేగ తురగోహ్య మానంబు
తరుణార్క బింబ సుందరమునగుచు
విమల వజ్రకల్ప కమనీయ కంకట
దివ్యచాప తూణ దీప్త శస్త్ర
సహితమైన రథము జవమున గొని వచ్చి
మొనసి రామచంద్రు మ్రోల మెఱయ[1]

ఆ రథము బంగారు మయమైనది. వందలాది గంటలతో సువర్ణాభరణములతో సలంకృతమైనది. తెల్లని వింజామరలతో ప్రకాశించుచు ఆకుపచ్చరంగు గల గుఱ్ఱములు పూన్చబడినది. దివ్య చాప తూణములతో గూడినది. వైఢూర్య మయమైన నొగలు గలదిగా వర్ణింపబడినది.

**(ii) గజ బలము :** రథబలము తరువాత యుద్ధ సమయములందు ప్రముఖ స్థానము వహించునది గజబలము. రాజులందఱు గజబలాన్ని పోషించినట్టి వారే.

"దండయాత్రలలో ముందు నడచుట, వనదుర్గముల జొచ్చుట, తెరువులు లేనిచో తెరువులు బెట్టుట, కొలనులు, నదులు మొదలగు వాని లోతు తెలుసుకొనుట, బలములను నీటినుండి దాటించుట, కోటల వాకిళ్లను కూల్చుట, సంఘటితమగు సేనను భగ్నము చేయుట, ప్రాకారములను పగుల గొట్టుట, సరుకులు మోయుట మొదలగునవి" ఏనుగులు చేయవలసిన పనులుగా ఆంధ్ర కామందకము పేర్కొన్నది[2].

అర్థశాస్త్రము గజముల ప్రక్రియను గూర్చి చక్కగా తెల్పినది. భారత దేశమున గజశిక్ష, హస్తి శాస్త్రము అను శాస్త్రములవతరించి గజబల విధానమునకు

---

1. భాస్కర.రా.యు. 2025, 2. ఆంధ్ర కామందకము - 8-54

దోహదము చేసినవి. గజములలో "భద్రో మంద్రో మృగో మిశ్రశ్చతస్రో జాతయోగజే" అని నాలుగు జాతులున్నట్లు అర్థశాస్త్రము పేర్కొన్నది[1]. హలాయుధ గ్రంథము మూడు జాతుల ఏనుగులనే తెల్పినది*.

తేనెరంగు గలిగి బలమైన దంతాలు, గుండ్రని లావైన శరీరం, అందమైన ముఖం మంచి అవయవ సౌష్టవం గల్గినది భద్రజాతి ఏనుగుగాను.

లావైన పొట్టగలిగి, సింహనేత్రముల వంటి నేత్రములుగల్గి, దళసరి శరీరము, కంఠము, తుండము గలిగి మధ్యరకపు అవయవ సౌష్టవం గల పొడవైన దేహముగల ఏనుగు మంద్రజాతికి చెందినదిగాను,

సన్నని కుఱుచైన గొంతు, దంతాలు, చెవులు, తుండము గలిగి, పెద్దపండ్లు అతిసన్నని పెదవులు, పొట్టి లింగావయవములు గల ఏనుగు మృగజాతికి చెందినది. గాను "వైజయంతి" తెల్పినట్లు గోవిందరాజీయ వ్యాఖ్యయందు గలదు[2].

దీనినిబట్టి గజశాస్త్రము ఆ కాలమున ఎంత అభివృద్ధి చెందినది తెలియును.

రామాయణమున పైన తెల్పిన మూడు విధములేగాక నాలుగు రకముల మిశ్ర తరగతి ఏనుగులును జెప్పబడినవి. అయోధ్యానగరమున గల ఏనుగులను గూర్చి వర్ణించుచూ వాల్మీకి ఈ విధముగా పేర్కొనినాడు.

"భద్రై ర్మంద్రై ర్మృగౌశ్చైవ
భద్రమంద్ర మృగౌ స్తథా
భద్ర మంద్రై ర్భద్రమృగౌ
ర్మృగమంద్రైశ్చ సాపురే
నిత్యమత్తైః సదా పూర్ణా
నాగై రచల సన్నిభైః"[3]

ఎల్లప్పుడు మదించిన కొండలవంటి భద్రములు, మంద్రములు, మృగములు అనే మూడు జాతులకు చెందిన ఏనుగులేగాక భద్ర మంద్రములు, భద్ర మృగములు,

1. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం III పేజి 595, * భద్రో మంద్ర మృగచ్చేతి విజ్ఞేయాస్త్రి విధ్యాగజాః
2. గోవింద రాజీయం –బ బాల, పేజి 187, 3. మూ.రా.బాల. 6–25

మృగమంద్రములు, భద్ర మంద్రమృగములు అను నాలుగు రకముల మిశ్రజాతి ఏనుగులు ఆ పట్టణమున గలవని దాని భావము.

ఆ కాలమున వింధ్య పర్వతమున పుట్టినవి, హిమాలయములందు పుట్టినవి. తూర్పు దిక్కున పుట్టిన ఐరావత కులమునకు చెందినవి, ఆగ్నేయ దిశ యందుగల అంజనయను దిగ్గజపు జాతిలో పుట్టినవి, దక్షిణ దిశయందు గల వామనమను దిగ్గజపు జాతిలో పుట్టినవి యగు ఏనుగులు అయోధ్యాధిపతి గజబలమున నున్నట్లు వాల్మీకము వర్ణించినది[1].

అట్లే రావణుని గజబలమును గూర్చిన విషయము సుందరకాండ యందు చెప్పబడినది. హనుమంతుడు లంకలో ప్రవేశించి సీతాన్వేషణ జేయుచున్న సందర్భమున రావణుని చతురంగ బలములను చూచినాడు. ఆ సందర్భమున రావణుని గజబలమును గూర్చి వాల్మీకి ఈ విధముగా వర్ణించినాడు.

"కులీనన్ రూపసంపన్నాన్ గజాన్పరగజా రుజాన్
నిష్టితాన్ గజశిక్షాయా మైరావత సమాన్యుధి
క్షరతశ్చ యధామేఘన్ స్రవతశ్చ యథాగిరీన్
మేఘస్తనిత నిర్ఘోషాన్ దుర్ధర్షాన్ సమరే పరైః[2]

ఆ ఏనుగులు మంచి జాతికి చెందినవి, చక్కని శిక్షణ పొందినవై ఐరావతముతో సమానమైనవి. యుద్ధమున శత్రు సైన్యములను సంహరింపగలవి. మదధారలను స్రవించుచు వర్షించు మేఘముల వలె నున్నవి, ఉరుముల వంటి ఘీంకారములు గలవి.

హరిహర చతురంగము గజములలోను బ్రాహ్మణాది వర్ణములున్నట్లు దెల్పినది.★

యుద్ధములందుపయోగించు గజములకు శిక్షణ నిచ్చెడి వారు. అది అనేక విధములుగా నుండును.

(i) ఉపస్థానము : కంచెలు, మిట్టలు దాటుట
(ii) సంవర్తనము : కూర్చుండుట, గుంటలు, పల్లములు దాటుట.

1. I bid.... 6-24, 2. మూ.రా.సుం. 6-32, 33.

★ బ్రాహ్మణాః క్షత్రియో వైశ్యాః శూద్రశ్చేతి చతుర్విధాః వర్ణాగజేషు విజ్ఞేయాః ।తేషాంలక్షణముచ్యతే, సంగ్రహాంధ్ర విద్యాకోశం, III పేజీ 595

(iii) సంయానము : సమ, వక్ర రీతులలో పోవుట.

(iv) వధా వధము : యుద్ధభూమి యందు గుఱ్ఱములను, బంటులను కాలితో త్రొక్కుట.

(v) హస్తి యుద్ధము : మరొక ఏనుగుతో పోరాటము చేయుట.

(vi) నాగరాయణము : పట్టణ ద్వారములను, భవనములను కూలద్రోయుట.

(vii) సాంగ్రామికము : యుద్ధమునందు పాల్గొనుట.

మొదలగునవి గజశిక్షణ యందలి భాగములు.

గజ బలమును జలస్థల ప్రదేశములలోగాని, దుర్గారణ్య ప్రదేశములలో గాని, సమవిషమ ప్రదేశములలోగాని ఉపయోగించి జయమును సాధింప వచ్చును[1].

మదధారలను స్రవించు ఏనుగులు శ్రేష్ఠమైనవిగా చెప్పదగినవి. అయోధ్యా నగరమునందలి ఏనుగులను భాస్కర రామాయణ కర్త ఈ విధంగా వర్ణించాడు.

చ॥ తరళిత దంతకాంతి సముదంచిత బృంహిత నీలదేహముల్
పరగ దటిల్లతా స్తనిత భాసుర వారిధరంబులోయనన్
బొరి బొరి నేనుగుల్ దిరిగి పుష్కర శీకర దాన ధారల
ప్పురమున బెల్లుగా గురియు భూతలమంతయుఁ బంకిలంబుగన్[2]

దంత కాంతులతో ప్రకాశించు నల్లని శరీరములు గలిగి మెఱుపులతో గూడిన మేఘము లో యన్నట్లున్న ఆ పట్టణమందలి ఏనుగులు తమ మదధారలతో భూమండలము నంతను బురదగా చేయుచున్న వని దాని భావము.

ఈ కాలంనాటి వీరులు భయంకరమైన ఏనుగులను గూడ అంకుశముతో తమకు లొంగునట్లుగా చేసుకొనగలరు. యూపాక్షుడు యుద్ధమునకు బయలుదేరుటను భాస్కర రామాయణకర్త ఇట్లు వర్ణించినాడు.

తే॥ గీ॥ నడపు గోపంబు గల కొండనాగ గలిత
దానని ర్ఝరార్ద్రంబగు తన గజంబు
లిలనంకుశాహతి గెరలించుచున్న
వాడు యూపాక్షుడనువాడు వసుమతీశ[3]

---

1. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం III పేజి 595, 2. భాస్కరా.బా. 36, 3.భాస్కర. రా.యు. 796

నడచుచున్న కోపమున్న కొండవలెనున్నది, మదజలమును ధారగా స్రవించుచున్నది యగు ఏనుగును అంకుశముతో యూపాక్షుడు తోలుకొని వచ్చుట ఇందు చెప్పబడినది.

యుద్ధములలో నుపయోగించు ఏనుగులకు పేర్లు పెట్టు ఆచారము కూడ అనాడున్నట్లు తెలియును, మహోదరుడు "సుదర్శమను" పేరుగల ఏనుగుపై నెక్కి యుద్ధమున కేగినాడు[1].

ఆ కాలంలో రాజులు గజ సైన్యములను ఉత్పత్తిచేయు 'నాగవనము' లను జాగ్రత్తగా కాపాడుచుండెడివారు. అయోధ్యకాండలో రాముడు భరతుని కుశల ప్రశ్నలడుగు సందర్భమున వాల్మీకి యీ విషయమును దెల్పినాడు.

"కచ్చిన్నాగవనం గుప్తం, కచ్చిత్తే సంతిధేనుకాః
కచ్చిన్నగణికాశ్వానాం, కుంజరాణాం చ తృప్యసి[2]

నాగవనము చక్కగా రక్షింపబడుచున్నదా! అంతేగాక ఏనుగులను పట్టుటకు సాధనములుగా నుపయోగించు ఆడ ఏనుగులను, గుఱ్ఱములను, మగ ఏనుగులను సాధించుటలో తృప్తి చెందవుగదా యని దాని భావము.

"ధేనుకాః" అనగా గజగ్రహణ సాధన భూతములైన ఆడ ఏనుగులు, దీనిని బట్టి మగ ఏనుగులను పట్టుటకు ఆడ ఏనుగుల నుపయోగింతురని తెలియును.

**(iii) అశ్వబలము :** చతురంగ బలములలో గజబలము తరువాత చెప్పదగినది అశ్వబలము. అశ్వములు రథములకు కట్టుటకేగాక వీరులు యుద్ధమునకు వెళ్లునపుడధిరోహించుటకు నుపయోగించెడి వారు. ఈ విధముగా రౌతులచే నధిరోహింపబడిన అశ్వబలమే చతురంగ బలములలో నొకటియైనది.

కౌటిల్యుడు అశ్వదళము చేయవలసిన పనులను వివరించాడు. అవి 1. తగిన విడిది ప్రదేశములను శోధించుట, 2. విషమము గాని ప్రదేశములు, నీటిని, రేవును, గాలిని, వేడిని గుర్తించుట, 3 శత్రువులను తరుముట, 4. దెబ్బకొట్టుట, 5. శత్రు సైన్యమున ప్రవేశించి చెల్లాచెదరు చేయుట, 6. కోశమునుగాని, రాజకుమారుని గాని తప్పించి తీసుకొని పోవుట, 7. వెనుక భాగమందును. కోనలందును శత్రువులపై బడుట యనునవి చెప్పదగినవి.

1. మూ.రా.యు. 69-20, 2. మూ.రా. అయో. 100-50

ఆంధ్ర కామందక కర్త కూడ అశ్వబలము వలన గలుగు ఉపయోగముల నిట్లు దెల్పినారు.

సీ॥. . . .కొండల దండ దిక్కుల మార్గముల యందు

విమతుల మూకల వెదకుటయును

ధాన్యాదులను మిత్రతతుల రాజేయుట

మేగంపు పనులు గావించుటయును

పరుల వెంటాడుచు తిరుగుచో విఱుగుట

వితిగియు గ్రమ్మఱ వెంటబడుట[1]...

కొండ ప్రాంతములలో శత్రసేనలను వెదకి వెంటాడుట, ధాన్యాదులను మోయుట మిత్రులను చేరవేయుట శీఘ్రమైన పనులను నెఱవేర్చుట శత్రువులకు చిక్కకుండా పారిపోవుట మొదలగు పనులను అశ్వబలము నిర్వర్తించును.

గుఱ్ఱములలో శ్రేష్ఠమైనవానిని వాల్మీకము దెల్పినది. అయోధ్యా నగరము నందలి గుఱ్ఱములను ఇట్లు వర్ణించినాడు.

"కాంభోజ విషయే జాతైః బాహ్లికైశ్చ హయోత్తమైః

వనాయుజైర్న దీజైశ్చ। పూర్ణా హరి హయోత్తమైః"[2]

కాంభోజ దేశమున పుట్టినవి, బాహ్లిక దేశమున జన్మించినవి, వనాయు దేశము జన్మించినవి, సింధు దేశమున పుట్టినవి, ఇంద్రుని ఉచ్చైశ్రవము వంటివి యగు శ్రేష్ఠమైన గుఱ్ఱములతో అయోధ్యా నగరము నిండియున్నదని భావము.

పైన దెల్పిన ఆయా దేశములందలి గుఱ్ఱములు శ్రేష్ఠమైనవిగా చెప్పదగినవి.

శ్రేష్ఠమైన అశ్వములకు ఐదు విధములగు గతులున్నవి. అవి 1. ఆస్కంధితము, 2. ధౌరితకము, 3. రేచితం, 4. వల్గితం, 5 ప్లుతం.

1. ఆస్కంధితము — అతివేగంగా కాకుండా అతిమందంగా కాకుండా మధ్య రకంగా పరుగెత్తే ధార.

1. ఆంధ్ర కామందకం – 8-53, 2. మూ.రా. బాల. 6-22

2. ధౌరితకము - ఆస్కంధితం కంటె వేగమైన ధార
3. రేచితం - వంకర లేకుండా వేగంగా పోయే ధార
4. వల్గితం - వేగంగా విడువబడి మీదికి కాళ్లు కదలించుచు పరుగెత్తు ధార
5. ప్లుతం - ఒకే వేగంతో దూరమంతయు పరుగెత్తు ధార.

అయోధ్యా నగరమునందలి గుఱ్ఱములు ఈ ఐదు విధములగు ధారలతోను ప్రసిద్ధమైనట్టివిగా భాస్కర రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

చ॥ జవమున భంజళిన్ మురళిఁ జౌకమునన్ నడనైదుధారలన్
వివిధ విచిత్ర వల్గన వివేకముల౯్ బొలపంబునన్ శుభ
ధ్రువముల దూరభావముల రూపబలంబుల రూఢికెక్కియా
హవ జయశీలముల్ గలుగు నశ్వము లెన్నఁగఁ బెక్కులప్పురిన్[1]

వేగము గల్గినవి. భంజళి, మురళి, చౌకము వంటి గతిభేదము లందును, ఐదు ధారలందును చిత్రముగా దుముకుట మొదలగు వానియందు నేర్పు గలిగి, మంచి రూపమును, అధిక బలమును గలిగి ప్రసిద్ధి చెంది, విజయమును గల్గించునట్టి అశ్వములు ఆ పట్టణమున అనేకములు గలవు.

అశ్వశాలాధ్యక్షులను "సాహిణి" లంటారు. ప్రాచీన కావ్యములందు అశ్వములతోబాటు యుద్ధభూమియందు వాటిపై స్వారీ చేయు వీరులు వర్ణింపబడినారు. రావణునితోపాటు యుద్ధానికి బయలుదేరిన వీరులను విభీషణుడు వర్ణించు సందర్భమున "పిశాచరాజు"ను గూర్చి తెల్పుటను భాస్కరరామాయణ కర్త ఈ విధముగా తెలిపినాడు.

తే॥ గీ॥ సంజ మొగులు నిద్దంపుఁ గెంజాయ మేను
గలుగు తురగ రత్నము చిత్రగతుల మెఱయ
వడి మహాశని వడువున వచ్చునన్ని
శాత కుంతహస్తుండు పిశాచరాజు[2]

1. భాస్క.రా.బా. 37, 2. భాస్క. రా.యు. 800

సంధ్యా కాలపు మేఘములవంటి ఎఱ్ఱని శరీరపు రంగుగల శ్రేష్ఠమైన గుఱ్ఱముపై పిశాచరాజు పదునైన కుంతమను ఆయుధమును బట్టుకొని బయలుదేరినాడు. అట్లే రావణ పుత్రుడు నరాంతకుడును తెల్లని గుఱ్ఱముపై నెక్కి అంగదు నెదర్చినాడు. ఆ భయంకర యుద్ధమున గుఱ్ఱములు నేలకూలుటను రంగనాథ రామాయణ కర్త ఈ విధముగా చక్కగా వర్ణించినాడు.

"ఎక్కిన రౌతుల నిటునటుబడగ, లెక్కసేయక కరాళించు గుఱ్ఱములు
పక్కెఱ లూడంగ బఱచు గుఱ్ఱములు, దిక్కులు సుడివడ దిరుగు గుఱ్ఱములు
కీలెడలిన క్రియగెడయు గుఱ్ఱములు, కూలికాళ్లను దన్నుకొనెడి గుఱ్ఱములు
వికలంబులై పోరు విచ్చుగుఱ్ఱములు, నొకరూపు నేర్పడకుండు గుఱ్ఱములు[1]

ఇందు గుఱ్ఱములపై కూర్చొను రౌతు జీనును పఱచుకొనుట చెప్పబడినది.

ముప్పదిరెండు అంగుళముల ముఖము, ముఖమునకు ఐదు రెట్లు పొడవు నూరు అంగుళముల చుట్టుకొలత ఉన్న గుఱ్ఱము ఉత్తమమైనదని కౌటిల్యుడు తెల్పినాడు[2].

శ్రేష్ఠమైన గుఱ్ఱాలను ఉత్తమములైన యోధులకే అప్పగించడం జరుగుతుంది. వాటికి తగిన శిక్షణ నిస్తారు.

**(iv) పదాతిదళం** : సేనా విభాగంలో పదాతిదళం పెద్దదిగా ఉండును. దీనినే కాల్బలమని అందురు. పదాతిదళం అధికంగానున్న సేనకే అపారమైన శక్తి ఉంటుంది. "సర్వదేశ కాలములయందును ఆయుధములను ధరించుట, సైనిక వ్యాయామము పదాతులకు ముఖ్య కార్యా"లని కౌటిల్యుడు పేర్కొనినాడు. శిబిరములను, మార్గములను, సేతువులను, కూపములను, తీర్థములను శోధించుట, యంత్రములను ఆయుధములను, గుడారములను నిర్మించుట కవసరమగు ఉపకరణములు మోయుట, గాయపడిన వారిని సురక్షిత స్థానానికి చేర్చుట మొదలగునవి పదాతి దళం చేయవలసిన పనులు. బలవంతులు, సత్వసంపన్నులు, మర్మజ్ఞులు సూక్ష్మవేదులు, యుద్ధభూమి విభాగజ్ఞులునగు పదాతులు లభించుట దుర్లభమని యుద్ధ శాస్త్రము తెల్పుచున్నది[3].

1. రంగ. రా.యు. 367 పేజీ, * పక్కెఱ – గుఱ్ఱముపై వేయబడిన జీను.
2. అర్థశాస్త్రం – పేజి 18, 3. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము – III పేజి 597

అయోధ్యా నగరము నందలి పదాతి దళమును గూర్చి భాస్కర రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

చ॥ కులగురులెత్తనైన పడిఁగుంభిని గ్రుంగగఁ ద్రొక్కనైన వా
ర్ధుల గలపంగనైన జము దుప్పలు దూలగఁ దోలనైనది
గ్వలయ మదేభ కుంభములు వ్రక్కలు సేయగనైన జాలు దో
ర్బలముల గెల్తురాజిఁ బరిపంథుల నందుల వీరసద్భటుల్[1]

అయోధ్యా నగర మందలి వీరభటులు కులపర్వతములెత్తగల్గినట్టి, భూమిని క్రుంగి పోవునట్లు చేయగల్లినట్టి, యముని కూడ చలింపజేయ గల్గినట్టి, దిగ్గజముల కుంభ స్థలములు పగులకొట్ట గల్గినట్టి భుజబలము గలవారై శత్రువులను యుద్ధమున జయింపగలవారు.

వాల్మీకి మహర్షి అయోధ్యానగరపు పదాతి దళములను మరికొంత విశేషముగా వర్ణించినాడు.

"యోధనామగ్ని కల్పానాం, పేశలానా మమర్షిణామ్
సంపూర్ణాకృత విద్యానాం, గుహాకేసరిణామివ[2]

అధిక శౌర్యముచే అగ్నితోసమానులు, కుటిలత్వము లేనివారు, పరాభవము సహింపని వారు, శస్త్ర విద్యలు బాగుగా నేర్చినవారు నగు భటులతో ఆ అయోధ్య సింహములతో గుహవలె పరిపూర్ణమైయుండెను.

రాక్షస సేవకు సంబంధించిన పదాతి దళముల విశేష వర్ణనయు కుంభ కర్ణుడు యుద్ధమునకు బయలుదేరు సందర్భమున వాల్మీకమున యిట్లు గలదు.

"పదాతయశ్చ బహవో మహానాదా మహాబలాః
అన్వయూ రాక్షసా భీమా భీమాక్షా శ్శస్త్ర పాణయః
రక్తాక్షా స్సు మహాకాయా నీలాంజన చయోపమా ః
శూలానుద్యమ్య ఖడ్గాంశ్చ నిశితాంశ్చ పరశ్వథాన్
బహువ్యామాంశ్చ పరిఘాన్ గదాంశ్చ ముసలాని చ
తాలస్కంధాంశ్చ విపులాన్ క్షేపణీయాన్ దురాసదాన్[3]

---

1. భాస్క రా.బాల - 39, 2. మూ.రా.బాల - 21, 3. మూ.రా.యు. 65-38 నుండి 40 శ్లో॥

మహాబలవంతులు, భయంకరాకారులు, భీకర నేత్రులు, ఎఱ్ఱని కన్నులుగలవారు, పెద్ద శరీరములు గలవారు, నల్లనికాటుక రాశులవంటి వారు నగు పదాతులైన రాక్షసులు వాడికత్తులను, గొడ్డళ్లను, పొడవైన పరిఘలను, గదలను, ముసలములను, తాటిచెట్లను తీసుకొని పెద్ద ధ్వని చేయుచు కుంభకర్ణుని వెంట వెళ్లినారు.

రావణుని చతురంగ బలవర్ణనమును భాస్కర రామాయణకర్త ఈ విధముగా చేసినాడు.

సీ॥ ధీర సత్త్వంబుల దిగ్గజంబులకైన
సిగ్గు పుట్టించెడి సింధురములు
గతివిశేషంబుల శతమఖుతురగంబు
దలవంపజేయు సైంధవ గణంబు
చటుల జవంబున చండభానుని తేరు
సరకుసేయని మహాస్యందనములు
భూరి పరాక్రమంబున సింహముల తెంపు
కలిమిమెచ్చని యట్టి కాల్బలంబు[1]

.......................

లక్ష్మణుడు ఇంద్రజిత్తు నెదిరించుటకై నికుంభిలకు వెళ్లిన సందర్భమున ఈ విధమగు చతురంగ బలముల నాతడు చూచుట జరిగినది.

**(v) ఇతరములు :** చతురంగ బల వ్యవస్థ సాధారణము కాగా రామాయణము మరికొన్ని విశేష విషయములను వర్ణించినది.

కుంభకర్ణుడు యుద్ధమునకు బయలుదేరు సందర్భమున చతురంగ బలములతోపాటు రాక్షసులు, ఇతర జంతువుల నధిరోహించి వెళ్లుటను వాల్మీకి ఈ విధముగా వర్ణించినాడు.

సర్పైః ఉష్ట్రైః ఖరైః అశ్వైః సింహ ద్వీప మృగద్విజైః
అనుజగ్ముశ్చ తం ఘోరం కుంభకర్ణం మహాబలమ్[2].

కొందఱు సర్పములను, ఒంటెలను, గాడిదలను, అశ్వములను, సింహములను

1. భాస్క.రా.యు. 1323, 2. మూ.రా.యు. 65-36

ఏనుగులను. లేళ్లను, పక్షులను అధిరోహించి కుంభకర్ణుననుసరించిరి. ఇందు సర్పములను, ఒంటెలను, సింహములను, లేళ్లను, పక్షులను అధిరోహించుట విశేషము. సర్పములు, లేళ్లు, పక్షులలో పెద్ద శరీరములుగల వానిపై వారు వెళ్లుట జరిగి యుండును. అంతేగాక వానరులను భయభ్రాంతులను చేయుటకును వారట్లు చేసి యుండవచ్చును.

అట్లే వజ్రదంష్ట్రుడు యుద్ధానికి బయలుదేరునపుడు అతని వెంట ఒంటెల సైన్యము, గాడిదల సైన్యము వెళ్లుటను వాల్మీకి వర్ణించినాడు.

"నాగై రశ్వైః ఖరై రుష్ట్రైః సంయుక్తస్సు సమాహితః[1] అని చెప్పబడినది.

అట్లే త్రిశిరుడు యుద్ధమునకు బయలుదేరునపుడు వృషభము నెక్కి వెళ్లుటను వాల్మీకమిట్లు వర్ణించినది.

"యశ్చైష శూలం నిశితంప్రగృహ్య । విద్యుత్ర్పభాం కింకర వజ్రవేగం
వృషేంద్ర మాస్థాయ గిరప్రకాశ । మాయాతి యోసౌత్రిశిరాయశస్వీ[2]

త్రిశిరుడు సింహమునెక్కి యుద్ధమునకు వెళ్లినట్లు గోన బుద్ధారెడ్డి ఈ విధంగా వర్ణించినాడు.

ద్వి॥ మిక్కిలి కడిమిమై మెఱసి సింహంబు
నెక్కిశూలంబు పట్టి యేతెంచువాడు
అనిమీద వేడుక నలరిన వాడు
దినకరకులనాథ త్రిశిరుడన్వాడు[3]

రామలక్ష్మణులు హనుమంతుని, అంగదుని అధిరోహించి యుద్ధము చేయుటను రామాయణము వర్ణించినది.

**3.1.3.** సైనిక గణన : వానర సైన్యమునకు సంబంధించి మూల బలమును వివరించునపుడే లెక్కలకందని సంఖ్యామానము చెప్పబడినది. మిగిలిన సందర్భములలో సైనిక గణనము "అక్షౌహిణీ" పదముచే చెప్పబడినది. విశ్వామిత్రుడు "అక్షౌహిణీ రథ సేనాధ్యక్షుడ" ని భాస్కర రామాయణము చెప్పినది.[4].

అక్షౌహిణీ పదము రామాయణమున అనేకచోట్ల ప్రయోగింపబడినది.

---

1. మూ.రా.యు., 53-5, 2. Ibid 59-19, 3. రంగ.రా.యు. 336 పేజి, 4. భాస్క.రా.బాల - 566 పద్యం

అంగదుడు రాయబార సందర్భమున రాక్షసుల బారినుండి తప్పించుకొనిన తర్వాత రాక్షసులు సముద్రతీరమున విడిసిన వానర సైన్యములను చూచుటను వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

"తేషా మక్షౌహిణీ శతం సమవేక్ష్య వనౌకసామ్
లంకాము పనివిష్టానాం సాగరంచాతి వర్తతామ్
రాక్షసా విస్మయం జగ్ముః ............[1]

లంకలో విడిసిన, సముద్ర తీరముననున్న నూరు అక్షౌహిణుల వానర సేనను చూచి రాక్షసులు ఆశ్చర్యపడిరి. దీనినే గోన బుద్ధారెడ్డి "వేయి లక్షలు కోటాను కోటు లక్షౌహిణులు" అంటాడు[2].

విశ్వామిత్రుడు దశరథుని వద్దకు వచ్చి రామలక్ష్మణులను పంపుమని కోరినపుడు అందుల కిష్టపడని దశరథుడు తాను "అక్షౌహిణీ సామంతుల నీక్షణమ గొనుచు వేగమే వచ్చెద" ననుటను భాస్కర రామాయణం తెల్పింది[2].

ఈ విధంగా "అక్షౌహిణీ" పదం రామాయణ కాలం నాటినే ప్రసిద్ధమై యున్నది.



1. మూ.రా.యు. 41-95, 96, 2. రంగ. రా.యు. - 307 పేజి, 3. భాస్కరా. బాల 199

# చతుర్థ ప్రకరణము

## 4.1. వ్యూహము - వ్యూహనిర్మాణావశ్యకత :

యుద్ధమున చతురంగ బలములను నడుపుటకు అనుసరించు విధానమును వ్యూహమందురు. వ్యూహ పదము వ్యూథముగాగూడ కొన్నిచోట్ల ప్రయోగింపబడుట గలదు. చతుర్విధ సేనాంగములను యుద్ధమునందు తంత్ర దృష్ట్యా వివిధాకారములతో విన్యాస మొనర్చుటయే వ్యూహమని సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము నిర్వచించినది[1]. శ్రీఖండవల్లి లక్ష్మీరంజనం గారు తమ మహాభారత ద్రోణపర్వ పీఠకలో వ్యూహమును గూర్చి తెల్పుతూ "బలమును చక్కగా అమర్చి తక్కువ సైన్యములతో ఎక్కువ యుద్ధశక్తిని కలిగించి శత్రు నిర్మూలనము చేయుటయే సుశిక్షిత యుద్ధ విధానమని, దాననే వ్యూహమందురని తెల్పియున్నారు[2]. వారే కొందఱు విశేషముగా ఆలోచించి చేయు సైన్య రచనగా నిర్వచించినట్లును తెల్పియున్నారు. ఒక రాజు శత్రురాజుపై దాడి చేయుటకుగాని, రెండవ రాజు ఆత్మరక్షణ చేసుకొనుటకుగాని, సందర్భమును బట్టి భిన్న రీతులుగా వ్యూహములు నిర్మించుకొనవలసి యుండును. దాడికుపకరించు వ్యూహమును విగ్రహమనియు, ఆత్మరక్షణ రూపమగు దానిని ఆసనమనియు వ్యవహరింతురు[3]. రామాయణ యుద్ధమున రాముడు దండెత్తిన వాడుకాగా, రావణుడు ఆత్మరక్షణ గావించుకొనిన వాడు.

### 4.1.1. వ్యూహ నిర్మాణ అవశ్యకత :

అల్ప సంఖ్యాకమైన సైన్యం గలవారు ఆ బలాన్ని గరిష్ట ప్రయోజనవంతంగా ప్రయోగించుటలోనే వ్యూహ భావన ఏర్పడింది. యుద్ధ యుక్తినుండే సంరక్షిత విక్రమ విధానమనబడే వ్యూహం పరిణమించింది. వ్యూహ నిర్మాణము వలన శత్రువుల యొక్క శక్తిని, కాలమును వృధా చేయుటకు అవకాశము గల్గును. సైన్యాన్ని పొందుపుగాను, శక్తివంతంగాను ప్రయోగించడానికే వ్యూహాలు ఏర్పడినాయి. నిర్మాణాత్మకమైన వ్యూహము లేకుండా ముఖాముఖీ దొమ్మి యుద్ధానికి దిగడం వలన రాజు అధికంగా నష్టమును పొందుతాడు. భుక్తికోసం సైన్యంలో చేరిన సామాన్య

---

3. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము - VI పేజి 230

జనులను రాజు సరైన వ్యూహ రచన లేకుండా యుద్ధభూమికి బలిపెట్టడం తగినది కాదు.

### 4.1.2. "వ్యూహ" పదమునకు గల నిర్వచనములు :

(i) "వ్యూహస్తు బల విన్యాసం" - అని అమరకోశం తెల్పినది. విశిష్టమైన సేనా విన్యాస పద్ధతి వ్యూహంగా చెప్పబడింది 'బలవిన్యాసం' అనగా సేనను ఒడ్డడం.

(ii) "వ్యూహ్యతే రచ్యతే ఇతి వ్యూహః" - అనగా రచింపబడునది.

(iii) మరొక వ్యుత్పత్తి "విశేషేణ ఊహ్యతే ఇతివ్యూహః ఊహోవితర్కో" అంటే విశేషంగా ఆలోచింపబడునది. విశేషమైన ఆలోచన చేసియే సేనా నాయకుడు చతురంగ బలములను యథా స్థానంలో ఉంచుతాడు. కాబట్టి దీనిని విశేషమైన ఊహా ఫలితంగా చెప్పినారు.

(iv) ఈ వ్యూహ రచనను పాశ్చాత్యులు "మిలిటరీ టాక్టిక్స్" అంటారు. ఆంగ్ల విజ్ఞాన సర్వస్వం Military Tactics గురించి ఇట్లు పేర్కొంది.

"Tactics of Smaller Units or of a single combat arm, is called minor tactics. Tactics of large force is termed grand tactics. Tactical mobility is the ability to more rapidly from one part of a battle field to another... In any particular military operation the choice of tactics will be influenced by a number of factors. These include the commanders mission the forces and weapons avoilable to him, the terrain over which he must operate, the enemy's strength and dispositions and the wether......"

వ్యూహాలకు తఱచుగా పశు పక్ష్యాదుల యొక్క విశిష్ట వస్తుల యొక్క పేర్లు ఉంచడం కనిపిస్తుంది.

(iv) ధనుర్వేదం వ్యూహ రచన గూర్చి ఈ విధంగా తెల్పింది.

"ముఖే రథాగజాః పృష్టే తత్పృష్టేచ పదాతయః
పార్శ్వ యోస్తు హయాః కార్యః వ్యూహస్సాయం విధిస్మృతః
అర్ధచంద్రంచ చక్రంచ శకటం మకరం తథా
కమలం శ్రేణికా గుల్మం వ్యూహోనేవ ప్రకల్పయేత్"

---

1. ప్రాచీనాంధ్ర కావ్యాలు - రాజనీతి - పేజి 204

వ్యూహ ముఖమున రథములు, వాని వెనుక గజములు, వాని వెనుక పదాతి దళము పార్శ్వములందు గుల్మములు ఉండునట్లుగా వ్యూహము నేర్పరుపవలెనని దాని భావము. అర్ధచంద్రము, చక్రము, శకటము, మకరము, కమలము, గుల్మము మొదలగు ఆకారములతో వ్యూహరచన యుండునని ఇందు చెప్పబడినది.

**4.1.3. వ్యూహములలో రకములు :**

కౌటిల్యుడు వ్యూహములను గూర్చి ఐదు విధములుగా చెప్పినాడు. అవి 1. దండము, 2. మండలము, 3. భోగము, 4. అసంహతము, 5 విషమము. ఇవిగాక సమము, హస్తి, పత్తి, అశ్వ వ్యూహములును చెప్పబడినవి. భూమి యొక్క స్వభావమును బట్టి ఈ వ్యూహ నిర్మాణములుండును.

(i) దండ మనగా సైన్యమును అడ్డముగా తీర్చుట. సమతలము గల మైదానమునందు దండ వ్యూహము రచింపబడును.

(ii) మండలమనగా అన్ని మూలల నుండియు రక్షణ కలుగునట్లు రచించుట. దీనికి సమతలముగానున్న మైదానమే అనుకూలమైనట్టిది.

(iii) భోగ వ్యూహమనగా సైన్యాంగములను ఒకదాని వెనుక ఒకటి నిలువ బెట్టుట. భూమి నిమ్నోన్నతము గానున్నప్పుడు భోగవ్యూహము రచింపబడును.

(iv) అసంహత మనగా సైన్య శ్రేణులను వేర్వేరు స్థానములలో మోహరించుట. భూమి నిమ్నోన్నతముగా నున్నప్పుడే అసంహత వ్యూహమును రచింపబడును.

(v) భూ తలము విషమముగా నున్నచో విషమ వ్యూహము రచింపబడును.

సమవ్యూహము నందు ప్రతి యోధుడు ఆటంకము లేకుండా సంచరించుటకు అవకాశముండును. కావున ఆయుధములన్నియు ఒకే ప్రమాణము గల దూరములో నుంచబడును.

హస్తి వ్యూహము నందు, అశ్వవ్యూహము నందు పార్శ్వములందు తొమ్మిది ఏనుగుల నేర్పాటుచేయుదురు. హస్తి వ్యూహమున పురోభాగమందు యుద్ధ గజములు ఉపయోగింపబడును.

పత్తి వ్యూహమున పురోభాగమందు సాయుధులైన, సకవచులైన యోధు లుంచబడుదురు. వెనుక భాగమున ధనుర్ధారులుందురు.

పైన తెల్పిన వ్యూహముల నుండి వివిధాకారములైనవి, వివిధమైన పేర్లు గలవి యగు అనేక వ్యూహము లేర్పడినవి. వాటి పేర్లను బట్టియే వాటి ధర్మములను మనము కొంత ఊహింపవచ్చును. వివిధ వ్యూహములకు సంబంధించిన నియమము లను కౌటిల్యుడు అర్థశాస్త్రమున విపులముగా వర్ణించినాడు.

## 4.2. రామాయణ వ్యూహములు :

రామాయణము నందలి ప్రధాన యుద్ధమైన రామరావణ సంగ్రామ ఘట్టమున వ్యూహ నిర్మాణము గోచరించును. వానర రాక్షస సేనలు ఒక పద్ధతి ప్రకారమే నడచినవి.

రాముడు వానర సైన్యమును గరుడ వ్యూహముగా విభజించి నిల్పినాడు. శార్దూలుడను గూఢచారి రావణునకు ఆ విషయము దెల్పుటను వాల్మీకమిట్లు దెల్పినది.

"గరుడ వ్యూహమాస్థాయ సర్వతోహరిభిర్వృతః
మాం విసృజ్య మహాతేజా లంకామేవాభి వర్తతే"[1]

రాముడు వానర సేనతో చుట్టుకొనబడినవాడై గరుడ వ్యూహమును పన్ని లంకను ముట్టడించినాడు. తమకు తెల్పుటకై నన్ను మాత్రము విడిచినాడని శ్లోక భావము.

ఆ వ్యూహము నందెవరెవరు ఏఏ స్థానములందు నిలిచినదియు వివరించినాడు. వ్యూహమున దక్షిణ పార్శ్వమున ఋషభుడు, వామపార్శ్వమున గంధమాదనుడు, శిరః ప్రదేశమున రామలక్ష్మణులు, కుక్షి స్థానమున జాంబవంతుడు, సుషేణుడు, వేగదర్శి యనువారలు, పృచ్ఛ భాగమున వానరరాజగు సుగ్రీవుడును నిలిచినారు. వ్యూహ నిర్మాణము పూర్తియైన తరువాతనే అంతకు పూర్వము దూతగా వచ్చి బంధింపబడిన శుకుని సుగ్రీవుడు విడిచినాడు[2].

రాముని వ్యూహమును గూర్చి తెలుసుకొనిన రావణుడు తన లంకా నగరమును పూర్వము కంటె పటిష్టము చేసినాడు. ప్రహస్తుని తూర్పు ద్వారము వద్దను, మహోదర, మహాపార్శ్వులను దక్షిణ ద్వారము వద్దను, ఇంద్రజిత్తును పశ్చిమ

1. మూ.రా.యు. 30-12 శ్లో॥., 2, I bid 24-15 నుండి 18 శ్లో.

ద్వారాము వద్దను, శుకసారణులను మరియు స్వయముగా తానును ఉత్తర ద్వారము వద్దను పోరాటము సాగించుటకై ఏర్పాట్లను చేసినాడు. పుర మధ్యమమును రక్షించుటకై విరూపాక్షుని నియమించినాడు.

విభీషణుని మంత్రులు పక్షి రూపములు ధరించి లంకానగరము లోనికి గూఢచారులుగా ప్రవేశించి రావణుని ఏర్పాట్లను గుఱించి తెలుసుకొని రాముని వద్దకు వచ్చి వివరించినారు. అది గ్రహించిన రాముడు రావణుని వ్యూహమునకు ప్రతి వ్యూహమును పన్నుచు పల్కిన మాటలను వాల్మీకము ఈ విధముగా తెల్పినది.

"పూర్వద్వారేతు లంకాయాం నీలో వానర పుంగవః
ప్రహస్త ప్రతియోద్ధాస్యాద్వానరైర్బహుభి ర్వృతః
అంగదో వాలిపుత్రస్తు బలేన మహ తావృతః
దక్షిణే బాధతాం ద్వారే మహాపార్శ్వ మహోదరౌ
హనుమాన్ పశ్చిమద్వారం నిపీడ్య పవనాత్మజ ః
ప్రవిశత్వ ప్రమేయాత్మా బహుభిః కపిభిర్వృతః
దైత్య దానవ సంఘానాం ఋషీణాం చ మహాత్మనామ్
విప్రకార ప్రియఃక్షుద్రో వరదాన బలాన్వితః
పరిక్రామతి యస్సర్వాన్ లోకాన్ సంతాపయన్ ప్రజాః
తస్యాహం రాక్షసేంద్రస్య స్వయమేవ వధే ధృతః
ఉత్తరం నగరద్వార మహం సౌమిత్రిణా సహ
నిపీడ్యాభి ప్రవేక్ష్యామి సబలో యత్ర రావణః[1]

తూర్పు ద్వారమున నిలిచిన ప్రహస్తుని నీలుడు, దక్షిణ ద్వారముననున్న మహోదర మహాపార్శ్వులను అంగదుడు, పశ్చిమ ద్వారాముననున్న ఇద్రజిత్తును హనుమంతుడు, ఉత్తర ద్వారమునగల రావణుని లక్ష్మణ సమేతుడై తానును ఎదిరింపవలెనని నిర్ణయించెను. సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు, ఈ ముగ్గురును ఉత్తర పశ్చిమ ద్వారముల మధ్య రావణేంద్రజితుల నడుమ సేనగా నుండవలెనని పల్కెను.

రావణుని సేనా నాయకులును వ్యూహముగానే తమ సేనలను నడుపు కొనుచు యుద్ధమునకు బయలుదేరినారు. ప్రహస్తుడు మంత్రి సమేతముగా

1. మూ.రా.యు. 37-26 నుండి 21 శ్లో॥

యుద్ధమునకు బయలుదేరుటను వాల్మీకి ఈ విధముగా వర్ణించినాడు.

వ్యూఢేనైవ సుఘోరేణ పూర్వద్వారాత్ స విర్యయౌ
గజయూధ నికాశేన బలేన మహతా వృతః[1]

ఆ ప్రహస్తుడు వ్యూహ రూపమున నిలుపబడినదియు, ఏనుగుల గుంపువలెన నున్నదియు, మహాభయంకర మైనదియునగు పెద్ద సేనతో తూర్పు ద్వారమునుండి యుద్ధమునకు పోయెనని ఆ శ్లోక భావము.

వ్యూహ పదము 'వ్యూఢ'ముగా భగవద్గీత యందును ప్రయోగింపబడినది. ధృష్టద్యుమ్నుడు సైన్యమును యుద్ధమునకు సిద్ధముగా వ్యూహ రూపమున నిలిపినాడని దుర్యోధనుడు ద్రోణునితో పల్కుట భగవద్గీత యందు ఇట్లు చెప్పబడినది.

"వ్యూఢాం ద్రుపద పుత్రేణ తవ శిష్యేణ ధీమతా"[2]

ఓ ఆచార్యా! బుద్ధిమంతుడగు మీ శిష్యుడు, ద్రుపద పుత్రుడునగు ధృష్టద్యుమ్నునిచే వ్యూహ రూపమున మోహరింపబడిన సేనను చూడుము అని ఆ శ్లోక భావము.

రాముడు గరుడు వ్యూహముగా సేనను సిద్ధము చేయుటను తెలుగు రామాయణములు గూడ తెల్పినవి. భాస్కర రామాయణకర్త ఇట్లు తెల్పినాడు.

గరుడ వ్యూహముగా వా
నరసేన సమర్చికొని రణక్రీడకు నా
ధరణీపతి వచ్చుచున్నా
డురవడి నట సీత బుచ్చుటుచితం బెంకన్"[3]

మొదటి దినమున రాముడు లంకను ముట్టడించిన విధము రామాయణము విపులముగా వర్ణించినది. తూర్పు ద్వారమును 10 కోట్ల వానరులతో కుముదుడను వానర యూథపు డాక్రమించినాడు. ఆతనికి ప్రఘసుడు, పనసుడు సహాయంగా వెళ్లినారు. దక్షిణ ద్వారమును శతబలియను వానర యూథపుడు ఇరవై కోట్ల వానర వీరులతో ముట్టడించినాడు. గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు అనువారు అన్ని వైపులను తిరుగుతూ వానరసేనను రక్షించారు. పశ్చిమ ద్వారాన్ని సుషేణుడు 60 కోట్ల మంది వానరులతో ముట్టడించాడు. ఉత్తర

---

1. మూ.రా.యు. 57-32, 2. భగవద్గీత - 1-3, 3. భాస్క రా.యు. 375 పద్యం

దిక్కును సుగ్రీవ సహితులై రామలక్ష్మణులు ముట్టడించారు. గోలాంగూల నాయకుడైన గవాక్షుడు కోటి గోలాంగూలములతోను, మరొకప్రక్క కోటి భల్లూకములతో ధూమ్రుడు నిలిచాడు.

మహాభారతము నందలి అరణ్యపర్వమునగల రామ చరిత్రమునందు రామ, రావణులు పన్నిన వ్యూహముల ప్రసక్తి ఇట్లుగలదు.

"రావణుండు అభేద్యంబగు.. ఔశనస వ్యూహంబు సంఘటించి వన
చర బలంబు పయి నడచినంగని రాఘవుండును బార్హస్పత్య వ్యూ
హంబు దీర్చి పేర్చి యెదురు కొనియె"[1]

ఇందు రావణుడు ఔశనస వ్యూహమును, రాముడు బార్హస్పత్య వ్యూహమును పన్నినట్లు చెప్పబడినది.

మొత్తము మీద రాముడు లంకానగరము యొక్క ముట్టడి వ్యూహాత్మకముగనే చేసినాడనుట స్పష్టము. వానర సేనాపతియగు నీలుడును వ్యూహ నిర్మాణమును గూర్చిన పరిచయము గలవాడే. కావుననే కుంభకర్ణుడు వానర సైన్యముపైకి వచ్చిన సందర్భమున రాముడు నీలునితో పల్కిన మాటలు గమనింపదగినవి.

"గచ్ఛ సైన్యాని సర్వాణి వ్యూహ్యా తిష్ఠస్వ పావకే
ద్వారాణ్యాదాయ లంకాయా శ్చర్యాశ్చాప్యథ సంక్రమాన్"[2]

ఓ నీలుడా ! నీవు పోయి సైన్యములను వ్యూహ రచనచే సమాయుత్తము చేసి లంకలోని ద్వారములు, చర్యా స్థానములు (రాజమార్గములు) ఆక్రమించి నిలువులు అని ఆ శ్లోక భావము. నీలుడు స్వయముగా వ్యూహ రచన చేయగలవాడు, కావుననే రాముడు నీలుని ఆ విధముగా ఆజ్ఞాపించినాడు.

రామాయణమున రాముడు లంకా నగరాన్ని ముట్టడించుటకు తగిన వ్యూహము నేర్పఱచుకొనగా రావణుడు లంకానగర రక్షణమును గూర్చి వ్యూహ నిర్మాణము చేసుకొనవలసి వచ్చినది.మహాభారత యుద్ధము కురుక్షేత్రమున యుద్ధము నకనువగు ప్రదేశమున ఏర్పాటుచేసుకొనుటచే వివిధ వ్యూహముల నిరుపక్షముల వారును పన్నుటకు తగిన అవకాశము గల్గినది. కానీ రామాయణమున ఏ విధముగను

1. మహాభారతము – అరణ్య 7-74, 2. మూ.రా.యు. – 61-35

ప్రవేశించుటకు వీలులేని లంకానగరమును లొంగదీసుకొనుటకు రాముడు వ్యూహ నిర్మాణమును చేసినాడు. గ్రద్దలో నుండునట్టి సూక్ష్మ దృష్టి, వేగము, శత్రువును చెంచువులతో పొడవడంలో గల నేర్పు మొదలగు ప్రత్యేక గుణములను దృష్టి యందుంచుకొనియే రాముడు గరుడ వ్యూహమును పన్ని యుండవచ్చునని చెప్పవచ్చును.

ఇంద్రజిత్తు రెండవమారు యుద్ధమునకు బయలుదేరునపుడు యుద్ధరంగమున హోమ కార్యము చేయుటకై అతడు తన బలమును వ్యూహము ననుసరించి నిల్పుటను మొల్ల ఇట్లు వర్ణించినది.

"లంకా నగరంబు వెడలి సంగ్రామ రంగంబునకుంజని తన బలంబుల చక్రాకారంబుగా నిలిపి తన్మధ్యంబున రథావతరణంబు చేసి" నాడు[1].

ఇచట ఇంద్రజిత్తు చక్ర వ్యూహముగా తన సైన్యమును నిల్పినట్లు భావింపవచ్చును. అన్ని దిశలనుండి ప్రమాదము వాటిల్లనని తలచినపుడు చక్ర వ్యూహము ఉపకారకముగా చెప్పబడినది[2].

ఇట్లు రామాయణము నందును వ్యూహ నిర్మాణము గలదు. వ్యూహములకు సంబంధించిన పేర్లు మాత్రము ఒకటి, రెండు తప్ప కన్పట్టవు.



1. మొల్ల.రా.యు. 1-102, 2. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం - 6వ భాగం - 231 పేజి.

# పంచమ ప్రకరణము

**5.1. యుద్ధ పద్ధతులు :**

క్షత్రియ ధర్మాన్ని అనుసరించే వారికి యుద్ధం విహితకర్మయని భగవద్గీత ఉద్ఘోషించింది[1]. క్షత్రియులు ధర్మ యుద్ధాన్ని ఉదాత్తమైన కర్తవ్యంగా భావించే వారు. పురాణ యుగంలో ధర్మ సంస్థాపన, దుష్టశిక్షణ, శిష్ట రక్షణ చేయుట కొఱకై సజాతీయుల మధ్య, విజాతీయుల మధ్య యుద్ధం అనివార్యమైంది. భారతీయ సంస్కృతికి ప్రతిబింబాలైన రామాయణ మహాభారత గ్రంథాలలో యుద్ధ వర్ణనలు విపులంగా ఉన్నాయి. భారత యుద్ధంలో కంటే రామాయణంలో భిన్న జాతులకు చెందిన యోధుల మధ్య జరిగిన యుద్ధములే ఎక్కువగా వర్ణింపబడినవి. ఇరువది నాలుగు వేల శ్లోకములున్న వాల్మీకి రామాయణములో 131 సర్గలు గలది, సుమారు 5725 శ్లోకములు గలది యగు "యుద్ధకాండ" ప్రత్యేకంగా చెప్పబడినది. అయోధ్యకాండములో దప్ప ఇతర కాండములందును సందర్భానుసారముగా యుద్ధ వర్ణనలు గలవు.

రామాయణంలో నాలుగు రకముల యుద్ధములు వర్ణింపబడినవి. అవి :

(i) మానవులకు – రాక్షసులకు మధ్య జరిగినవి. ఉదా:– రామలక్ష్మణులు రాక్షస యోధులైన రావణుడు, ఇంద్రజిత్తు, ఖరదూషణాదులు మొదలగువారితో చేసినట్టివి.

(ii) వానరులకు – రాక్షసులకు మధ్య జరిగినవి. ఉదా:– సుగ్రీవుడు, హనుమంతుడు, నీలుడు మొదలగు వారు రాక్షస వీరులైన దూమ్రాక్షుడు, ప్రహస్తుడు, మొదలగు వారితో చేసినట్టివి.

(iii) వానరులకు – వానరులకు మధ్య జరిగినవి. ఉదా:– వాలి, సుగ్రీవుల యుద్ధము.

(iv) అసాధారణ శరీరధారులతో జరిగిన యుద్ధము. ఇది ప్రత్యేకమైనది. ఉదా:– జటాయువు, కుంభకర్ణుడు, విరాధుడు, కబంధుడు మొదలగు వారితో జరిగినట్టివి.

---

1. భగవద్గీత – 18–43

రామాయణ మహాసంగ్రామమున ప్రధానముగా పోరాటము సాగించిన యోధులు వానరులు, రాక్షసులు. వారుపయోగించిన ఆయుధములును భిన్నములైనవి. ఆయుధములను బట్టి వారి యుద్ధ పద్ధతులును భిన్నములైనవి.

### 5.1.1. వానరుల యుద్ధ పద్ధతి :

వానర వీరులందఱును కొండ శిఖరములు, రాళ్లు, చెట్లు నఖములు దంతములు ఆయుధములుగా జేసికొని పోరాటము చేసిన వారే. సుగ్రీవుడు అంగదుడు, హనుమంతుడు మొదలగు వారు మాత్రం ఆయుధ ధారుల నెదిరించి వారి వారి ఆయుధములతోనే పోరాటం చేయడం కనమడుతుంది. వానరులందఱు మల్లయుద్ధమునందు, ముష్టి యుద్ధమునందు ప్రవీణులైన వారు.

### 5.1.2. రాక్షసుల యుద్ధ పద్ధతి :

రాక్షసుల యందును కొందఱు వానరులకు వలెనే చెట్టు, కొండరాళ్లు ఆయుధములుగా చేసుకొని పోరాటము చేసినారు. రాక్షస వీరులలో శ్రేష్టులైన వారందఱు ధనుర్విద్యా నిపుణులే. మిగిలిన రాక్షస వీరులందఱు వివిధ ఆయుధములను ప్రయోగించుట యందు నేర్పు గలవారు. రాక్షస వీరులుపయోగించిన ఆయుధములను భాస్కర రామాయణ కర్త ఈ విధంగా వర్ణించినాడు.

మ॥ పరిఘప్రాస కఠోరకోణ పరశు భ్రాజిష్ణు శూలాస్త్రము
ద్గర చక్ర క్రకచోగ్ర శక్తి ముసలోద్యద్భిండి వాలాసి తో
మర భల్లాతత ఖేట పట్టిసక చర్మ ప్రోద్యమత్కార్ముక
క్షురి కాద్యాయుధ హస్తులై దితిజు లస్తోక ప్రభావంబునన్[1]

రామలక్ష్మణులు క్షత్రియ కుమారులుగా సమస్త శస్త్రాస్త్ర విద్యలందును నిపుణులే. వారు ధనుర్ధారులుగా ప్రసిద్ధిని పొందినారు.

స్థూలంగా యుద్ధ పద్ధతులను రెండు రకములుగా విభజింపవచ్చును. అవి 1. ద్వంద్వ యుద్ధము, 2. సంకుల సమరము.

---

1. భాస్కర.రా.యు. 1446 పద్యం

### 5.2. ద్వంద్వ యుద్ధము :

సాయుధముగనైనను లేక తద్భిన్నముగనైనను ఇద్దఱు వ్యక్తులు ఒకరితో నొకరు చేయు యుద్ధమును ద్వంద్వ యుద్ధమందురు. దీనికే "అంక" యుద్ధమనియు పేరు గలదు. తెలుగు సాహిత్యంలోనిది "ఎక్కటి కయ్యము" గా పేర్కొన బడినది.

వేద వాఙ్మయ శాఖలైన బ్రాహ్మణముల కాలమందు, తత్పూర్వమందు జరిగిన యుద్ధములన్నియు ద్వంద్వ యుద్ధములేయని ఆధునికుల భావన[1]. పరునితో యుద్ధము చేయువానిపై మరొకడు దండెత్తి వానిని చంపరాదని దర్మ శాస్త్రములు శాసించుట వలన అప్పుడు ద్వంద్వ యుద్ధములే ధర్మబద్ధముగా జరిగినవి. రామాయణము నందు అనేక ద్వంద్వ యుద్ధములకు సంబంధించిన వర్ణనములు గలవు. వానరులు రాళ్లు, చెట్లు మొదలగు వానితో తలపడగా రాక్షస వీరులు వివిధ యుధములతో ద్వంద్వ యుద్ధము చేసినారు. ఆయుధ రహితముగా జరిగిన మల్లయుద్ధ, ముష్టియుద్ధ వర్ణనములును గలవు.

కళ్యాణ చాళుక్య ప్రభువగు సర్వజ్ఞ సోమేశ్వరుడు రచించిన "మానసోల్లాసము" నందు ద్వంద్వ యుద్ధముల స్వరూపము విపులముగా వర్ణింప బడినది. ఒకడు సమానుడైన వేరొకనితో తుల్యమైన ఆయుధమును బట్టికొని రంగ స్థలమున జేసెడి యుద్ధము "అంక యుద్ధ" మని యాతడు నిర్వచించినాడు. ఈ అంక యుద్ధము జరుగు కారణములను బట్టి ఎనిమిది విధములుగా చెప్పుట జరిగినది. వానికి సంబంధించిన వివరములు "సంగ్రహాంధ్ర విజ్ఞన కోశము" న ఇట్లు తెల్పబడినది.

(i) **పరిభూతాంకము** : కొట్టుట, తిట్టుట, ఉమియుట వంటి అవమానములను తొలగించుకొనుటకై చేయు యుద్ధము.

(ii) **భూమ్యాంకము** : భూమిని గుఱించి జరుగునది. సరిహద్దు తగాదాల వలన ఏర్పడునట్టిది.

(iii) **మత్సరాంకము** : అసూయవలన కలుగునట్టిది.

(iv) **బిరుదంకము** : బిరుదాదులతో గౌరవింపబడుటను చూచి సహింపక జేయునది.

---

1. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం V భాగం, పేజి - 31

(v) విద్యాంకము : యుద్ధ వృత్తిచే జీవించు వారు శస్త్ర విద్యాగర్వితులైన చేయునట్టిది.

(vi) వైరాంకము : పిత్రాదుల మరణము వలన గల్గిన విరోధమును తలచుకొని చేయునట్టిది.

(vii) ద్రోహాంకము : అపరాధులను నిగ్రహించుటకు రాజు చేయించు నట్టిది.

(viii) ప్రాయశ్చిత్తాంకము : తాను చేసిన పాపపరిహారమునకై రాజు అనుమతిని పొంది చేయునట్టిది[1].

ఈ అంక యుద్ధములలో యోధులు కత్తులు, గదలు, బల్లెములు మొదలగు ఆయుధముల నుపయోగించెడివారు.

రామాయణమునందు యుద్ధ ప్రారంభ దినమున జరిగిన ద్వంద్వ యుద్ధమును వాల్మీకి ఈ విధంగా వర్ణించినాడు.

ఏతస్మిన్నంతరే తేషా మన్యోన్య మభిధావతామ్
రక్షసాం వానరాణాంచ ద్వంద్వ యుద్ధ మవర్తత[2].

ఇట్లు వానరులు, రాక్షసులు ఇరువురును ఒండొరులను తలపడు సమయమున వారి మధ్య ద్వంద్వ యుద్ధము జరిగినదని శ్లోక భావము.

రామాభ్యుదయ కర్త వానర రాక్షస వీరుల మధ్య జరిగిన ద్వంద్వ యుద్ధము నిట్లు వర్ణించినడు.

సీ॥ అంగదు డింద్రజితుం గోరికొనియె, సం
పాతి ప్రభాజను బంచికొనియె
మరుదాత్మజుడు జంబుమాలి బంచికొనె, గ
జుండు ప్రతాపుని జూచి కొనియె
మైందుండు వజ్రముష్టిం దిగిచి కొనియె
కుముదుడకంపను గుదురు కొనియె

1. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం Vవ భాగం - పేజీ-32, 2. మూ.రా.యు. 43-5

కేసరి ధూమ్రాక్షు గెలుబాడు కొనె, వాన
రేశ్వరుండు ప్రహస్తునేతి కొనియె
ద్వివిదు దశనిప్రభు వగదెచ్చుకొనె, సు
షేణుడు మహోదరుని విభజించు కొనియె
పనసుడు నరాంతకుని గుటి పఱచుకొనియె
జాంబవంతుడు మకరాక్షు జరుము కొనియె[1]
రశ్మికేతుని దాకె శ్రీ రాఘవుండు
లక్ష్మణుండు విరూపాక్షు నలచె నవ్వి
భీషణుండును మిత్రఘ్ను బిలిచెననికి[2]

మహావీరుడగు వాడు ఒకే పర్యాయము అనేకమందితో యుద్ధము చేయుటయు ద్వంద్వ యుద్ధమే కాగలదు. శ్రీరాముడు ఒక్కమారుగా యజ్ఞకోపుని, సుప్తఘ్నుని, అగ్నికేతుని, రశ్మికేతుని ఎదిరించినాడు.

ఇతర వానర వీరులు, రాక్షస వీరులు ద్వంద్వ యుద్ధము ననేకవిధములుగా చేయుటను వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

"వానరాశ్చాపరే భీమా రాక్షసై రపరైః సహ
ద్వంద్వం సమీయుద్బహుధా యుద్ధాయ బహుభిస్సహ"[3]

భయంకరులగు ఇతర వానరులు, ఇతర రాక్షసులనేకులతో బహువిధములుగా ద్వంద్వ యుద్ధము చేసిరి. వానరులు రాక్షస వీరులకంటె పరాక్రమవంతులగుటవలన ఒకొక్కడు అనేకమంది రాక్షసులతో ద్వంద్వ యుద్ధము చేసినారు. రామాయణమున వర్ణింపబడిన ద్వంద్వ యుద్ధములలో నిదియే పెద్దదిగా చెప్పదగినది. ఈ ద్వంద్వ యుద్ధమున యోధులుపయోగించిన ఆ యుధములు సమానమైనవి కావు.

### 5.2.1. సంకుల సమరము :

అనేకుల అనేకులతో చేయునట్టి యుద్ధము సంకుల సమరముగా చెప్పబడును. ఇందు యోధులు విచక్షణారహితంగా చంపుకోవడం జరగుతుంది.

1. రామాభ్యుదయం - 7-288, 2. I bid - 7-288, 3. మూ.రా.యు. 43-15.

అనేకలతో ప్రారంభం చేసిన ద్వంద్వ యుద్ధం సంకుల సమరముగా మారుతుంటుంది. రామాయణంలో అసంఖ్యాకమైన వానర, రాక్షస వీరుల మధ్య జరిగిన సంకుల సమరం అనేకచోట్ల వర్ణింపబడింది.

యుద్ధ ప్రారంభ దినమున ప్రారంభమైన ద్వంద్వ యుద్ధము తరువాత సంకుల సమరముగా మారినది. దానిని వాల్మీకి ఈ విధముగా వర్ణించినాడు.

"తత్రాసీత్ సుమహద్యుద్ధం తుములం రోమహర్షణమ్
రక్షసాం వానరాణాంచవీరాణాం జయమిచ్ఛతామ్[1]

అప్పుడు ఒండొరులను జయింప గోరుచున్న రాక్షసులకు, వానరులకు నడుమ గగుర్పాటు గలిగించు సంకుల సమరము జరిగినదని పై శ్లోకము యొక్క భావము.

ఈ శ్లోకమునకు పూర్వము గల రెండు శ్లోకములలో వాల్మీకి ద్వంద్వ యుద్ధమును వర్ణించియున్నారు. ఇచట ద్వంద్వ యుద్ధము సంకుల సమరముగా మారినది.

వానరులు చేసిన భయంకరమగు సంకుల సమరాన్ని భాస్కర రామాయణ కర్త ఈ విధంగా వర్ణించాడు.

సీ॥ నిష్ఠుర కరవాల నిశితంబులైన యున్న
ఘోర సఘంబులఁ జీరి జీరి
పిడుగుల కంటెను బెడిదంబులై యున్న
పిడికిళ్ల నందంద పొడిచి పొడిచి
భిదుర ధారల భంగిభీమంబులై యున్న
కఠిన దంతంబుల గఱచి కఱచి
చబులంబులైన సంపెటల తాకులబోలి
వఱలు తలంబులఁ జఱిచి చఱిచి
మొనసి వాలంబు లార్చుచు మోది మోది
దర్పు మొదవంగఁ బదములఁ దన్నితన్ని
తరులు గిరులును బైపయి గురిసి కురిసి
కపులు పొలయించిరప్పుడు గడగి రిపుల[2]

1 మూ రా యు 43-16, 2.భాస్క రా.యు 1183 పద్యం

వాల్మీకము సంకుల సమరమును "తుముల యుద్ధం" గా పేర్కొనినది. ధూమ్రాక్షుడు రాక్షస సేనతో వానర వీరుల నెదిరించు సందర్భమున సంకుల సమరము జరిగినది. దానిని వాల్మీకమిట్లు వర్ణించినది.

"తేషాం సుతుములం యుద్ధం సంజజ్ఞే హరి రక్షసామ్

అన్యోన్యం పాదపైర్ఘోరం నిఘ్నతాం శూల ముద్గరైః[1]

అంతట చెట్లతో వానరులు, శూలములు, ముద్గరములతో రాక్షసులు దొమ్మి యుద్ధము చేసినారని భావము.

అట్లే అకంపనుడు యుద్ధమునకు వచ్చిన సందర్భమున జరిగిన యుద్ధమును వాల్మీకమిట్లు దెల్పినది.

"శబ్దశ్చ సుమహాం స్తేషాం నర్దతా మభిధావతామ్

శ్రూయతే తుములే యుద్ధే నరూపాణి చకాశిరే"2

ఆ దొమ్మి యుద్ధమున సింహనాదములు చేయువారు, ఒకరిపై నొకరు తలపడు వారునగు వానర రాక్షసుల మహాధ్వని వినిపించెనేగాని రూపములు ప్రకాశింప లేదని భావము.

సంకుల సమరంలో యథేచ్ఛగా యుద్ధం చేసే యోధులపై నాయకులకు అదుపు ఉండేదిగాదు. యుద్ధ విజయం వీరుల వ్యక్తిగత జయాపజయాల మీద ఆధారపడియుండేది. సామాన్య యోధులకు యుద్ధంలో ప్రాముఖ్యం ఉండేది కాదు. నాయకుడు మరణించినా, పారిపోయినా సామాన్య యోధులు తాము పారిపోవడం గాని, రాజును ఆశ్రయించడం గానీ చేసే వారు. ఇందుకు రామాయణంలో అనేక ఉదాహరణలు గలవు.

**5.3. ద్వంద్వ యుద్ధము - రకములు :**

ద్వంద్వ యుద్ధములు రెండు విధములుగా చెప్పదగును. అవి (1) ఆయుధ యుక్తములు, (2) ఆయుధ రహితములు.

ఆయుధ యుక్తములైన వానిలో (1) ధనుర్యుద్ధము, (2) ఖడ్గ యుద్ధము, (3) గదా యుద్ధము ముఖ్యములైనవి.

---

1 మూ.రా.యు. 52-2, 2. Ibid - 55-21

ఆయుధ రహితములైన వానిలో (1) మల్ల యుద్ధము, (2) ముష్టి యుద్ధము పేర్కొనదగినవి.

### 5.3.1. ధనుర్యుద్ధం :

ప్రాచీన కాలపు ఆయుధములలో "ధనుస్సు" ప్రధానమైనది. యజుర్వేదము నకుపవేదమైన "ధనుర్వేదము" ధనుర్యుద్ధమును గూర్చి తెల్పు శాస్త్రము. ధనుస్సుతో సమస్త ఆయుధ ధారులను ఎదిరింపవచ్చును గావున "ధనుస్సు" పదము అన్ని ఆయుధములకు వర్తించునని ధనుర్వేదము దెల్పుచున్నది.

ఒక నిడుపైన బద్దకొనకు ఒకత్రాడు కట్టబడియుండును. ఆ త్రాడు ఆ బద్దయొక్క రెండవ చివరను కలుపునదిగా నుండును. ఆ రెంటి సమ్మేళనమే "ధనుస్సు" ఆకారమును బట్టి నేమికము, అరనేమి, ఋజుకము, తృణకము, మత్స్యోదరము అని ఐద విధములగు ధనుస్సులు గలవు. నిర్మాణ వైవిధ్యమును బట్టి శార్ఞము కీచకము, కోదండము, చాపము అను నాలుగు విధములగు ధనుర్భేదములు గలవు.

ఇట్టి ధనుస్సు సహాయమున చేయు యుద్ధము ధనుర్యుద్ధముగా చెప్పబడును. ధనుర్యుద్ధము గూడ స్థూలముగా రెండు భాగములుగా చెప్పవచ్చును అవి 1. వివిధాకారములు గల బాణములతో చేయు బాణ యుద్ధము, 2. మంత్ర పూతమగు అస్త్రములతో చేయునట్టి అస్త్ర యుద్ధము.

రామాయణమునందు క్షత్రియ కుమారులైన రామలక్ష్మణులు, క్షత్రియ ధర్మాన్ని అనుసరించిన రావణుడు, రావణ పుత్రులు, రాక్షస నాయకులైన ప్రహస్తుడు, ధూమ్రాక్షుడు, కుంభుడు, విరూపాక్షుడు, మకరాక్షుడు, మాల్యవంతుడు, మహాకాయుడు, అతని మంత్రులైన రుధిరాశనుడు, వజ్రనాభుడు, కాలకల్పుడు, వపాశుడు, దుర్ధరుడు మొదలగు వారందఱు ధనుర్ధారులై యుద్ధమున పాల్గొన్న వారే. వానర యూధవులు ధనుర్ధారులు కాకపోయినా బాణముల నెదిరించి నిలబడగల నేర్పు, ధనుర్ధారిని పడగొట్టగల ఒడుపు వారికి ఉన్నాయి.

### 5.3.2. రాముని ధనుర్విద్యా నైపుణ్యం :

ఆ కాలపు ధనుర్ధారులలో రాముడు శ్రేష్ఠుడుగా చెప్పదగినవాడు. ఆ విషయాన్ని

1. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం Vవ భాగం - పేజి-41

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు “నా రాముడు’ అనే గ్రంథ పీఠికలో ఈ విధంగా అంటారు.

“లోకమున ధానుష్కులనేకులున్నారు. కానీ నామమునకు ముందు “కోదండ” శబ్దమును చేర్చి స్మరించెడి ఆచారము ఒక్క రాముని విషయముననే కానవచ్చినది. అంతేగాక అర్జునుడెంత ధనుర్ధారియైనను కోదండార్జునుడు కాలేదు”[1]. అంతేగాక రాముడు తన ధనుస్సుతో ఇది చేయగలడు, ఇది చేయలేడు అని చెప్పలేము. పరశురాముని శిక్షించు సందర్భమున రాముడు తన బాణముతో ఆతడు తపస్సుచే సాధించిన లోకమును కొట్టినాడు అని అంటారు.

రాముని చేతిలోని ధనుస్సు చిత్రవిచిత్ర గతులను పొందగలదు.

మొల్లరామరావణ యుద్ధాన్ని వర్ణించే సందర్భంలో రాముని ధనుస్సును ఈ విధంగా వర్ణించింది.

ఆ॥వె॥ శరము దొడిగి తెలియ చక్రంబు వలెనుండు
శరము విడుచునపుడు చాపమగును
చూడనొప్పె దౌర శోభితంబగు రాము
చేత విల్లుసెప్ప చిత్రమగును”[2]

రాముని ధనుర్విద్యా నైపుణ్యము ప్రత్యర్థిగా నున్న రావణుని చేత గూడ మెప్పులను పొందినట్టిది. రాముడు రావణుని ఛత్ర చామరములను పడగొట్టిన విధమును రంగనాథ రామాయణ కర్త ఈ విధంగా వర్ణించినాడు.

“వెనుకొని లక్ష్మణ విల్లుదెమ్మనుచు – దనదు బిమ్మటనున్న తమ్ముని చేతి
ధనువుడాచేత నెంతయు వేడ్కనంది। దక్షిణాంఘ్రి యంగుష్ఠాన వింటి
కొన నంబు బూని గ్రక్కున నెక్కుపెట్టి। కనదర్ధచంద్ర మార్గణ మరివోసి
ధీ లక్షితోల్లాసి తెగనిండ దీసి। యాలీల నొఱగిన యట్లనే యుండి
యల చామర వ్యజనాత పత్రౌఘు । ములమీద వేసి నద్భుత వృత్తి మెఱయ
శర మొక్కటియు పది శరములై నూఱు । శరములై పదివేల శరములై మఱియు
లక్షయై కోటియై లక్షించి చూడ। నా క్షణంబున సంఖ్యలన్నియు గడచి

1. నా రాముడు – పేజి–38, 2. మొల్ల రామాయణం. యు. 3–90

తాలవృంతంబులు దాల్చుచేడియల। మేలు చామరములు మెఱయించు సతుల
సంగీతములు సేయు సరసిజముఖుల। బొంగుచు కైవారములు సేయుబోంట్ల
ధవళాత్త పత్రముల్ ధరియించు దైత్య। నివహంబులను గొల్చి నిల్చిన భటుల
కరములు ద్రుంచక గళములు ద్రెంచ। కురములు నాటక యురుకిరీటములు
ధర డొల్లజేయక తలలు ఖండింప । కరుదరు దిదియని యమరు లుప్పొంగ
నాలవట్టంబులు నాత పత్రములు । చాల శోభిల్లు వింజామరంబులును
కత్రించి కొనిపోయె కంఠమాత్రములు । చిత్రమై తనరిన సితచామరములు
నాల వట్టములు సితాత పత్రములు । దేలుచు ఝల్లని దివినిండ నెగసి
కొలువులో కొన్ని దిక్కుల యందు గొన్ని । కొలువులోపలి దైత్య కోటిపై గొన్ని
లంకలో కొన్ని యాలవణాబ్ధి । గొన్ని । లంకేశుపై గొన్ని లఘులీలబడియె
నలవుమైనటుచేసి యాదివ్య శరము । పొలయిక రఘురాము పొదిజొచ్చెనంత"[1]

రాముడు రావణుని చామర వ్యజనాత పత్రములపై ఒక అర్ధచంద్ర బాణమును ప్రయోగించినాడు. ఆ బాణము లెక్కపెట్టలేనన్ని బాణములుగా మారినది. ఆ బాణములు తాలవృంతములు పట్టుకొనిన, సంగీతము పాడుచున్న చామరములు వీచుచున్న స్త్రీల యొక్కగాని, ఇతర భటుల యొక్కగాని చేతులను ఖండింపకుండా, కంఠములను ద్రుంచకుండా, రావణుని కిరీటములను కూల్చకుండా, తలలను ఖండింప కుండా కేవలము ఆలవట్టములు (గుడ్డతో గుండ్రముగా చేయబడిన విసనకఱ్ఱలు) ఆతపత్రములు (గొడుగులు), వింజామరలను మాత్రమే కత్తిరించుకొని పోయినవి. ఆ కత్తిరించిన వానిని కొన్నింటిని రావణుని కొలువులోను, కొన్నిటిని దిక్కులయందు, కొన్నిటిని రాక్షసుల మీద, కొన్నిటిని లంకలోను, కొన్నిటిని సముద్రముపైన, కొన్ని రావణునిపైన పడునట్లుగా ఆ బాణము తన మహిమజూపి మరల రాముని వద్దకు వచ్చి ఆయన తూణీరమును చేరినది. ఇది రాముని ధనుర్విద్యా నైపుణ్యమునకు నిదర్శనమైనట్టిది.

అది చూచిన రావణుడు రాముని మెచ్చుకోవడాన్ని రంగనాథ రామాయణ కర్త ఈ విధంగా వర్ణిస్తాడు.

---

1. రంగ. రా. యు. 306 పేజి

"బాపురే ! రామభూపాల లోకముల। నీ పాటి విలుకాడు నేర్చునే కలుగ
బాటించి పురములపై బద్ద హరుని। యేటొప్పునిందు నీయేటొప్పుగాక
యని పదినోళ్ల నందంద బొగడ"[1]

త్రిపురములపై బాణ ప్రయోగము చేసిన శివుని ఏటు (వ్రేటు)తో నీ ఏటు సమాన మైనదని తన పదినోళ్లతో రావణుడు రాముని ప్రశంసించినాడు. అంతేగాక రాముని "కోదండ దీక్షాగురుని"గా అంగీకరించినాడు.

వానరులు రాత్రి యుద్ధము చేయు సమయమున కోపించిన రాముడు తన బాణములతో లంకా నగర ద్వారమును గూల్చుట, విమానములపై బాణములను వేయుట, కైలాస శిఖరము వంటి లంక గోపురమును ఐదు బాణములతో పడగొట్టుట మొదలగున వన్నియు రాముని ధనుర్విద్యా నైపుణ్యమునకు నిదర్శనములైనట్టివే.

రామాయణ కాలంలో ఎక్కువగా మూడు వంపులు గలిగిన ధనుస్సే యుద్ధములందుపయోగపడినది. దానిని వాల్మీకి "త్రిణత" మనినాడు[2]. రాముడు, ఇంద్రజిత్తు, అతికాయుడు మొదలగు ధానుష్కులందఱు ఇట్టి ధనుస్సునే ఉపయోగించారు.

యోధులు బాణములపై తమ పేర్లను చెక్కించుకొనుటయు ఆ కాలమున గలదు. మహోదరుడు రావణునకు కుటిలోపాయాన్ని తెల్పు సందర్భమున ఈ విషయాన్ని రంగనాథ రామాయణ కర్త ఈ విధముగా తెల్పినాడు.

"…. రామనామాంకిత బాణ, చటలోగ్ర పాతంబు సైరింప లేక"[3]

"రాముని పేరు గల బాణముల తీవ్రతను సహింపలేక" అని దాని అర్థము.

**5.3.3. బాణ యుద్ధము :**

ధనుస్సు సహాయమున ఆలీఢాది పద్ధతులలో నిలిచి నాళీక, అర్ధచంద్ర, కర్ణి, క్షురికాది బాణములను ప్రయోగించుట బాణయుద్ధముగా చెప్పబడును.

ధనుర్విద్యా విశారదుడు యుద్ధమునందు నిలిచి పాదములుంచు తీరు "స్థానము" గా చెప్పబడును. పాద విన్యాస భేదములను బట్టి ఇవి ఐదు లేక ఆఱు విధములుగ చెప్పబడినవి.

---

1. I bid – 2. మూ.రా.యు. 45-25, 71-18, 3 రంగ రా.యు. 351 పేజి

భరతుడు ఈ స్థానములను (1) వైష్ణవము, (2) సమపాదము, (3) వైశాఖము, (4) మండలము, (5) ప్రత్యాలీఢము, (6) ఆలీఢము అను ఆఱు విధములుగా చెప్పినాడు.*

ధనుర్వేదము వీనిని ఐదు విధములుగానే పరిగణించినది.

"స్థానాని ధన్వినాం పంచ। తత్ర వైశాఖమస్త్రియామ్
వితస్త్యస్తరగౌ పాదౌ। మండలం తోరణాకృతీ
అన్వర్థస్యాత్సమం పాదం । ఆలీఢం తతాగ్రతః
దక్షిణే వామమాకుంచ । ప్రత్యాలీఢం విపర్యయే[1]

ఇందువైష్ణవము తప్ప మిగిలిన ఐదును పైన తెల్పినవే.
ధనుర్విద్యావిలాసము వీని లక్షణములను ఈవిధముగా తెల్పినది.

సీ॥ ఎడమపాదము లక్ష్యమెదురుగా మున్నిడ
నవని ప్రత్యాలీఢమై దనర్చు
గురికి జక్కనగాగ కుడికాలు మున్నిడ
నాలీఢ మారూఢమై దనర్చు
పుడమి మూరకొలందియెడముగా నంఘ్రిద్వ
యము నిల్ప వైశాఖమై దనర్చు
నడుమ నంగుళ యుగ్మ మెడముగా నిలిచిన
నది సమస్థానకంబై దనర్చు
నలసమస్థానమున నుండి యడ్డముగను
దోరణాకృత నడుగుల దోయి ద్రిప్పి
యుభయ పార్ష్ణి ముఖంబుల నొరయ నిలుప
మహిందనరుఁ దోరణాకృతి మండలంబు[2]

---

★ వైష్ణవం, సమపాదంచ వైశాఖం మండలం తథా।
ప్రత్యాలీఢ మథాలీఢం స్థానాన్యేతాని షణ్ముణామ్॥

1. ధనుర్విద్యా విలాసం - పేజి-80
2. ధనుర్విద్యా విలాసం - పేజి-76

**(i) ప్రత్యాలీఢము :** లక్ష్యమునకు ఎదురుగా ఎడమకాలును ముందునకు చాపి కుడికాలును వెనుకకు నెట్టి నిలుచుట. ఎక్కువగా ధానుష్కులీ పద్ధతినే యనుసరింతురు.

**(ii) ఆలీఢము :** లక్ష్యమునకు ఎదురుగా కుడికాలును ముందునకు చాపియుంచి ఎడమకాలును వెనుకకు నెట్టి నిలుచుట.

**(iii) వైశాఖము :** రెండు పాదముల మధ్య మూరెడు దూరముండునట్లు నిలుచుట. రెండు పాదతలముల మధ్య కొంచెము జాగ విడిచి ముంగాళ్లపై నిల్చుండుటయని సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము దెల్పుచున్నది[1]. దానినే ధనుర్విద్యా విలాసము మరల ఇట్లు తెల్పినది.

తే॥గీ॥ రెండు పదముల నడుమ మూరెడు వెడల్పు
విడిచి నిలుచుండవలె దన యెడమకాల
నమరు చిటికెన వ్రేల లక్ష్యమున కెదుర
దనరు వైశాఖ నామక స్థానమునను2

**(iv) సమస్థానము :** ఇదే సమపాద మనియు చెప్పబడును. రెండు కాళ్లను దగ్గఱగా బెట్టి నిలుచుట. దీనినే ధనుర్విద్యా విలాసమిట్లు దెల్పినది.

తే॥గీ॥ అంగుళద్వయ మెడముండునట్లుగాగ
సొరుగా పాద యుగళంబు సరసనూది
యూర్ధ్వ లక్ష్యంబుపై చూడ్కులొలయ నిలుచు
తానకంబగు ధర సమస్థానకంబు
రెండు పాదముల మధ్య రెండంగుళముల ఎడముండవలెను.

**(v) మండల స్థానము :** రెండు పాదముల మధ్య కొంచెమెక్కువ ఎడము విడిచి, కొంతవంగి నిలుచుట. ధనుర్విద్యావిలాసము దీనిని మరల విపులీకరించినది.

తే॥గీ॥ పదము లిరుగడలును ద్రిప్పి పార్శ్వములను
మండలాకృతి జాను యుగ్మంబు వంచి
దగ నధో లక్ష్యమునన జూడ్కి దవుల నిలుచు
తానకంబగు మండల స్థానకంబు[3]

---

1 సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము – III భాగం, పేజీ 598, 2. ధనుర్విద్యా విలాసం – పేజీ-79,
3. ధనుర్విద్యావిలాసం, పేజీ-79

వైష్ణవ స్థానమునకును ధనుర్విద్యా విలాసము లక్షణమును దెల్పినది.

(vi) తే॥గీ॥ కుడియడుంగూని డాపలి గుల్భమందు
సవ్యపద పార్ష్ణి గీలించి సగము ధరణి
పార్శ్వముఖముగా సూచుచు ఖ్యాతి నిలుచు
తానకంబగు వైష్ణవ స్థానకంబు[1]

యోధులు ప్రత్యాలీఢ పాదముతో నిలిచి యుద్ధము చేయుటను గూర్చి రామాయణమున అనేక ఉదాహరణలు గలవు. మచ్చునకు కొన్ని...

(i) ఇంద్రజిల్లక్ష్మణుల యుద్ధమును వర్ణించుచు లక్ష్మణుడు ఇంద్రజిత్తుశిరమును ద్రుంచు సందర్భమున మొల్ల ఇట్లు వర్ణించినది. లక్ష్మణుడు "భుజ గాస్త్రం వింట సంధించి వానిపై లక్ష్యంబు చేసి ప్రత్యాలీఢ పాదస్థుండై నిలిచి కర్ణాంతంబుగా దిగిచి"[2] బాణమును ప్రయోగించినాడు.

(ii) రాముడు రావణునిపై బ్రహ్మాస్త్రము ప్రయోగించునపుడును రాముడు ప్రత్యాలీఢ పాదుండై నిల్చుటను మొల్ల ఇట్లు వర్ణించినది.

మ॥ అనఘుం డుజ్జ్వల చాపదండమున బ్రహ్మాస్త్రంబు సంధించి, యొ
య్యనఁ గర్ణాంతంబుగా గడున్ దివిచి ప్రత్యాలీఢ పాదస్థుడై
దనుజాధీశ్వరు బాహుమధ్యమువడిన్ దాకంగ లక్ష్యంబుగా
గొని, బిట్టేసె నదిల్చి తీవ్రతరమౌ కోపంబు దీపింపగన్[3]

శ్రేష్ఠతరమైన అస్త్రములను ప్రయోగించునపుడు ధానుష్కుడు ప్రత్యాలీఢ పాదస్థుడగుట ధనుర్విద్యా మర్యాద కావచ్చును.

ధనుర్యుద్ధమున బాణములను ప్రయోగించు దశలను గూడ వాల్మీకము తెలియజేసినది.

లక్ష్మణేంద్రజిత్తుల ద్వంద్వ యుద్ధమున వారి హస్తలాఘవమును వర్ణించుచు బాణ ప్రయోగ దశలను వాల్మీకి ఈ విధంగా వర్ణించినాడు.

"సహ్యాదానం న సంధానం ధనుషోవా పరిగ్రహః
నవిప్రమోక్షో బాణానాం నవికర్షో నవిగ్రహః

1. I bid – పేజి-80 2. మొల్ల. రా.యు. 1-117, 3. మొల్ల. రా.యు. 3-105

నముష్టి ప్రతిసంధానం నలక్ష్య ప్రతిపాదనం
అదృశ్యత తయోస్తత్ర యుధ్యతోః పాణిలాఘవాత్ ।

ఈ శ్లోకములందు చెప్పబడిన దశలను గోవిందరాజీయ వ్యాఖ్య విపులముగా దెల్పినది[2].

అవి :

(i) **ఆదానం :** (బాణస్య తూణా దుద్ధరణమ్) తూణీరము నుండి బాణమును తీయుట.

(ii) **సంధానం :** (ఉద్ధృతస్య బాణస్య ధనుష్యవస్థాపనం) తూణీరము నుండి తీసిన బాణమును ధనుస్సు నందుంచుట.

(iii) **ధనుషోవా పరిగ్రహః :** (సవ్యాపసవ్యేన కార్ముక గ్రహణం) సవ్యాపసవ్య మార్గములలో ధనుస్సును పట్టుకొనుట.

(iv) **విప్రమోక్ష ః :** (విసర్జనం) బాణమును విడుచుట అనగా సంధించుట.

(v) **వికర్ష ః :** (ఆకర్ష గ్రహణం) నారిని ఆకర్ణాంతము లాగుట.

(vi) **విగ్రహః :** (ఆలీఢాద్యవస్థాన విశేషః) ఆలీఢాది పద్ధతులలో నిల్చుట.

(vii) **ముష్టి ప్రతి సంధానం :** (జ్యాకార్ముకయోః ముష్టిబంధనం) వింటిని, నారిని పిడికిట పట్టుకొనుట.

(viii) **లక్ష్య ప్రతిపాదనమ్ :** (లక్ష్య ప్రాపణం) (లక్ష్యవేధః) లక్ష్యమును వేయుట.

ఈ దశలన్నింటిని అనుసరించుచున్నప్పటికి అవికనబడనంత వేగముగ ఇంద్రజిల్లక్ష్మణులు యుద్ధము చేసిరి.

రామాయణమున వర్ణింపబడిన బాణ యుద్ధములలో నిరువురు యోధులు పరస్పరము చేసినట్టివి కొన్ని మాత్రమే గలవు. ధనుస్సు ఆయుధములలో శ్రేష్ఠమైనది. కావున ధనుస్సుతో ఇతరాయుధముల నెదుర్కొనుటయు రామాయణమున వర్ణింప బడినది.

బాలకాండలో తాటక రామలక్ష్మణులపై శిలావర్షమును కురిపింపగా రాముడు శిలావర్షమును తన బాణ వర్షముచే నడ్డగించి రాళ్లను ముక్కలు చేసి సమీపమునకు వచ్చుచున్న ఆమె చేతులను బాణములతో నఱకెను.[3]

1. మూ.రా.యు. 90-29,30, 2. గోవింద రాజీయ వ్యాఖ్య - 988,989 పేజీలు, 3. మూ.రా.బాల. 26-7

అరణ్యకాండమున రావణుడు తన నెదిరించిన జటాయువుపై నాళీక బాణములను ప్రయోగించినాడు.[1]

సుందరకాండలో హనుమంతుడు జంబుమాలిపై రాతిబండలను సాల వృక్షములను ప్రయోగింప నాతడు అర్థచంద్ర బాణములను, కర్ణిబాణములను ప్రయోగించినాడు.[2]

అట్లే రావణ పుత్రుడైన అక్షకుమారుడును ధనుర్విద్యా విశారదుడే. ఆతనిని గూర్చి వాల్మీకి "సమాధి, సంయోగ విమోక్ష తత్త్వవిత్"3 అనగా అతడు బాణమును గురిపెట్టుట, సంధించుట, విడుచుట యను లక్షణములను బాగుగా తెలిసినవాడు.

అట్లే రావణుని మంత్రి పుత్రులును ధనుర్యుద్ధము చేసినారు. రక్తరోముడు, శతజిహ్వుడు, రుధిరలోచనుడు, స్తనితహస్తుడు, శూలదంష్ట్రుడు, దుర్ముఖుడు, వ్యాఘ్రకబళుడు యను రాక్షస శ్రేష్ఠులును హనుమంతునిపై బాణ ప్రయోగము చేసినారు.

అక్షుడు ప్రయోగించిన బాణములను హనుమంతుడు తన వాలముఖంబున ద్రుంచుటను మొల్ల మనోహరముగా వర్ణించినది.

ఉ॥ వాయుజుడప్పు డంపగమి వాలముఖంబున ద్రుంచె, ద్రుంచినన్
వాయుజమీద గ్రమ్మఱ నవార్యబలంబున నేసి, నేసినన్
వాయుజుడుగ్రుడై తునిమె వాని శరావళినెల్ల, బిమ్మటన్
వాయుజు నాటనేసె గడు వాడిశరంబుల నక్షుడుద్ధతిన్.[4]

**5.4.0. రామాయణమున వర్ణింపబడిన కొన్ని బాణయుద్ధములు :**

**5.4.1. రాముడు ఖరదూషణాదులతో చేసిన యుద్ధము :**

ఖరుని యనుచరులగు పదునాలుగు వేలమంది రాక్షసులు ఒకేసారి రాముని తమతమ ధనుస్సులతో ఎదిరించిన విధమును భాస్కర రామాయణ కర్త ఈ విధంగా వర్ణించినాడు.

"వెస బదునాల్గు వేలబలువిండ్లను దానవులేయు బాణముల్
ప్రసభరయంబునన్ దునిమి పార్థివు డొక్కడు నేయు బాణముల్

1. మూ.రా.యు.అరణ్య - 51-5, 2. మూ.రా.సుం. 44-7, 3. Ibid 47-14, 4. మొల్ల. రా.సుం. 154

మసలక యెక్కుడై నిగిడి మండుచుఁ బాతి యనేక ఘోర రా
క్షసుల యురంబు లుచ్చి చనికాడు రణాంచలమేదినీ స్థలుల్[1]

ఆ బాణముల తీవ్రత ఎట్టిదో కూడ భాస్కర రామాయణ కర్త మనోహరముగా వర్ణించినాడు.

సీ॥ మదగజేంద్రంబుల నుదురులు గాడితో
కల నుచ్చిపోవును గ్రందుగాగ
రథ సుముద్ధతులగు రధిక సారథు లొక్క
గుది యయి ధారుణి గూలదాకు
సద్భుతాటోపమై యాశ్విక వ్రాతంబు
దునుముఁ దురంగాలి తోన తునియ
పటు సముద్ధతి వీరభటుఁ దాకి యవ్వలి
భటుదాకి పేరుగా బారిగ్రుచ్చు
బిరుదు పడగల గొడుగుల పిండునుగ్గు
నూచముగ దాకు రామధనుర్విముక్త
నిషఠరోత్పాత నిర్ఘాత నిభ నిశాత
చండ సంపాత కాండ క్రాండ సమితి[2]

రాముని బాణములు మదపుటేనుగుల కుంభ స్థలములదాకి తోకల నుచ్చిపోవునట్టివి. చతురంగ బలములను గూల్చినవి. ఆ బాణములు ఆ పదునాల్గు వేలమంది రాక్షసుల "కవచములను ముక్కలు చేయుచు, మర్మ స్థానములను గొట్టుచు, చేతులను చీల్చుచు, కండలను చెక్కుచు, తలలను నఱకుచు, వారి ప్రాణములను హరించినది. రాముడు అమ్ములపొది నుండి బాణమును తీయుటనుగాని, సంధించుటనుగాని, ప్రయోగించు టనుగాని, శత్రువులు గుర్తింప లేకపోయిరి. "ధనుస్సు గుడుసై" కనిపించెడిదట. భాస్కర రామాయణ కర్త ఆ విషయాన్ని ఈ విధంగా వర్ణించినాడు.

మ॥ వడితూణమ్మున నమ్ముగైకొనుట, తీవ్రస్ఫూర్తి సంధించు, టే
ర్పడ లీలన్ దెగ వాపుటేయుట, మదిన్ భావింపగా రాక, వి

1. భాస్క.రా.అరణ్య – 1-203, 2. Ibid 1-205

- -ల్గుడునై యుండుటయుం బ్రచండగతి రక్షోవక్షముల్ వ్రయ్య, న

ప్పుడు వారొక్కట గూలు మ్రోతయు నభోభూ భాగముల్ గప్పగన్[1]

శత్రువు ప్రయోగించిన ఆయుధములను తగిన విధముగా బాణప్రయోగము చేయుటను తెలిసిన వీరుడు రాముడు. కావుననే ఖరుడు పంపిన పదునాల్గు మంది రాక్షసులు ఒకేసారి పదునాలుగు శూలములను ప్రయోగింపగా రాముడు "కత్తివాతి యమ్ములతడు పదునాల్గు నిగిడించి యద్భుతముగ దునిమె పదునాల్గు శూలములను"[2] అని భాస్కర రామాయణము వర్ణించినది.

రాముడు ఒకేసారి అనేకమైన భాణములను ప్రయోగించు నేర్పుగల వాడు ఆ విషయాన్ని తెల్పుతూ రంగనాథ రామాయణ కర్త ఈ విధంగా వర్ణిస్తాడు.

"కరలాఘవము మీఱ గవదొనలోన । శరములన్నియు నొక్కసారె సంధించి

పదియు నూఱును వేయు పదివేలు లక్ష । పదిలక్షలటు కోట్లు పదినూరు కోట్లు

మండిత పరివేష మధ్యందినార్క । మండల పరివేష మహితాను కారి"[3]

### 5.4.2. రామ త్రిశిరుల ధనుర్యుద్ధం :

ఖరుని సేనాపతి యగు త్రిశిరుడును ధనుర్విద్యా విశారదుడే. రాముని వధించెదనని యాతడు ఆయుధమును తాకి ప్రతిజ్ఞచేసి యుద్ధానికి బయలుదేరినాడు అతని యుద్ధమును వాల్మీకి ఈ విధముగా వర్ణించినాడు.

"శరధారా సమూహాం త్స మహామేఘ ఇవోత్సృజన్

వ్యసృజ త్సదృశం నాథం జలార్ద్రస్యతు దుందుభేః"[4]

అతడు దుందుభి మ్రోతవంటి సింహనాదము చేసి, మహామేఘమువలె బాణధారా సమూహమును విడిచినాడు.

రామ త్రిశిరుల మధ్య సింహమునకు మదపుటేనుగకు మధ్య జరిగిన యుద్ధమువలె పోరాటము సాగినది. త్రిశిరుడు రాముని నుదుటిని మూడు బాణములతో కొట్టినాడు. అతని బాణములను రాముడు పుష్పములుగా భావించినాడు. పిమ్మట రాముడు అతని రథాశ్వములను, సారథిని నేలగూల్చి మూడు బాణములతో అతని మూడు శిరస్సులను ఖండించెను.

1. భాస్క.రా.అరణ్య - 1-210, 2. I.bid అరణ్య - 1-166, 3. రంగ.రా.అరణ్య - 141, 4. మూ.రా.అరణ్య 27-8

5.4.3 ఇంద్రజిత్తు వానరులతో చేసిన యుద్ధము :

ఇంద్రజిత్తు మూడవ యుద్ధమున వానరులపై విజృంభించి పోరాడినాడు. ఆతని బాణముల ఏపును భాస్కర రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

పిడుగులొకో కావు పొడతేవు ఘనములు
ల్కాసహస్రంబులో కావు ధరణి
యడలదు కాలసర్పావళులొకొ కావు
పాతాళ వివరంబు బయలుపడదు.
ఖరమైన ముక్కంటి కంటి మంటలొ కావు
జగదవసానంబు జాడలేదు
కాలకూటార్చులో కావు మందర గోత్ర
మానితాంభోరాశి గానబడదు
మొద లెఱుంగరాదు మునుకొని పుట్టిన
చొప్పు తెలియరాదు చూడనెచట
నని కపీంద్రు లిట్టులాజి దల్లడమంది
రింద్రజిత్తు తూపు లేపు సూప[1]

ఆ బాణములు ఉల్కా సహస్రములేని పిడుగుల వంటివి. పాతాళ రంధ్రమును బయట పడనీయని కాలసర్పములు. జగదవసానము గాని సమయమందలి ముక్కంటి మంటలు. మందర పర్వతముతో గూడిన సముద్రములోని కాలకూటపు టగ్నులు. ఆ బాణములు ఎచ్చటనుండి వచ్చుచున్నవో తెలియక వానర శ్రేష్ఠులందఱు తల్లడమందిరి.

ఆ సందర్భముననే ఇంద్రజిత్తు వానరుల శరీరములపై దట్టముగా బాణ ప్రయోగం చేయుటను భాస్కర రామాయణ కర్త ఇట్లు వర్ణించినాడు.

తే॥గీ॥ "ఒలసి మేనులు నువ్వగింజలకునైన
తెఱపి లేకుండ శరములు దీటుగొలిపి
ప్లవగ చక్రమునంతయు బడలుపఱిచి
యేగె లంకకు క్రమ్మఱ నింద్రజిత్తు[2]

1. భాస్క.రా.యు. 1268 2. I bid.... 1271

వానరుల శరీరములపై నువ్వుగింజంత చోటు కూడా మిగల్చకుండా ఇంద్రజిత్తు బాణప్రయోగం చేసినాడు.

**5.4.4 ఇంద్రజిత్తు రామలక్ష్మణులతో చేసిన బాణ యుద్ధము :**

ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశబద్ధులను చేయు సందర్భమున వారిని మర్మ స్థానములందు వివిధములైన బాణములతో కొట్టుటను వాల్మీకి ఇట్లు దెల్పినాడు.

"రుక్మపుంఖైః ప్రసన్నాగ్రైఃఅధోగతిభినాశుగైః
నారాచై రర్ధ నారాచై ర్భల్లై రంజలి కైరపి
వివ్యాధ వత్సదంతైశ్చ సింహదంష్ట్రైః క్షురైస్తథా"[1]

అర్ధనారాచములనగా నడుము విరిగిన వానివలె నుండు బాణములు. భల్లములనగా గండ్రగొడ్డలి వంటి మొనగలవి. అంజలికములనగా అంజలి వంటి మొనగలవి. వత్సదంతములనగా దూడపండ్ల వంటి మొనగలవి. సింహదంష్ట్రములనగా సింహపు కోరలను పోలినవి. క్షురములనగా మంగలికత్తి వంటి మొనగలవి. ఈ విధమైన బంగారు పింజలు గల, మొనదేలిన బాణములను ప్రయోగించినాడు.

**5.4.5 శోణితాక్షుడు ప్రయోగించిన బాణాలు :**

శోణితాక్షుడు అంగదునిపైకి వివిధమైన ఆకృతులు గల బాణములను ప్రయోగించుటను వాల్మీకి ఇట్లు వర్ణించాడు.

క్షుర క్షు రప్రైర్నారాచై ర్వత్సదంతైః శిలీముఖైః
కర్ణిశల్య విపాఠైశ్చ బహుభిశ్చ శితైశ్శరైః[2]

ఇందు క్రొత్తగా చెప్పబడినవి శిలీముఖములు, కర్ణి బాణములు, శల్యములు, శిలీముఖములనగా కంకపత్రాకార ముఖము గలవి. కర్ణిశరములనగా రెండు ప్రక్కలను కర్ణములు గలవి. శల్యములనగా గన్నేరాకుల కొనల వంటి బాణములు.

**5.4.6 రామ రావణుల బాణ యుద్ధం :**

ఇతిహాస యుగం నాటి చరిత్రను పరిశీలిస్తే రామరావణ యుద్ధంతో

---

1. మూ.రా.యు. – 45-23, 2. I bid 76-6

సాటియైన యుద్ధం మరొకటి లేదని చెప్పవచ్చును. అది నిరుపమానమైనదని వాల్మీకి మహర్షియే స్వయంగారామాయణంలో ఈ విధముగా చెప్పినాడు.

"గగనం గగనాకారం సాగరః సాగరోపమః
రామరావణ యోర్యుద్ధం రామరావణ యోరివ"[1]

ఆకాశము ఆకాశముతోనే పోల్చదగినట్లు, సముద్రము సముద్రముతోనే పోల్చదగినట్లు రామరావణ యుద్ధముతో రామరావణ యుద్ధమే పోల్చదగినది యని ఆ శ్లోక భావము. అలంకార శాస్త్రవేత్తలు దీనిని అనన్వయాలంకారమునకు ఉదాహరణగా స్వీకరించి నారు.

రావణుడు మొదటగా ప్రహస్తుడు మరణించిన తర్వాత కోపించిన వాడై స్వయంగా తానే యుద్ధ రంగానికి బయలుదేరినాడు. రథస్థుడైన రావణుని ఎదిరించుట కనువుగా హనుమంతుడు రాముని తన భుజములపై కూర్చుండ బెట్టుకొనినాడు. ఈ యుద్ధమున రామునిదే పైచేయియైనది. ఆ సందర్భమున రాముడు ప్రయోగించిన బాణముల తీవ్రతను వాల్మీకి ఈ విధంగా తెల్పినాడు.

"బ్రహ్మదండ ప్రకాశానాం విద్యుత్సదృశ వర్చసామ్
స్మరన్ రాఘవ బాణానాం వివ్యధే రాక్షసేశ్వరః"[2]

ఆ రావణుడు బ్రహ్మదండము వలె మెరయుచు, మెరుపు తీగలవంటి కాంతిగల్గిన ఆ రాముని బాణములను స్మరించుచు వ్యధ చెందినాడు. అనగా రాముడట్టి బాణములు ప్రయోగించినాడు.

రావణుని రథమును, రథచక్రములను, ధ్వజమును, ఛత్రమును, సారధిని, పతాకమును రాముడు పడగొట్టినాడు. రావణుడు ప్రయోగించిన బాణములనేగాక వజ్ర, శూల, ఖడ్గాది ఆయుధములను కూడ రాముడు తన బాణములతో ఛేదించి నాడు. వజ్ర సమానతుల్యమగు బాణముతో నాతని ఉరమును కొట్టినాడు. అర్ధచంద్ర బాణముతో కిరీటమును పడగొట్టినాడు. ఈ యుద్ధమున రావణుడు ఓటమిని పొంది రాముని ఔదార్యముతో ప్రాణములు దక్కించుకొని లంకకు తిరిగి వెళ్లినాడు.

ఆ సందర్భమున రాముడు చేసిన యుద్ధమును భాస్కర రామాయణ కర్త మనోహరముగా ఇట్లు వర్ణించినాడు.

---

1. మూ.రా.యు. - 110-23, 2. మూ.రా.యు. 60-3

ఒక్కట నారిబోసి వివిధోగ్ర శరంబులదేరి చక్రముల్
చెక్కలుసేసి పై పొడవు చిందరవందరలాడి వాజులన్
ప్రక్కలు వాపి సూతుబడవైచి పతాక దళించి, కైదువుల్
చక్కగ్రదుంచి యెల్లి పలు చందములం బొలియించి వెండియున్[1]

రాముని బాణములు వరుణుని పాశముకంటె, ఇంద్రుని వజ్రాయుధము కంటె, కాలుని దండముకంటె, దేవతల సమస్త ఆయుధముల కంటె బెడిదములైనవిగా రావణుడు భావించినాడు. ఆతడు ఆయా దేవతల అయుధముల యొక్క శక్తిని చూచినట్టి వాడు. ఆతడు పారిపోయిన విధమును గూడ భాస్కర రామాయణ కర్త ఇట్లు దెల్పినాడు.

కII మీఱిన భయమున రాముని
దేఱి కనుంగొనగ నోడి ధృతి కడు దూలన్
వేఱొకరిదితేరిపై బడి
పాఱి యతడు లంకసొచ్చెఁ బౌరులు బెదరన్[2]

ఇచట రావణుడు రాముని రథమును అనగా హనుమంతుని చూచుటకును భయపడి ధైర్యమును కోల్పోయి వేఱొకరి రథముపై నెక్కి పారిపోయినాడు.

రావణుడు రెండవ పర్యాయము ముందు లక్ష్మణునితో బాణ యుద్ధముచేసి, ఆతని నతిక్రమించి రామునెదిరించినాడు. ఆ సందర్భమున రావణుని బాణ వర్షమును రాముడు నివారించుటను వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

"శరధారా స్తతో రామో రావణస్య ధనుశ్చ్యుతాః
దృష్ట్వైవాపతత శ్శీఘ్రం భల్లాన్ జగ్రాహ సత్వరమ్[3]

అంతట రాముడు రావణుని వింటినుండి ఎడతెగక ధారాపాతముగ వెడలుచున్న బాణములను చూచి, వెంటనే భల్ల బాణములను చేపట్టెను.

ఆ భల్ల బాణములతో రావణుని బాణ సమూహమును త్రుంచివైచినాడు. బాణములు ధారాపాతముగా మీద పడుచున్నపుడు ధానుష్కుడు భల్ల బాణములు ప్రయోగించుట ధనుర్యుద్ధ పద్ధతి కావచ్చును.

ఆ బాణ యుద్ధమున యిరువురును చిత్రముగా సవ్యాపసవ్య మార్గములలో

1. భాస్క.రా.యు. 849, 2. భాస్క.రా.యు. 854, 3. మూ.రా.యు. 100-23

తిరుగుచూ యుద్ధము చేసిరి. వారి బాణములు ఆకాశమంతటను నిండుటను వాల్మీకి చక్కని ఉపమతో ఇట్లు వర్ణించినాడు.

"సంతతం వివిధైర్బాణైర్బభూవ గగనం తదా
ఘనై రివాతపాపాయే విద్యున్మాలాసమాకులైః
గవాక్షిత మివాకాశం బభూవ శరవృష్టిభిః"[1]

వర్షా కాలమున మెఱుపు తీగలతో కూడిన మేఘములు క్రమ్ముకొనినట్లు ఆకాశ మంతటను బాణములాక్రమించినవి. ఆ బాణ వర్షములచే ఆకాశమునందు అపుడు మధ్యమధ్య ఏర్పడిన ఖాళీలు కిటికీలు నిర్మించినట్లున్నవి.

గ్రద్ద రెక్కలు కట్టిన బాణముల నుపయోగించుట ఆనాడు గలదు. రామ రావణులు తమ బాణ యుద్ధమున అట్టి బాణముల నుపయోగించిరని వాల్మీకి యిట్లు వర్ణించినాడు.

"మహావేగైః సుతీక్ష్ణాగ్రైః గృధ్ర పత్రై సువాజితైః"[2]

మహావేగము గలవి, మిక్కిలి వాడియైనవి, గ్రద్ద రెక్కలు కట్టుట వలన మంచి రెక్కలు గలవి యగు బాణములని భావము.

రాముడు రావణుని శిరములను క్షురబాణములచే ఖండించినాడు. రావణుని శిరములు ఖండింపబడియు మరల మొలచుటను రామాభ్యుదయ కర్తచమత్కారముగా నిట్లు వర్ణించినాడు.

ఆ॥ "దేవముని వరోపదిష్టంబు రవిహృద
యముఁ బఠించి రాముడమరవైరి
తలలుదెంచెఁ దెంచె మొలతెంచె మొలతెంచె
డులిచె డులిచె మఱియు మొలిచె మొలిచె"[3]

రాముడును సవ్యసాచి, రావణునిపై సవ్యాపసవ్యముల బాణములను ప్రయోగించినాడు. రావణుని తెగిన తలలతో, బాహువులతో భూనభోంతరములు నిండినవి.

ఆ యుద్ధమున రాముడు కొందఱు రాక్షసులను "గురుశరంబుల గొందఱ గుదులుగా గ్రుచ్చినాడని"[4] యు భాస్కర రామాయణ కర్త వర్ణించినాడు.

1. I bid 100-28, 2. మూ.రా.యు. 100-29, 3. రామాభ్యుదయం 8-226, 4. భాస్క.రా.యు. 1497 పద్యం

**5.5 అస్త్ర యుద్ధము :**

అస్త్రములు మంత్ర ప్రధానములైనట్టివి. అస్త్రవిదుడు ఆయా దేవతలకు సంబంధించిన మంత్రములు జపించి అస్త్ర ప్రయోగమును జేయును. అస్త్ర యుద్ధము కూడ ధనుర్ధారులే జేయుటను బట్టి ఇది కూడ ధనుర్యుద్ధమున నొక భాగమైనది. అస్త్ర విదుడు తన ప్రత్యర్థి ప్రయోగించిన అస్త్రమును గుర్తించి దానిని నివారింపగల అస్త్రమును ప్రయోగింపవలసి యుండును. యోధుడు తాను ప్రయోగించిన అస్త్రమును మరల్చగల ఉపసంహార మంత్రములును తెలిసి యుండవలెను. రామాయణమున అస్త్రములకు సంబంధించిన ప్రశంస విపులముగా గలదు.

బాలకాండలో విశ్వామిత్రుడు రామునకు అస్త్రప్రదానము చేయు సందర్భమున అనేక శస్త్రాస్త్రముల విషయము చెప్పబడినది. భృశాశ్వునకు దక్షుని కుమార్తెలైన జయ, సుప్రభ యను ఇరువురు భార్యలు గలరు. వారిరువురు వంద శస్త్రాస్త్రములను ప్రసవించిరి. 'జయ' అనునామె అపరిమిత బలము గలిగి, కామరూప ధరులై మిగుల గొప్పవారగు ఏబదిమంది కుమారులను గనెను. అట్లే సుప్రభ "సంహారులు"గా ప్రసిద్ధులై ఎదిరింపరాని బలవంతులకు ఏబది మంది కుమారులను గనెను.[1]

విశ్వామిత్రుడు రామునకు అనేక ప్రయోగాస్త్రములు ఉపసంహరణాస్త్రములను ప్రదానము చేసినాడు. అందు ప్రయోగాస్త్రములు ఈ విధమైనట్టివి. "ఇంద్రాస్త్రము, వజ్రాస్త్రము, బ్రహ్మ శిరోనామకాస్త్రము, ఐషీకము, బ్రహ్మాస్త్రము, శిఖరమను పేరు గల ఆగ్నేయాస్త్రము, హయశిరోనామకాస్త్రము, క్రౌంచాస్త్రము, ప్రథనమను వాయవ్యాస్త్రము, వైద్యాధరము, గాంధర్వాస్త్రము, మానవాస్త్రము, ప్రస్వాపనము, ప్రశమనము, సౌరము, దర్పణము, శోషణము, సంతాపనము, విలాపనము, మదనము, దుర్ధర్షము, పైశాచము, మోహనము, తామసము, సౌమనము, సంవర్తము, మౌసలము, సత్యము, మాయాధరము, తేజః ప్రభము, సౌమ్యము, శిశిరము, సుదామనము, భగాస్త్రము, శీతేషువు, మానవము, మొదలగునవి[2]. ఇందు మానవము, మానవాస్త్రము వేరు వేరుగా వాల్మీకమున చెప్పబడినవి.

---

1. మూ.రా.బాల 21-15 నుండి 17 శ్లో॥, 2. మూ.రా.బాల. 27-6 నుండి 20 శ్లో॥

విశ్వామిత్రుడు రామున కుపదేశించిన ఉపసంహరణాస్త్రము లీవిధముగా చెప్పబడినవి. అవి

సత్యవంతము, సత్యకీర్తి, ధృష్టము, రభసము, ప్రతిహారతరము, పరాఙ్ముఖము, అవాఙ్ముఖము, లక్షాక్షము, విషమము, దృఢ నాభము, సునాభము, దశాక్షము, శతవక్త్రము, దశశీర్షము, శతోదరము, పద్మనాభము, మహానాభము, దుందునాభము, సునాభకము, జ్యోతిషము, కృశనము, నైరాశ్యము, విమలము, యోగంధరము, హరిద్రము, దైత్యము, ప్రశమనము, సార్చిర్మాలి, ధృతిమాలి, వృత్తిమంతము, రుచిరము, పిత్రు సౌమనసము, విధూతము, మకరము, కరివీరకరము, ధనము, ధాన్యము, కామరూపము, కామరుచి, మోహము, ఆవరణము, జృంభకము, సర్వనాభము, సంతానము, వరణము మొదలగునవి. వీరందఱును భృశాశ్వుని పుత్రులే[1].

అస్త్ర ప్రయోగము చేసినపుడు మంత్రాది దైవతమునకు లొంగినచో అది ప్రాణహాని కల్గింపక ఆ వ్యక్తిని విడిచివేయును.

సుందరకాండలో హనుమంతునిపై ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ప్రయోగింపగా హనుమంతుడు బ్రహ్మమంత్రము లుచ్చరించుటచే అది ఆతనికి హాని గల్గింపక పోవుటను రంగనాథ రామాయణ కర్త ఇట్లు దెల్పినాడు.

"బలువిడి బఱతెంచు బ్రహ్మాస్త్రమునకు। దలకక బ్రహ్మమంత్రములుచ్చరింప
నది చంపజాలక యతని బంధించి। కుదియించి పడవైచె గుంభిని మీద"[2]

అస్త్ర ప్రయోగమునకు ధనుర్బాణము లక్కఱలేదు. అస్త్ర మంత్రము లుచ్చరించి దేనిని ప్రయోగించినప్పటికి దాని ద్వారా అస్త్రశక్తి బహిర్గతము కాగలదు. ఇందుకు నిదర్శనముగా కాకాసుర వృత్తాంతము చెప్పదగినది.

కాకాసురుడు సీతను బాధించుటను జూచిన రాముడు కోపించి తన సమీపమున గల ఒక తెల్లుగడ్డి పరకను బ్రహ్మాస్త్ర మంత్రముతో అభిమంత్రించి ప్రయోగించినాడు. అంతట ఆ తెల్లుగడ్డి పరక మహాతేజోవంతమై కాకాసురుని పైకి వెడలినది.

1. మూ.రా.బాల 28-4 నుండి10 శ్లో॥, 2. రంగ. రా.సుం. 233 పేజి

అస్త్రము లేవియైనను ప్రయోగించిన వాని అభిమతానుసారముగా ప్రవర్తించును. కావుననే రాముడు తనను శరణుగోరిన కాకాసురుని యొక్క ఒక నేత్రమును మాత్రమే హింసించునట్లు అస్త్రము నాజ్ఞాపించినాడు.

అస్త్రవిదులలో రాముడు శ్రేష్ఠుడు. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే అభిమంత్రిత మైన దివ్యరథమును, ఆయుధముల ధరించి యుద్ధమునకు వచ్చుటను గ్రహించి లక్ష్మణునితో బ్రహ్మదేవుని మహిమ ఊహింపరానిది గావున బాణపాతమును సహింపుమని పల్కును.

సాధారణముగా ధానుష్కుడు ముందుగా బాణ యుద్ధమును చేసి శత్రువు బలవంతుడని, లొంగదీయుటకు సాధ్యముగాని వాడని గుర్తించినప్పుడే అస్త్ర యుద్ధమునకు పూనుకొనును.

రామాయణమున నిర్వహింపబడిన అస్త్ర యుద్ధాలలో మచ్చునకు కొన్ని:-

**5.5.1 రాముడు చేసిన అస్త్ర యుద్ధం :**

రాముడు రాక్షసులపై చేసిన అనేక యుద్ధములందు వివిధాస్త్రములను ప్రయోగించినాడు. సమయ సందర్భములకు తగినవిధముగా రాముడు అస్త్రములను ప్రయోగించును.

మారీచ, సుబాహులు విశ్వామిత్రుని యజ్ఞమునకు విఘ్నము గల్గించు చుండగా రాముడు శీతేషువను పేరుగల మానవాస్త్రముతో మారీచుని మూర్ఛితుని చేసి సుదూరమున పడునట్లు చేసినాడు. ఆ విషయమును వాల్మీకి ఈ విధముగా వర్ణించినాడు.

"పశ్య లక్ష్మణ! శీతేషుం మానవం ధర్మ సంహితమ్
మోహయిత్వా నయత్యేనం న చ ప్రాణై ర్వ్యయుజ్యత"[1]

ఓ లక్ష్మణా! ధర్మ సహితమగు శీతేషువను వేరొక పేరుగల మానవాస్త్రమును చూడుము. ఇది మారీచుని తెలివి దప్పించి సుదూరము కొనిపోవుచున్నది. ఈతడు ప్రాణములను మాత్రము కోల్పోనలేదు.

1. మూ.రా.బాల. 30-19

రాముడు సుబాహుని ఆగ్నేయాస్త్రముతో సంహరించినాడు. ఇతర రాక్షసులను వాయవ్యాస్త్రముతో చెదరగొట్టినాడు.[1]

కుంభకర్ణ వధ సందర్భమున రాముడు అనిల, ఐంద్రాస్త్రములతో వాని బాహువులను ఖండించినాడు[2]. ఐంద్రాస్త్రముతో కుంభకర్ణుని శిరమును ఖండించినాడు.

అనేకమందితో ఒకే పర్యాయము యుద్ధము చేయవలసి వచ్చినపుడు గాంధర్వాస్త్రమును ప్రయోగించెడి వారు. ఇదే సమ్మోహనాస్త్రముగను చెప్పబడును. భారతమున ఉత్తర గోగ్రహణ ఘట్టంలో అసంఖ్యాకమైన కౌరవసేన నెదిరించుటకై అర్జునుడు సమ్మోహనాస్త్రమును ప్రయోగించినాడు.

రామాయణమున రాముడు రెండుమార్లు గాంధర్వాస్త్ర ప్రయోగమును జేసినాడు.

ఖర దూషణాది రాక్షసులతో పోరునపుడు ఒక్కసారిగా పదునాల్గు వేలమంది రాక్షసులు ముట్టడించగా త్వరితముగావారిని నివారించుటకు రాముడు గాంధర్వ శరమును ప్రయోగించుట భాస్కర రామాయణ కర్త ఈ విధముగా దెల్పినాడు.

జ్యానాదంబు చెలంగ చిత్రతర వేగా లక్షితాధాన సం
ధానాకర్షణ మోక్షితుండగుచు గంధర్వాస్త్ర పూర్వంబుగా
నానా బాణములేసె నవ్వసుమతీ నాధుండు దద్బాణ సం
తానం బుద్ధతి బర్వె నెల్లెడ మహాధ్వానంబుతో నత్తటిన్[3]

గంధర్వాస్త్ర ప్రభావమువలన రాముడు ప్రయోగించిన బాణములు యుద్ధరంగ మంతటను నిండిపోయినవి. ఇందు అస్త్ర మంత్రమును ధ్యానించి నానా బాణములు ప్రయోగించుట చెప్పబడినది.

అట్లే రావణుని అసంఖ్యాకమైన మూలబలముతో యుద్ధము చేయునపుడు రాముడు గాంధర్వాస్త్రమును ప్రయోగించుటను రంగనాథ రామాయణ కర్త ఇట్లు వర్ణించినాడు.

"కని తాకునప్పుడు గాంధర్వ శరము । ఘన మహత్వమున రాక్షసులకు జూడ
నొక్కొక్కనికి రాముడొక్కొక్కడగుచు । నొక్కొక్కనికి రాములొగి బదుంద్రగుచు

1. మూ.రా.బాల 30-21, 22, 2.మూ.రా.యు. 67-153, 3. భాస్క.రా.అరణ్య1-214

నొక్కొక్కనికి రాములొగి నూర్గురగుచు । నొక్కొక్కనికి రాములొగివేవురగుచు
నొక్కొక్కనికి రాము లొగి లక్షయగుచు । నొక్కొక్కనికి రాములొగి కోటి యగుచు
శతకోటి యర్బుద సంఖ్యలు గడచి । యతులితంబైనట్టి యాజిరంగమున"[1]

గాంధర్వాస్త్ర ప్రభావముతో సర్వము రామమయమైనది. రాక్షసులందఱు భ్రాంతిని చెందినవారైరి. ఆ యుద్ధమునందు రాముడు పగలు యొక్క ఎనిమిదవ పాలు కాలములోనే ఏడు కోట్ల ఇరువది తొమ్మిది లక్షల వాయు వేగము గల రథములు, పదమూడు కోట్ల పంద్రెండు లక్షల ఇరువది వేల బలవంతములైన గజములు, పది కోట్ల ఇరువది లక్షల అరువది వేల రౌతులో కూడిన గుఱ్ఱములు, నూట నలుబదియైదు కోట్ల యెనుబది లక్షల పదాతి దళమును ఒక్కడే నాశనము చేసినట్లు వాల్మీకము వర్ణించినది.[2]

రంగనాథ, భాస్కర రామాయణములు దీనిని మఱొక విధముగా చెప్పినవి. రాముడు ఒక్కొక్క నిముషమున పదునాలుగు వేల గుఱ్ఱములు, పదునెనిమిది వేల గజములు, లక్ష రథములు, రెండు లక్షల పదాతి దళములు చొప్పున సప్త ముహూర్తములు పోరి అసంఖ్యాకమైన రాక్షస సైన్యమును నాశనము చేసినట్లు వర్ణించినవి. భాస్కర రామాయణ కర్త ఈ సందర్భమున నాటి కాలమానమును ఈ విధముగా తెల్పినాడు".

"నిమేషంబు లష్టాదశంబు లొక్క కాష్టంబనంబరగు, నవి ముప్పదియైన నొక్కకళయగు, నవి త్రింశతియైన నొక్క క్షణంబంద్రు, అట్టి క్షణంబులు పంద్రెండైన ఒక్క ముహూర్తంబగు"★

ఏడు ముహూర్తముల కాలములో ఎంత సైన్యమును సంహరించినది యీ లెక్కవలన తెలుసుకొనవచ్చును.

### 5.5.2. అతికాయ - లక్ష్మణుల అస్త్ర యుద్ధం :

కుంభకర్ణ వధానంతరం రావణ తనయుడైన అతికాయుడు రావణ ప్రేరితుడై వివిధాయుధములతో గూడిన రథము నధిరోహించి వానరుల నెదిరించినాడు. ఆతని గొప్పతనాన్ని వాల్మీకి ఈ విధంగా వర్ణిస్తాడు.

1. రంగ.రా.యు. - 418, 419 పేజీలు, 2. మూ.రా.యు. 94-31 నుండి 33 శ్లో॥
★ 18 నిమేషములు - 1 కాష్టము, 30 కాష్టములు-1 కళ, 30 కళలు-1 క్షణము, 12 క్షణములు-1 ముహూర్తము

"వృద్ధ సేవీ, శ్రుతిధరః సర్వాస్త్ర విదుషాం వరః
అశ్వపృష్ఠే రథే నాగే ఖడ్గే ధనుషికర్షణి
ఖేదే సాంత్వేచ దానేచ నయే మంత్రే చ సమ్మతః[1]

అతడు పెద్దల సేవించుచు విద్యలను నేర్చి అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడై అశ్వారోహణ, గజారోహణ, రథారోహణ విద్యలును, ఖడ్గ, ధనుర్విద్యలు తెలిసిన వాడై మంత్రాలోచన యందును సమర్థుడని పై శ్లోకమునకు భావము.

ఆతడు వానర యూథపులను గాయపఱచి రాముని వద్దకు వెళ్లి గర్వోక్తులను పల్కినాడు. అది సహింపక లక్ష్మణుడు అతికాయు నెదిరించినాడు. వారిరువురును మొదట బాణయుద్ధమునే చేసిరి. పిమ్మట వారిరువురు అస్త్ర యుద్ధమును చేసినారు. మొదటగా లక్ష్మణుడు ఆగ్నేయాస్త్రమును అతికాయునిపై ప్రయోగించినాడు. అతికాయుడును దానిని సూర్యాస్త్రముతో నివారించినాడు. ఆ రెండు అస్త్రములు ఒకదాని నొకటి ఢీకొని భస్మములై నేలగూలినవి.

పిమ్మట అతికాయుడు లక్ష్మణునిపై ఐషికాస్త్రమును ప్రయోగించినాడు. ఐషీకమునకు చివర కుంచెవంటి శూలములుండును[2]. లక్ష్మణుడు దానిని ఐంద్రాస్త్రము తో ఛేదించినాడు.

తరువాత అతికాయుడు లక్ష్మణునిపై యామ్యాస్త్రమును వేసినాడు. లక్ష్మణుడు దానిని వాయవ్యాస్త్రముతో నేలగూల్చినాడు.

లక్ష్మణుడాతని వజ్రకవచమును ఛేదింప లేకపోయినాడు. అంతట వాయుదేవుడాతని వద్దకు వచ్చి బ్రహ్మాస్త్రముతో అతికాయుని సంహరింపుమని దెల్పును. అట్లే లక్ష్మణుడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించినాడు. అతికాయునకు ఆ అస్త్రమును గూర్చి తెలియదు. అందువలననే ప్రకాశమానముగా తనపైకి వచ్చుచున్న దానిపై శక్తులను, గదలను, గొడ్డళ్లను, శూలములను ప్రయోగించినాడు. బ్రహ్మాస్త్రము ఆ ఆయుధముల నన్నింటిని విఫలము చేసి శిరస్త్రాణ సహితమైన ఆతని శిరమును ఖండించినది.

1. మూ.రా.యు. 71-28, 29 శ్లో॥, 2. శ్రీమద్వాల్మీకి రామాయణం - 85 పేజి

**5.5.3. ఇంద్రజి లక్ష్మణుల అస్త్ర యుద్ధం :**

ఇంద్రజిత్తు తన చివరి యుద్ధమును లక్ష్మణునితో భయంకరముగా చేసినాడు. ఈ యుద్ధమున ఇంద్రజిత్తు తన మాయలను ప్రయోగింప లేదు. మొదట లక్ష్మణేంద్రజిత్తు లిరువురు బాణయుద్ధమునే చేసిరి. ఆ యుద్ధమున లక్ష్మణుడు ఇంద్రజిత్తు సారథిని సంహరింపగా నాతడు నేర్పుగా లంకలో ప్రవేశించి మరియొక రథము నధిరోహించి యుద్ధ రంగమునకు వచ్చి లక్ష్మణు నెదిరించినాడు. ఇరువురును పరస్పరము ముఖములపై నాటుకొనునట్లు బాణములను ప్రయోగించు కొనినారు. లక్ష్మణుడు బాణ యుద్ధమున తనను మించుటను గుర్తించి ఇంద్రజిత్తు అస్త్ర యుద్ధము నారంభించినాడు.

యముడొసగిన యామ్యాస్త్రమును ఇంద్రజిత్తు లక్ష్మణునిపై ప్రయోగించి నాడు. లక్ష్మణుడు దానిని కుబేరుడు తనకు స్వప్నమున ప్రసాదించినట్టి కుబేరాస్త్రముతో నివారించినాడు. అవి రెండును అకాశమున రెండు మహాగ్రహముల వలె ఢీకొని నూరుముక్కలై నేలగూలినవి.

ఇంద్రజిత్తు నాగాస్త్రము ప్రయోగింపగా దానినుండి అసంఖ్యాకములైన సర్పములు ఆకాశమంతట నిండుటను భాస్కర రామాయణ కర్త ఈవిధముగా వర్ణించినాడు.

ఉ॥ కాలవిలోల దీర్ఘతరకాయములై విగళన్మహా విష
జ్వాలల తోడి ధూమములు వావిరి దిక్కుల నెల్లపర్వగా
నాలుకలోలిఁ గ్రోయుచు గనస్ఫుట నిశ్వసి తానలంబులం
దూలిచె దేవయానములఁదోరములైన భుజంగ సంఘముల్[1]

నల్లని పొడవైన కదలుచున్న శరీరములు గలవి, మహావిషజ్వాలలతో, పొగలతో దిక్కులను నింపివేయునట్టివి, పెద్ద పడగలతో బుసలు కొట్టుచున్నవి యగు సర్పములు ఆకాశమంతటను నిండినవి.

అంతట లక్ష్మణుడు నాగాస్త్రమును నివారింపగల 'గరుడాస్త్రము'ను ప్రయోగించినాడు. అప్పుడా గరుడాస్త్రము నుండి గరుడ పక్షులుద్భవించుటను గూడ భాస్కర రామాయణ కర్త చమత్కారముగా నిట్లు వర్ణించినాడు.

సీ॥ పక్షవిక్షేపజ పవన వేగంబున
విఱిగి వృక్షంబులు వెనుకఁదూలఁ

1. భాస్క.రా.యు. 1375 పద్యం

దోయధి నవిలంబు పాయయిచ్చినయంత
ఫణిరాజు లోకంబు బయలు పడగ
గ్రహమండలము తారకాచక్రమును దమ
గతిదప్పి విభ్రాంతి, గలగి పరవ
తునుకలై చెదరిన తోయదంబులలోన
దివిజయానంబులు దిరుగువడగ
ఖరములగు మహానఖరముల, ముక్కుల
జీరి పొడిచి బిట్టు చించి త్రుంచి
యక్కజంబు గాగ నహి సమూహము నెల్ల
సమయజేసె విహగసముదయంబు[1]

గారుడాస్త్రము నుండి వెలువడిన గ్రద్దలు తమ పదునైన ముక్కులతో సర్ప సమూహమును ముక్కలు చేసినవి.

ఇంద్రజిల్లక్ష్మణులు పరస్పరము వారుణాస్త్రము, రౌద్రాస్త్రము, ఆగ్నేయాస్త్రము, సౌరాస్త్రము మొదలగు వానిని గూడ ప్రయోగించు కొనుటను జేసిరి. ఇంద్రజిత్తు ఆ సురాస్త్రమును ప్రయోగింపగా అతని ధనుస్సునుండి ఆ అస్త్ర ప్రభావము వలన కూట ముద్గరములు, శూలములు, ముసుండులు, గదలు, కత్తులు, గండ్రగొడ్డళ్లు మొదలుగా గల ఆయుధములు వెలువడినట్లు వాల్మీకము వర్ణించినది[2]. లక్ష్మణుడు దానిని మహేశ్వరాస్త్రముతో నివారించును.

ఈ యుద్ధమున ప్రయోగింపబడిన అస్త్రముల వరుసయందు వాల్మీకమునకు, తెలుఁగు రామాయణములకు కొంచెము భేదముగలదు. చివరకు లక్ష్మణుడు తన అస్త్ర శక్తికి, తన ప్రతిజ్ఞా శక్తిని జోడించినాడు. ఇంద్రుని వలన పొందిన ఐంద్రాస్త్రమును ధనుస్సును సంధించి ప్రతిజ్ఞ చేయుటను భాస్కర రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

తే॥గీ॥ రామచంద్రుండు సద్ధర్మ రతుడ యేని
సీత సుచరిత్ర సాధుత్వ శీలయేని
వేలయ దైవంబుకృప నాకు గలిగెనేని
యది యహేంద్రాది సురలకు హితమయేని[3]

1. భాస్క.రా.యు. 1977 పద్యం, 2. మూ.రా.యు. 91-60, 61 శ్లో॥, 3. భాస్క.రా.యు.1382

అనునట్టి ప్రతిజ్ఞతో ప్రయోగించబడిన ఐంద్రాస్త్రము ఇంద్రజిత్తు శిరస్సును ఖండించినది. వ్యక్తుల వ్యక్తిత్వం అస్త్ర బలాన్ని పెంపొందింప జేస్తుందని దీని వలన తెలియుచున్నది.

**5.5.4 రామ మకరాక్షుల యుద్ధం :**

ఇది పూర్తిగా అస్త్ర యుద్ధము కాదు. కానీ రాముడు మకరాక్షుని ఆగ్నేయాస్త్రముతో సంహరించుటను బట్టి ఇందు చెప్పుట జరిగినది. మకరాక్షుడు ఖరుని పుత్రుడు. హనుమంతుడు నికుంభుని చంపిన తరువాత రావణుడు మకరాక్షుని యుద్ధమునకు పంపినాడు. తన తండ్రిని చంపిన పగదీర్చుకొనవలెనను నుత్సాహముతో నాతడు చతురంగ బలసమేతుడై వానర సైన్యము నెదిరించినాడు. ఆతడు వివిధా యుధములను ప్రయోగించుటయందు నైపుణ్యము గలవాడు. కావున గదాఖడ్గాది ఆయుధములతో వానర సైన్యమును "మారిమసగినట్లు" నాశనము చేయసాగినాడు. ఆతడు ధనుర్విద్య యందును నైపుణ్యము గలవాడు. అతడు వానర సేనపై బాణములు వేసిన తీరును రంగనాథ రామాయణ కర్త ఇట్లు వర్ణించినాడు.

"..... ముప్పదిట, నూఱింట, నఱువదింటను, మఱి యరుపదేనింట
నిరువదింట వెస నిరువదారింట, బరగ నాఱింటను బంద్రెంట రెంట
పదిట, పదేనింట, పదునెన్మిదింట, పదుమూట, నాల్గింట, బదునాలుగింట
దెగగొని మూట, నైదింట, నేడింట, నగలించి తొమ్మిది యమ్ముల నేసె"[1]

వానిని సహింప లేక వానరులు రాము నాశ్రయించినారు.

మకరాక్షుడు రామునెదిరించి తాను ఏవిధమగు యుద్ధము నందైనను నేర్పుగల వాడనేనని సూచించుచు ఈ విధంగా అంటాడు. దానిని భాస్కర రామాయణ కర్త ఈ విధంగా తెల్పినాడు.

ఆ॥ ఖడ్గ శక్తినైన, గదనైన జేతుల। నైన వింటనైన నరసిజూడ
గడగి నీకుబోరగా నేర్పు మిక్కిలి। యెందుగలదు దానినేరికొనుము[2]

మకరాక్షుడు రామునిపై అనేక విధములగు ఆయుధములను ప్రయోగించినాడు. బాణ వర్షమును కురిపించినాడు. రాముడు వానినన్నింటిని తన

1. రంగ.రా.యు. 387 పేజి, 2. భాస్క.రా.యు. 1246 పద్యం

బాణములతో ఖండించి ఆగ్నేయాస్త్రముతో ఆతని సంహరించినాడు[1].

**5.5.5 రామ రావణుల అస్త్ర యుద్ధం :**

రామరావణుల తుదిపోరు భయంకరముగా సాగినది. వారును మొదట బాణ యుద్ధమును జేసినారు. రావణుడు రాముని బాణ జాలమునకు నిలువ లేకపోయినాడు. అస్త్ర యుద్ధమును ప్రారంభించినాడు.

రావణుడు మొదటగా దైవతాస్త్రము ప్రయోగింపగా రాముడు దానిని శాంతింపజేసినాడు.

రామరావణుల అస్త్ర యుద్ధమున కొన్ని విచిత్రములు కనబడును. రావణుడు రాక్షసాస్త్రము ప్రయోగింపగా దానినుండి విచిత్రాకృతులు గల రాక్షసులు పుట్టుటను భాస్కర రామాయణ కర్త ఇట్లు వర్ణించినాడు.

ఉ॥ మీఱిన కోఱలున్ మిగిలి మింటికిఁ బర్విన పల్ల వెంట్రుకల్
తేఱిన మిట్టగ్రుడ్డులు సుదీర్ఘతరంబగు నట్టి సాహసం
బాఱని తేజమున్ దెసలనంటిన చేతులు లోకరాజిలో
నేఱిన మేటి రూపముల నెంతయు బేర్చిరి రాక్షసుల్ వడిన్[2]

వాల్మీకి రామాయణము దీనిని ఆసురాస్త్రముగా తెల్పినది. ఆ అస్త్రమునుండి సింహ ముఖములు, దేగ ముఖము వంటి ముఖము గలవి. నక్కముఖము గలవి, తోడేలు ముఖము గలవి యగు అనేక బాణములు వెడలినట్లు వాల్మీకము వర్ణించినది[3].

ఆసురాస్త్రమును రాముడు ఆగ్నేయాస్త్రముతో నివారించినాడు. ఆ ఆగ్నేయాస్త్రము వలన అగ్నివలె ప్రకాశించు ముఖము గలవి, సూర్య ముఖములు, చంద్రముఖములు, అర్ధచంద్ర ముఖములు, ధూమకేతు ముఖములు, గ్రహముఖములు, నక్షత్ర ముఖములు, ఉల్కా ముఖములు గల బాణములుద్భవించినవి. ఆసురాస్త్రము నుండి పుట్టిన భీకర బాణములను ఆగ్నేయాస్త్ర బాణములు నశింపజేసినవి.

ఇట్లే ఈ అస్త్ర యుద్ధమున జరిగిన మరికొన్ని విచిత్రములు మనము గమనింపవలెను.

---

1. మూ.రా.యు. 79-37, 2. భాస్కరా.యు.2040, 3. మూ.రా.యు. 100-41 నుండి 43 శ్లో॥

రావణుడు వారణాస్త్రమును ప్రయోగింపగా దానినుండి ఏనుగుల గుంపు పుట్టుటను భాస్కర రామాయణ కర్త ఇట్లు వర్ణించినాడు.

మ॥ తెలియన్ వారిధి యన్నదీ శత సపత్నీ భూత దానాంబు శై
వలినీ చంద్రకితాంబు రాశి జలమై వాలాహి దుప్రేక్ష్యమై
చలహస్తాగ్ర విలూన దేవతటినీ చంచత్సువర్ణాబ్జమై
బలసెన్ వారణ సంఘ మస్త్రజనిత ప్రఖ్యాతి నిష్పన్నమై[1].

అధికముగా మదజలమును స్రవించునట్టివి, చూడశక్యము గానట్టివి, పొడవైన తుండములు గలవి యగు ఏనుగుల సమూహము ఆ అస్త్రము నుండి పుట్టినవి.

ఆ అస్త్రమునకు ప్రతిగా రాముడు 'నారసింహాస్త్రమును ప్రయోగించినాడు' దాని నుండి పుట్టిన సింహముల సమూహము ఏనుగుల గుంపును నశింపజేసినట్లును భాస్కర రామాయణము వర్ణించినది[2].

ఈ విధమగు విపులమైన వర్ణనలు సంస్కృతాంధ్ర రామాయణములలో పెక్కు గలవు.

రామాభ్యుదయ కర్త రావణుడు తాను ప్రయోగించిన ఆగ్నేయాస్త్రము రాముని వారుణాస్త్రముతో నణగిన తర్వాత నాగాస్త్రమును ప్రయోగించుటను చమత్కారముగా నిట్లు వర్ణించినాడు.

క॥ కీలిశర మాఱిపోయిన
కాలోరగ శరముపంక్తి కంరుడు వఱపెన్
వ్యాళమయ మగుచు మిసుగై
ప్రాలెన్ ప్రాణముల మీద వచ్చెన్ విధికిన్[3]

ఆకాశమంతా నల్లత్రాచులతో నిండిపోయింది. శరీరములనిండా నల్లత్రాచులు తగులు కొనిన వానరులు "మొగిలు తీవ లలమిన మేరుపర్వత శిఖరములవలె" నున్నారట. రాముడు నాగ-బాణమునకు ప్రతిగా-గరుడాస్త్రము ప్రయోగించినాడు. "ఆ అస్త్రము నుండి వెలువడిన వెన్నుని గుఱ్ఱాలు అనగా గరుడ పక్షులు ఆకాశమంతటను నిండినవి. ఆ సందర్భమును రామాభ్యుదయ కర్త చమత్కారముగానిట్లు వర్ణించినాడు.

1. భాస్క.రా.యు. 2055 పద్యం, 2. Ibid 2057 పద్యం, 3. రామాభ్యుదయం

కII ఒక కడ బులుగుల దొర యెఱు
పొకకడ బెనుపాప నలుపు నొదవిన నుడువీ
ధికిఁ బగలొక కడనున్, రే
యొకకడనుం గల సురాద్రి యొరపు లభించెన్[2]

ఒక ప్రక్కన నల్లత్రాచుల నల్లదనము, మరొక ప్రక్కన గరుడుల ఎఱ్ఱదనము గల ఆకాశము ఒక ప్రక్కన రాత్రి మరొక ప్రక్కన పగలు గల మేరు పర్వతము వలె నున్నదని దాని భావము.

చివరగా రాముడు బ్రహ్మాస్త్రముతో రావణుని సంహరించినాడు. బ్రహ్మాస్త్ర వర్ణనము భాస్కర రామాయణమున విపులముగా గలదు. ఆ అస్త్రము ప్రకాశించిన విధము ఇట్లు వర్ణింపబడినది.

సీII విలయార్క మండలావిర్భావ మొదవంగ
సంవర్త పావక చటులమగుచు
కులిశ మహాయుధ కోటి సంకాశమై
కాల దండాయుతాఖీల మగుచు
చటుల చక్ర సహస్ర సన్నిభ స్ఫురణమై
రుద్రశూలోదగ్ర రుచులు నిగుడ
నిర్ఘాత సంఘాత నిష్ఠుర పాతమై
ఫణిరాజ సముదాయ భయదమగుచు
సప్తమారుత దుర్వార జవము గలిగి
దానవస్తోమ హృదయ సంత్రాస మొదవ
శతముఖుడు మొదలైన దిక్పతులు మెచ్చ
నతి నిరర్గళమైన బ్రహ్మాస్త్ర మడరె[2]

ప్రళయకాలపు సూర్యుని వలె భయంకరమై, సుడులు తిరుగు అగ్నిజ్వాలలతో కూడినదై కోటి వజ్రాయుధములతో సమానమైనట్టిదై, తీక్షణమైన వేయి చక్రములతో సమానమై,

1. I bid 8-217, భాస్కరా.యు. 2191

శివుని భయంకరమైన శూలము వంటి కాంతులు గలదై పిడుగుపాటు వంటి కఠినమైనదై, పాతాళ లోకమునందున్న ఫణిరాజ శ్రేష్ఠులకును భయము గల్గించునదై, సప్తమరుత్తుల వేగము గలదై ఆ బ్రహ్మాస్త్ర మొప్పినది.

ఆ సమయమున జరిగిన ప్రకృతి వైపరీత్యములను భాస్కర రామాయణ కర్త వర్ణించినాడు. ఆ అస్త్రము నేటి అణ్వస్త్రము వలె భయంకరమైనది. ఆ బ్రహ్మాస్త్రము రావణుని వక్ష స్థలమును చీల్చుకొని అతని ప్రాణములను తీసి, ఆ విషయము చెప్పుటకై వెళ్లినట్లు భూమిని చీల్చుకొని పోయి ఒక్క అర్థ నిమిష మాత్రమున తిరిగి రాముని తూణీరము చేరినట్లు భాస్కర రామాయణ కర్త వర్ణించినాడు[1].

తెలుగు రామాయణములందు రాముడు ముందుగా ఆగ్నేయాస్త్రముతో రావణుని కుక్షియందున్న అమృతభాండము నింకింపజేయుటయు వర్ణింపబడినది[2].

**5.6 ఖడ్గ యుద్ధము :**

ఖడ్గ సహాయమున జేయు యుద్ధము ఖడ్గ యుద్ధముగా చెప్పబడును.

రామలక్ష్మణులు, రావణుడు, రావణపుత్రులు, రాక్షస వీరులు, ఖడ్గ యుద్ధమున నిపుణులుగా చెప్పదగిన వారు. వానర యూధవులలో హనుమంతుడు, అంగదుడు, వానర రాజగు సుగ్రీవుడు మొదలగు వారు ఖడ్గ యుద్ధమున ప్రవేశమున్న వారుగా కన్పింతురు. రామలక్ష్మణులు విరాధ, కబంధుల బాహువులను ఖండించు నపుడే ఖడ్గముల నుపయోగించుట కన్పించును. రాక్షసులలో రావణుడు జటాయువు యొక్క రెక్కలను ఖండించునపుడు ఖడ్గము నుపయోగించినాడు. రాక్షస వీరులలో శోణితాక్షుడు, యూపాక్షుడు, క్రోధనుడు, యుద్ధోన్మత్తుడు, మొదలగు వారు ఖడ్గ ప్రయోగ కుశలురుగా చెప్పదగిన వారు. మిగిలిన సాధారణ రాక్షస భటు లుపయోగించిన ఆయుధములందు ఖడ్గము కూడ గలదు. ధనుస్సు తరువాత ఖడ్గమే శ్రేష్ఠమైన ఆయుధముగా చెప్పదగినది.

ఖడ్గ యుద్ధము చేయు వీరులు వృషభ చర్మము గప్పిన డాలు నుపయోగించుట గలదు. వజ్రదంష్ట్రుడు అంగదు నెదిరించు సందర్భమున ఖడ్గముతో పాటు డాలును గూడ ధరించినట్లు వాల్మీకి మిట్లు దెల్పినది.

1. భాస్క.రా.యు. 2193, 2. I bid 2174

జగ్రామ చార్షభం చర్మ ఖడ్గంచ విపులం శుభమ్

కింకిణీ జాల సంఛన్నం చర్మణాంచ పరిష్కృతమ్.[1]

అతడు వృషభ చర్మము గప్పిన డాలును విశాలమై చిరుగంటలచే శోభిల్లు మంచి ఒరగల కత్తిని పట్టుకొని నిలిచినాడని శ్లోక భావము.

ఇందు కత్తి ఒరలకు గంటలు కట్టుటయు చెప్పబడినది. డాలునకు పర్యాయ పదంగా రామాయణమున 'చర్మ' పదమే కన్పిస్తుంది.

డాలును చేయడానికి ఖడ్గమృగం, తాబేలు చర్మములను గూడ నుపయోగించెడి వారు. ఈ డాళ్లు వివిధాకారములతో నుండెడివి. ఇవి భారత యుద్ధ కాలమునకు బాగుగా అభివృద్ధి చెందినవి.

ఖడ్గము యొక్క విశిష్టతను గూర్చి లక్షణములను గూర్చి ఖడ్గ లక్షణ శిరోమణ, మానసోల్లాసము, శివతత్త్వ రత్నాకరము వంటి ప్రాచీన గ్రంథములు తెల్పినవి.

### 5.6.1 ఖడ్గ లక్షణములు :

'శుక్రనీతి'లో ఖడ్గమును గూర్చిన విషయములను ఖడ్గ లక్షణ శిరోమణి పీఠికలో ఇట్లు చెప్పబడినవి.

"అసిరేవ పరం శస్త్రం స్వహస్తే నిత్య శోక్షయం

అమోఘాకార సదృశం సర్వశస్తు క్షయప్రదమ్"[2]

కత్తి శ్రేష్ఠమైన ఆయుధము, చేతియందు అక్షయముగా శోభించుచున్నది. అమోఘమైన అకారముగలది. సమస్త శత్రునాశకమైనదని దాని భావము.

శివతత్త్వ రత్నాకరము నందును ఈ విధముగా చెప్పబడినది.

"పంచాశదంగుళం శ్రేష్టం చత్వారిం శచ్చ మధ్యమమ్

షట్ త్రింశద్భిః కనిష్టం స్యాత్[3]......

ఇందు ఖడ్గమందలి రకములు చెప్పబడినవి. ఏబది అంగుళములు గలది శ్రేష్టమైన

1. మూ.రా.యు. 54-30, 2. ఖడ్గ లక్షన శిరోమణి - పీఠిక 26వ పేజి, 3. ఖడ్గ లక్షణ శిరోమణి - పీఠిక పేజి 27

ఖడ్గము. నలుబది అంగుళములు గలది మధ్యమమని, ముప్పది యారు అంగుళములు గలది అథమమని చెప్పబడినది.

ఖడ్గ లక్షణ శిరోమణి అసితో మొదలుకొని ముప్పది రెండు అయుధములను చెప్పినది. "అసి" అను పేరుగల ఖడ్గమునకు ప్రత్యేకముగా 'లక్ష్మీనారాయణ సంవాదము' అను గ్రంథమున లక్షణములు చెప్పబడినట్లు, తాను ఆ గ్రంథము ననుసరించినట్లు రచయిత "నవనప్ప" చెప్పుకొనినాడు.[1]

ఖడ్గ లక్షణ శిరోమణి గ్రంథమునకు పీఠిక వ్రాసిన ప్రసిద్ధ పరిశోధకులు శ్రీ నిడదవోలు వెంకటరావు గారు ఖడ్గముయొక్క గొప్పతనమును గూర్చి ఈ విధంగా తెలిపినారు.

The Science of Swords is as old as the Vedas, as we find mention of ASI (Vide Vedic Index 1–47)and though the present work is written as late as the 18th Century of the Christian era, the author calls it as "ASI PRABANDAHA" besides the name "KHADGA LAKSHANA SIROMANI" (Verse-4). It is due to this antiquity that the name ASI occupies the first place in the thirty two kinds of weapons named above. The general term Khadga is chosen by the author as it is familiar to Telugu people. Much information regarding the swords is available in the "AGNI PURANA", "BRHAT SAMHITA", "SUKRANITI", "MAHA BHARATHA", "MANASOLLASA", "VIRAMITRODAYAM" and "SIVATATTVA RATNAKARA" and I have given in the appendices the relative extracts from "SUKRANITI", "MANOSOLLASA' and "SIVATATTAVA RATNAKARA"[2].

ఖడ్గమునకు సంబంధించిన శాస్త్ర విజ్ఞానము వేదకాలము నాటికే ఉన్నట్లు, అది "అసి"గా పిలువబడినట్లు, ముప్పది రెండు అయుధములలో "అసి" ప్రథమ స్థానము పొందినట్లు ఇందు తెల్పబడినది. అంతేగాక 'శుక్రనీతి', 'అగ్నిపురాణము', 'బృహత్సంహిత', 'మహాభారతము', 'మానసోల్లాసము', 'వీర మిత్రోదయము', 'శివతత్త్వ రత్నాకరము' మొదలగు గ్రంథములందు ఖడ్గమునకు సంబంధించిన అనేక వివరములు లభించునని చెప్పబడినది.

---

1. ఖడ్గ లక్షణ శిరోమణి - 13 వచనం - పేజి-4, 2.ఖడ్గ లక్షణ శిరోమణి - పీఠిక 13 పేజి

ఢిల్లీ వస్తు ప్రదర్శనశాల క్యూరేటర్ డా॥ వి.అగ్రావాలా గారు ఖడ్గములను గుఱించి పరిశోధించి సుమారు మూడు వందల రకములున్నట్లు తెలియజేసినారు[1].

మానసోల్లాసము ఏబది అంగుళములు గల ఖడ్గము శ్రేష్ఠమైనదిగా, ముప్పది ఐదు అంగుళములు గలది నీచమైనదిగా, రెంటికిని మధ్యస్థమైనది మధ్యమముగా తెల్పియున్నది.[2]

### 5.6.2 ఖడ్గ విద్యా ప్రచారములు :

ఖడ్గ విద్యా ప్రయోగమునందలి నేర్పరితనము ఖడ్గ విద్యా ప్రచారముగా చెప్పబడును. ఉత్తర హరివంశమున హంసడిభకులు శ్రీకృష్ణునితో విరోధమును బొంది ఆయన నెదిరించు సందర్భమున డిభకుడు సాత్యకితో ఖడ్గ యుద్ధము చేయుటను వర్ణించుచూ నాచన సోమన ఖడ్గ విద్యా ప్రచారముల నీ విధముగా తెల్పినాడు.

"భ్రాంతము – విభ్రాంతము – విద్ధము – అవిద్ధము – విప్లుతము – విసృతము – ఆకరము – వికరము – భిన్నము – నిర్మర్యాదము – అమానుషము – సంకుచితము – వికుచితము – సవ్యజానువు – వామజానువు – చిత్రకము – అహితకము – క్షిప్తము – గుడుంబము – లంబనము – దృతము – సవ్యబాహువు – తుంగబాహువు – వినిర్బాహువు – సవ్యేతరము – వృత్తము – త్రిబాహువు – సవ్యోన్నతము – దాసి – పృష్ఠతః ప్రసారణము – యోధికము – పృధితము అను ముప్పది రెండు ప్రచారంబులం పరిభ్రమించి"[3]

ఇందు ముప్పది రెండు రకముల ఖడ్గ విద్యా ప్రయోగములు చెప్పబడినవి.

### 5.6.3 ఖడ్గ యుద్ధ దృష్టి విశేషములు :

ఖడ్గ యుద్ధమున యోధుడు ప్రత్యర్థిని దెబ్బ తీయుటకై ఎట్టి జాగ్రత్త పొందవలెనో, తనను తాను ఎట్లు రక్షించు కొనవలెనో దృష్టి విశేషములందు చెప్ప బడినది. సింహాసన ద్వాత్రింశిక ఖడ్గ యుద్ధమునకు సంబంధించిన తొమ్మిది విధములగు దృష్టి విశేషములను ఇట్లు తెల్పినది.

1. I bid, పీఠిక 16 పేజి, 2.మానసోల్లాసము – IV అధ్యాయ, 55 శ్లో॥, 3. ఉత్తర హరివంశము 4-256 వచనం

సీ॥ మతి కాకదృష్టి నేమఱక రక్షించుట
సూకర దృష్టియై ఢాకగొలిపి
గర్జన సేయక మార్జాల దృష్టిమై
దరలక పరుజించి తాకబూని
భల్లూక దృష్టి నసొంగ సంగతి గని
కపి దృష్టి వంచించి కాపు సూపి
చేష్ట దప్పక గృధ్ర దృష్టి గనుంగొని
యొయ్యన ఫణిదృష్టి నొడయ జూచి
మనసుదేఱ జూచియును చూడకున్నట్లు
దృఢముగాగ చోరదృష్టి నడగి
జంకమీద నొడిసి శార్దూల దృష్టిపై
బడుట సురియకాంఁడ్ర పంతమిదియ[1]

ఇందు కాకదృష్టి – సూకర దృష్టి – మార్జాల దృష్టి – భల్లూక దృష్టి – కపిదృష్టి – గృధ్ర దృష్టి – ఫణి దృష్టి – చోరదృష్టి – శార్దూల దృష్టి అనునవి చెప్పబడినవి.

**5.6.4 ఖడ్గోత్పత్తి క్రమము :**

మహాభారతమున ఖడ్గము యొక్క ఉత్పత్తిని గూర్చి చెప్పబడినది. ధనుస్సు తర్వాత ఖడ్గమే మేలైనదని తెల్పుచూ భీష్ముడు నకులునితో ఖడ్గోత్పత్తిని, దాని ప్రభావమును ఈ విధంగా చెప్తాడు.

బ్రహ్మ సృష్టిచేసిన తరువాత అసురుల వలన సురముని వ్రాతములకు బాధ కల్గుటను చూచి హిమశైలమునకేగి అచ్చట నిష్ఠతో వేయి సంవత్సరములు తపము చేసినాడు. నియమయుక్తముగ యజ్ఞము చేసినాడు. ఆయాగాగ్ని నుండి అశేషలోక భీతికరమగు భూతమొకటి ఆవిర్భవించినది. దానిని చూచి దేవతలందఱును భీతిల్లినారు. అప్పుడు బ్రహ్మ దేవతలను రక్షించుటకు, రాక్షసులను వధించుటకు సాధనముగా ఖడ్గమును సృష్టించినానని పల్కినాడు. అంతలో ఆ మహాభూతము ఆ రూపమును విడిచిపెట్టి ఖడ్గాకృతిని పొందినది. బ్రహ్మ ఆ ఖడ్గమును ముందుగా శివునకు సమర్పించినాడు. శివుడు రాక్షస సంహారముజేసి దానిని విష్ణువున కొసగినాడు.

1. సింహాసన ద్వాత్రింశతిక – 7–62 పద్యము

విష్ణుండు మహాస్త్ర రూపంబగు నయ్యాయుధమును మరీచికిచ్చినాడు. మరీచి భార్గవునకు, భార్గవుడనేక మునులకు, మునులింద్రునకు, ఇంద్రుడు లోకపాలురకు ఖడ్గమును ప్రసాదించుట జరిగినది. తరువాత క్రమమున మను ప్రభృతులైన మానవేంద్రులు పడసి నిజసంతతి కిచ్చినారు"[1].

ఖడ్గమునకు ఎనిమిది విధములగు పూజ్య నామములు చెప్పబడినవి. అవి (1) అసి, (2) విశసనంబు, (3) ఖడ్గము, (4) తీక్ష్ణ ధారము, (5) దురాసదము, (6) శ్రీగర్భము, (7) విజయము, (8) ధర్మపాలము. ఇవి ఎనిమిది రకములైన కత్తులు.

**5.7 రామాయణమున వర్ణింపబడిన ఖడ్గ యుద్ధములు :**

రామాయణమునందు ఖడ్గమును యోధులుపయోగించుటను గూర్చి యనేక చోట్ల చెప్పబడినది.

రామలక్ష్మణులు అరణ్యవాసమునకు బయలుదేరునపుడు ధనుస్సులనే గాక ఖడ్గములను గూడ తీసుకొని వెళ్లుటను వాల్మీకి ఈ విధముగా తెలియజేసినాడు.

"తతః కలాపాన్ సన్నహ్య ఖడ్గౌ బద్ధ్వాచ ధన్వినౌ
జగ్మతుర్యేన తౌ గంగాం సీతయా సహ రాఘవౌ"[2]

రామలక్ష్మణులు కవచములను ధరించి, అమ్ములుపొదులు, ఖడ్గములు విండ్లు చేతబట్టి గంగానదిని చేరు మార్గమున బయలుదేరిరని ఆ శ్లోకభావము.

విరాధ కబంధుల వధయందు రామలక్ష్మణులు ఖడ్గములనుపయోగించిరి. రామలక్ష్మణులు తమపై వచ్చి పడుచున్న విరాధుని ఖడ్గముతో కొట్టుటను వాల్మీకి ఈవిధముగా వర్ణించినాడు.

"తౌ ఖడ్గౌ క్షిప్రముద్యమ్య కృష్ణ సర్పోపమౌ శుభౌ
తూర్ణమాపతతస్తస్య తదాప్రహరతాం బలాత్[3]

వేగముగా తమపైకి వచ్చిపడుచున్న ఆవిరాధుని కృష్ణ సర్పముల వలె నొప్పు ఖడ్గములతో ఆ రామలక్ష్మణులు అతనిని ప్రహరించిరి. విరాధుడు రామలక్ష్మణులను తన బాహువులలో నిఱికించికొని పోవుచుండగా లక్ష్మణుడాతని ఎడమ భుజమును, రాముడాతని కుడిభుజమును తమ ఖడ్గములతో ఖండించిరి.

---

1. మహాభారతం – శాంతి 3–442 నుండి 449 పద్యములు, 2. మూ.రా.అయోధ్య – 52–11, 3. మూ.రా.అరణ్య. 3–21

అట్లే రామలక్ష్మణులు కబంధుని భుజములను నఱికిన సందర్భమును భాస్కర రామాయణ కర్త ఈవిధంగా వర్ణించినాడు.

.................................. ఏల
ఈ విచారంబు వధియింపుమిపుడ యనుడు
దెలిసి ఖడ్గంబు వెఱికి దైతేయ దీర్ఘ
కఠిన భుజదండ ముగ్రవేగమున నఱకె
ననుజు డట్టుల జేసె దక్కిన భుజంబు"[1]

రాముడు నిరాయుదుడైన కబంధుని వధించుట ధర్మముగాదని యాలోచించుండ లక్ష్మణుడు రామునితో అట్టి విచారము మాని ఆతని వధింపుమనినాడు. అంతట రాముడు వాని దీర్ఘమైన, కఠినమైన దండము వంటి భుజమును నఱికినాడు. పిమ్మట లక్ష్మణుడు రెండవ భుజమును ఖండించినాడు.

అట్లే ఖరుడు రామునిపై బాణములను ప్రయోగించినపుడు ఆతని అనుచరులును బిట్టుగా నార్చి రామునిపై గదాముసలాది ఆయుధములు, బాణములు, ఖడ్గములు ప్రయోగించిరి. అప్పుడు ఆకాశమంతట ఖడ్గములు నిండుటను భాస్కర రామాయణ కర్త ఈవిధంగా వర్ణించాడు.

........................ చూడ్కికిన్
పట్టెడ లేక కైదువులు పందిరికైవడి నిండి క్రమ్మగన్"[2]

ఆకాశంలో చూచే ఏడము కూడా లేకుండా కత్తులు పందిరివలె నిండినవి. ఆ రాక్షస వీరులు రామునిపై అధిక సంఖ్యలో కత్తులను ప్రయోగించినారని దీనివలన తెలియుచున్నది.

రావణపుత్రుడైన అతికాయుడు గదా, ఖడ్గ, ధనుర్విద్యలలో ప్రవీణుడు. అంతేగాక అతడును కుంభకర్ణునివలె పెద్ద శరీరమును కలవాడు. అతికాయుని రథమునకు కట్టబడిన ఖడ్గములను వాల్మీకి ఈ విధముగా వర్ణించినాడు.

"ద్వౌచఖడ్గౌ రథగతౌ పార్శ్వస్థౌ పార్శ్వశోభితౌ
చతుర్హస్త త్సరుయుతౌ వ్యక్త హస్త దశాయతౌ"[3].

1. భాస్క.రా.అరణ్య – 2-391, 2. భాస్కర. రా.అరణ్య 1-200, 3. మూ.రా.యు. 71-21

నాలుగు చేతుల ప్రమాణముగల పిడులుగల్గి పదిచేతుల నిడివిగల్గిన రెండు ఖడ్గములు అతని రథమునకు ఇరుపార్శ్యములందును వ్రేలాడుచున్నవని శ్లోకభావము.

### 5.7.1. రామాయణము నందలి దివ్యఖడ్గ ప్రసక్తి :

లక్ష్మణు డొకనాడు అరణ్యమున విహరించుచుండగా అతనికొక దివ్యఖడ్గము లభించిన వృత్తాంతము రంగనాథ రామాయణమున గలదు. ఇది అమూలకము.

శూర్పణఖ కుమారుడైన జృంభుడు తన తండ్రిని చంపిన రావణునిపై పగదీర్చుకొనవలెనని కోరి సూర్యుని గూర్చి తపము చేయుచుండెను. సూర్యుడాతని తపమునకు మెచ్చి అతని వద్ద కొక దివ్యఖడ్గమును పంపినాడు. ఆ ఖడ్గము తన నందు కొనుమని జృంభునితో పల్కినది. అప్పుడా రాక్షసుడు గర్వముతో ఆ భానుడు తానుగా వచ్చి యీయకుండా ఇట్లు పంపినచో నేను స్వీకరింతునా? యని దానిని నిరాకరించినాడు. ఆతడు మరల తపస్సులో మునిగినాడు. అదే సమయమునకు అచ్చటకు వచ్చి లక్ష్మణుడు ఆ ఖడ్గమును నేర్పుగా నొడిసిపట్టినాడు. ఆ ఖడ్గమచటకు ఎట్లు వచ్చినదోయని ఆలోచించుచు అతడు అచటగల వెదురు జొంపమును ఖండించినాడు. దానితో అందుకూర్చుండి తపము చేయుచున్న జృంభుడును సంహరింప బడినాడు. ఆ విధముగా లక్ష్మణునకు దివ్యఖడ్గము లభించినది.[1]

అట్లే అగస్త్య మహర్షి రామునకు దివ్యశర చాపములు, ఖడ్గ యుగ్మమును ఇచ్చుటను భాస్కర రామాయణ కర్త ఈ విధముగా వర్ణించాడు.

చ॥ కలశ భవుండు రామునకు కౌతుక మొప్పగ దివ్యమైన యు
జ్జ్వల ఘన ఖడ్గ యుగ్మమును వైష్ణవమైన శరాసనంబు బెం
పలరునమోఘ సాయకము లక్షయ తూణయుగంబు నిచ్చి, నీ
వలసిన వాని గోరుమనివారణ నిత్తు నరేంద్ర నావుడున్[2]

మూల.రామాయణమునందును బంగారు ఒరగలిగిన, బంగారు పిడిగల కత్తిని అగస్త్య మహర్షి రాముని కిచ్చినట్లు చెప్పబడినది[3].

లక్ష్మణుడు ఇంద్రజిత్తుపై యుద్ధమునకు బయలుదేరినపుడు రాముడాతనికి దివ్యశరచాప ఖడ్గములను, వజ్రకవచమును యిచ్చి పంపినాడు.

1. రంగ.రా.అరణ్య - 134, 135 పేజీలు, 2.భాస్కర.రా.అరణ్య 1-98 ప॥, 3.మూ.రా.అరణ్య 12-34

### 5.7.2. ఖడ్గముతో చేయబడిన ద్వంద్వ యుద్ధములు :

ఇరువురు యోధులు ఖడ్గ సహాయమున చేసిన ద్వంద్వ యుద్ధములు రామాయణమున కొన్ని వర్ణింపబడినవి. మచ్చునకు కొన్ని :

#### (i) అంగద శోణితాక్షుల ఖడ్గ యుద్ధం :

అకంపనుడు మరణించిన తరువాత శోణితాక్షుడు అంగదుని వివిధములైన బాణములతో నొప్పించెను. అంగదుడు కోపించి అతని ధనుర్బాణములను విఱిచివైచెను. అంత శోణితాక్షుడు కత్తిని డాలును తీసుకొని ముందువెనుకలాలోచింపక వేగముగా ఆకసమున కెగిరెను. వాల్మీకి ఆ విషయము నిట్లు వర్ణించినాడు.

"శోణితాక్ష స్తతః క్షిప్ర మసి చర్మ సమాదదే
ఉత్పపాత ధివంక్రుద్ధో వేగవాన విచారయన్"[1]

అంగదుడు అతనికంటె మరింత వేగముగా పైకెగిరి వానినిపట్టి, వాని చేతిలోని కత్తిని లాగికొని సింహనాదము చేసినాడు. పిమ్మట అంగదుడు శోణితాక్షుని మూపుపై కత్తితో కొట్టి యజ్ఞోపవీతమును వలె ఛేదించినాడు. ఆ మహాఖడ్గమును ధరించియే ఇతర రాక్షసుల మీదకు వెళ్లినాడు.

ఖడ్గ ప్రహారములందు "యజ్ఞోపవీత మార్గము" ఇందు చెప్పబడినది.

ఇంద్రజిత్తు తన రథముపై కూర్చుండబెట్టుకొని తెచ్చిన మాయసీతను అట్టే ఛేదించినాడు. వాల్మీకి దానిని "యజ్ఞోపవీత మార్గేణభిన్నాతేన మనస్వినీ"[2] అని వర్ణించినాడు. "యజ్ఞోపవీత ధారణ ప్రకారము" గా నని గోవిందరాజీయము దానిని వ్యాఖ్యానించినది.[3]

#### (ii) అంగద ప్రజంఘుల యుద్ధం :

అంగదునిచే దెబ్బతినిన శోణితాక్షుడు ప్రజంఘుని, యూపాక్షుని సహాయముగా తీసుకొని మరల అంగదుని ఎదిరించినాడు. అంగదునకు మైంద, ద్వివిదులు సహాయకులుగా వచ్చిరి. ఆ ముగ్గురును భయంకరమైన యుద్ధమును చేసిరి, ఆ యుద్ధమున ప్రజంఘుడు ఖడ్గముతో అంగదుని పైకి రాగా అంగదుడాతని బాహువును పిడికిలితో పొడిచి ఖడ్గమును నేలపడజేసెను. పిమ్మట ఆ ఖడ్గముతోనే అంగదుడు ప్రజంఘుని శిరస్సును ఖండించెను.[4]

---

1. మూ.రా.యు. 76-8, 2. మూ.రా.యు. 81-31, 3. గోవింద రాజీయం - 957 పేజి, 4. మూ.రా.ఉ.76-26

(iii) సుగ్రీవ మహోదరుల ఖడ్గ యుద్ధం :

సుగ్రీవ మహోదరులు మొదట కొంతసేపు బాహు యుద్ధము చేసిరి. పిమ్మట మహోదరుడు సమీపమున పడియున్న ఖడ్గమును, డాలును తీసుకొనెను. వెంటనే సుగ్రీవుడును ఖడ్గమును డాలును తీసుకొనుటను వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

"తథైవ చ మహాఖడ్గం చర్మణా పతితం సహ
జగ్రాహ వానరశ్రేష్ఠః సుగ్రీవో వేగవత్తరః"[1]

మహోదరుని కంటె అధికవేగము గల సుగ్రీవుడును నేలపై పడియున్న వేరొక కత్తిని, డాలును తీసుకొనినాడు. అంతట ఖడ్గ విద్యలో నేర్పరులగు ఆ మహోదర సుగ్రీవులిరువురును శరీరములుప్పొంగ పోరాటము సాగించిరి. ఈ సందర్భమున వాల్మీకి ఖడ్గ విద్యలో ఇరువురును నేర్పరులను విషయమును "ఉభే శస్త్ర విశారదౌ"[2] అను పదము ద్వారా తెలియజేసినాడు.

సుగ్రీవ మహోదరు లిరువురు సవ్యాపసవ్య మండలములుగా తిరుగుచూ ఖడ్గయుద్ధము చేసినారు. శూరుడు, వేగవంతుడనగు మహోదరుడు తన చేతికత్తిని సుగ్రీవుని చేతియందలి డాలులో తగుల్కొనునట్లు ప్రయోగించెను. మహోదరుడు డాలుకు గ్రుచ్చుకొనిన కత్తిని లాగుచుండగానే వానర శ్రేష్ఠుడగు సుగ్రీవుడు శిరస్త్రాణ, కుండలాలంకృతమైన మహోదరుని శిరస్సును తన చేతి ఖడ్గముతో నఱికెను.

(iv) హనుమ త్రిశిరుల ఖడ్గయుద్ధం :

రావణపుత్రుడగు త్రిశిరుడు మహోదరుని* మరణమును జూచి కుపితుడై ధనుర్బాణములను ధరించి సమీపమునగల హనుమంతు నెదిరించెను. వారిరువురి మధ్య భయంకరమగు యుద్ధము జరిగినది. త్రిశిరుడు ప్రయోగించిన భయంకరమగు శక్త్యాయుధమును కూడా హనుమంతుడు భగ్నము చేసినాడు. పిమ్మట త్రిశిరుడు ఖడ్గ యుద్ధమునకు సిద్ధపడుటను వాల్మీకమిట్లు వర్ణించెను.

"తతః ఖడ్గం సముద్యమ్య త్రిశిరా రాక్షసోత్తమః
నిజఘాన తదావ్యూడే వాయుపుత్రస్య రక్షసి"[3]

---

1. మూ.రా.యు., 98-29, 2. మూ.రా.యు., 98-31, * ఈ మహోదరుని పేరు యుద్ధోన్మత్తుడు, ఇతడు రావణునకు సోదరుడు, 3. మూ.రా.యు., 70-41

ఆ రాక్షస శ్రేష్ఠుడగు త్రిశిరుడు ఖడ్గమును తీసుకొని హనుమంతుని వక్షముపై కొట్టెను. అంతట హనుమంతుడు తన అరచేతితో కొట్టి త్రిశిరుని క్రిందపడవైచి ఆతని చేతియందలి ఖడ్గమును లాగికొనెను. పిమ్మట హనుమంతుడు త్రిశిరుని శిరస్సును ఖండించుటను భాస్కర రామాయణ కర్త ఇట్లు తెల్పినాడు.

మ॥ ప్రకట మదోద్ధతిన్ గడగి పంక్తి ముఖాత్మజు పైకి, లెక్కసే
యక వెసదాటి ఘోరకులిశాహతి నింద్రుడు విశ్వరూపు మ
స్తకమును ద్రుంచినట్టు లడిదంబుననొక్కటద్రుంచె దత్త్రిమ
స్తకి వడి భీకర భ్రుకుటి చాప కలాప లలాట పట్టికన్"[1]

ఆతని మూడు శిరములను ఇంద్రుడు విశ్వరూపుని శిరస్సును ఖండించినట్లు ఖండించినాడు. దీనినిబట్టి హనుమంతునికి కూడ కొంత ఖడ్గ విద్యలో ప్రవేశమున్నట్లు బావింప వచ్చును.

### (V) అంగద క్రోధనుల ఖడ్గ యుద్ధం :

అంగదుడు కంపనుని గాయపఱచుటను జూచి క్రోధనుడు క్రోధించి అంగదు నెదరించినాడు. అంతట క్రోధనుడు కరవాలమును తీసుకొని నేర్పుగా రథము నుండి క్రిందకు దుమికి అంగదుని పైకి వెడలినాడు. వారి యుద్ధమును భాస్కర రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

"క్రోధనుండును గరవాలంబు నొడ్డనంబును గొని, లాఘవంబున ధరణికి లంఘించి యార్చుచుం బేర్చిన చూచి దుందుభి వైరినందనుడు సంరంభంబున విజృంభించి, సింహనాదంబుసేసి, సైంహికేయుండు చందురుం బొదువు చందంబున నరవాయిగొనక కరవాలంబు దిగిచి పుచ్చుకొని యలికంబు వగుల నడిచి యపరిమిత విన్యాస విరచనా విశేషంబుల వ్రేసి వానింగాలు ప్రోలికింగాపుపుచ్చి"[2] నాడు.

ఇందు అంగదుడు ఖడ్గ యుద్ధమున "అపరిమిత విన్యాస విరచనా విశేషములు" తెలిసిన వాడుగా వర్ణింపబడినాడు.

ఈ విధముగా వానరులలో సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు, ఖడ్గ యుద్ధము తెలిసిన వారుగా చెప్పదగిన వారు. రామాయణమున ఖడ్గ యుద్ధ

1. భాస్కర.రా.యు. 1015, 2. భాస్కర. రా.యు. 1194 వచనం

వర్ణనలు విపులముగాలేకపోయినప్పటికి ఆనాటి యుద్ధ పద్ధతులలో ఖడ్గ యుద్ధమును గూడ ఒక పద్ధతిగానే గ్రహింప వచ్చును.

**5.8 గదా యుద్ధము :**

గదాయుధముతో చేయబడునట్టి యుద్ధము గదాయుద్ధముగా చెప్పవచ్చును. రామాయణ కాలమున ఇనుపగదలు ఆయుధములుగా నుపయోగింప బడినవి.

శుక్రనీతి యందు గదాయుధము యొక్క ఉత్తమ, మధ్యమ, అధమత్వములు చెప్పబడినవి.

"గదా లక్షణం వక్ష్యతే... తత్రపంచాశదంగులా యామా
శ్రేష్ఠా, చత్వారింశ దంగులా యామా మధ్యమా,
త్రింశదంగులా యామానికృష్టా భవేత్"

ఏబది అంగుళముల ప్రమాణముగలది శ్రేష్ఠమైనదిగను, నలుబది యంగుళముల ప్రమాణము గలది మధ్యమముగను, ముప్పది యంగుళముల ప్రమాణముగల గద అధమమైనదిగను చెప్పబడును.

ఖడ్గయుద్ధమునకువలెనే గదా యుద్ధ వర్ణనలును రామాయణమున అధికముగాలేవు. రాక్షసులలో విభీషణుడు గదాధారి. అతడు ఇతర ఆయుధములను ధరించినట్లు నిదర్శనములులేవు హనుమంతుడు మన చిత్రపటములలో వలె గదాయుధమును ధరించినవానిగా వాల్మీకమున కన్పట్టడు.

రామలక్ష్మణులు ఆయుధవిద్యలన్నింటను నేర్పరులైనప్పటికి రామాయణమున వారు గదాయుద్ధము చేయుట ఎచ్చటను కనబడదు. అట్లే రాక్షస శ్రేష్ఠులైన రావణ, ఇంద్రజిత్తులు కూడా గదా యుద్ధము చేయుట కనబడదు.

రాక్షసులలో మహాపార్శ్వుడు, మహాకాయుడు, శోణితాక్షుడు, కంపనుడు, యుద్ధోన్మతుడు మొదలగు వారు గదాయుద్ధము చేసినారు. వానరులలో అంగదుడు, హనుమంతుడు, ఋషభుడు గదాయుద్ధమున ప్రవేశమున్న వారిగా కనబడుదురు.

సుందరకాండలో అక్షుడు హనుమంతుని పక్షమును గదతో కొట్టి నొప్పింపగా హనుమంతుడు ఆ గదతోనే వానిని కడువడినేసినాడు.అంతట వాడు

తప్పించుకొని ఖడ్గమును, డాలును ధరించి ఆకసమున కెగురగా హనుమంతుడు వానితో నెగిరి వానిపై గదను ప్రయోగించినాడు[1].

### 5.8.1. రామాయణంలోని గదాయుద్ధాలు – మచ్చునకు కొన్ని :

#### (i) మహాపార్శ్వ ఋషభుల గదాయుద్ధము :

రావణుని సోదరుడగు మహాపార్శ్వుడు ఋషభుని పైకి గదను ధరించి యుద్ధమునకు వెళ్లుటను రంగనాథ రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

"ఉరుమణి ప్రభల నత్యుగ్రమై యముని। పరుషోగ్ర దండంబు పాటిగా గలిగి
అరుణ పుష్పంబుల నరుణ గంధంబున। నురుతరంబుగుచు నయోమయంబైన
ఉదయార్క భాసమానోజ్జ్వలంబుగుచు। నొదవు గదాదండ ముగ్రుడై దాల్చి"[2]

మణికాంతులతో ప్రకాశించునది,భయంకరమైనది, యముని దండము వోలినట్టిది, ఎఱ్ఱని పుష్పములతో, గంధముతో పూజింపబడినట్టిది యగు ఇనుప గదను మహాపార్శ్వుడు ఋషభునిపై ప్రయోగించినాడు. ఋషభుడాతనితో పోరి, అతని చేతియందలి గదాదండము నేలబడగా వెంటనే దానిని గ్రహించి ఆ గదతోనే మోది మహాపార్శ్వుని సంహరించినాడు.

#### (ii) అంగద మహాకాయుల గదా యుద్ధం :

మహాకాయుడు అంగదుని ఇనుప గుదియతో గొట్టి మూర్ఛిల్లజేసినాడు. గవాక్షుని పది బాణములతో, పృథుని ఐదు బాణములతో, క్రోధనుని ఏబది బాణములతో, గజుని ఐదువందల బాణములతో, శతబలిని మూడు బాణములతో, పనసుని ఏడుబాణములతో, మిగిలిన వానరులను ఒక్కొక్కరిని ఒక్కొక్క బాణముతో గొట్టి గాయపరచినాడు.

అంతలో మూర్ఛనుండి తేరుకొనిన అంగదుడు "గదాపాణి" యగుచు మహాకాయుని రథముపైకినుఱికినాడు. ఆ గదతో మహాకాయుని రథమును రథాశ్వములను గూల్చుటను భాస్కర రామాయణ కర్త ఇట్లు వర్ణించినాడు.

చ॥ "వికటవిశంకట భ్రుకుటి వీరరసోద్భట వీచి విస్ఫుర
ద్వికృతి నటింప గట్టలుక వేయి హయంబుల నూతుజంపి కా

1. రం.రా.సుం. 232 పేజి, 2. రం.రా.యు. 370 పేజి

రుమ్మకమును గేతనంబు రథమున్ వితథంబులు చేసి వూచి సీ
సక మెడలించి నెత్తి పెలుచన్ గదవ్రేయుచు దాటె నుర్వికిన్"[1]

అంగదుడు మహాకాయుని రథాశ్వములను, సూతుని చంపి, అతని ధనుస్సును, ధ్వజమును విఱిచి కిరీటమును పడగొట్టి ఆతని నెత్తిపై గదతో కొట్టినాడు.

అంతట మహాకాయుడు మరొక గదా దండమును తీసుకొని అంగదు నెదిరించినాడు. వారిరువురి గదా యుద్ధమును భాస్కర రామాయణ కర్త మనోహరముగా వర్ణించినాడు.

ఉ॥ అప్పుడు దీప్తహేమ వలయ ద్యుతులాకస మంటగా గదల్
త్రిప్పుట, లెత్తివేయుటలు, దీవ్రగతిం బయిదాటి పోవుటల్
తప్పదొలగుటల్ బహువిధంబుల నొంచుట లార్చి వ్రేసినం
జిప్పలువార నొగ్గుటలు బెల్లగ నిద్దఱు బోరి రుద్ధతిన్"[2]

ఇందు గదలను త్రిప్పుట, ఎత్తివేయుట, మీఱి ప్రవర్తించుట, తప్పుకొనుట, అనేక విధముల బాధించుట, మొదలగు రీతులలో వారిరువురు పోరాటము చేసినట్లు వర్ణింపబడినది. దీనిని బట్టి అంగదుడు గదా యుద్ధమున నేర్పు గలవాడని చెప్ప వచ్చును.

### (iii) సుగ్రీవ యుద్ధోన్మత్తుల యుద్ధము :

విరూపాక్షుని అన్నయగు యుద్ధోన్మత్తుడు సుగ్రీవు నెదిరింపగా సుగ్రీవుడు పరిఘాయుధముతో వాని ధనుస్సును త్రుంచి రథమందలి సూతుని నేలగూల్చినాడు. అంతట యుద్ధోన్మత్తుడు గదాపాణియై పృథివికి దిగి సుగ్రీవు నెదరించినాడు. ఈ యుద్ధమున యుద్ధోన్మత్తుడు గదతోను, సుగ్రీవుడు ఇనుపముండ్లు గల పరిఘతోను పోరాటుము చేసినారు. 'పరిఘ' కూడా గదవంటి లోహదండమే. అప్పుడు వారు చేసిన యుద్ధమును భాస్కరరామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

"అయ్యిద్ధఱు పరిఘ, గదా హస్తులై తలపడి మహోరగంబుల క్రియ నిట్టూర్పులు నిగిడించుచు, ప్రస్వేద సిక్తాంగులై మదకుంజరంబుల క్రియంబ్రవర్తించుచు సమర సముత్సాహ పులకిత గాత్రులై కంఠీరవంబుల కరణి ప్రహారంబుల తలలు

1. భాస్క.రా.యు. 710 పద్యం, 2. భాస్కర.రా.యు. 712 పద్యం

పగిలి నెత్తురు గాఱ, నడజేవురు గొండల చాడ్పున లంఘన లాఘవంబులుం గలిగి గరుడుల చందంబుదోప సింహనాదంబుల జీమూతంబులకైవడి, పరస్పర జంఘల నొప్పించుచు, జాను ప్రదేశంబుల నొగిలించుచు, ఊరుల భేదించుచు, కటి ప్రదేశంబుల బగిలించుచు, నుదరంబుల గలంచుచు, నురంబుల నగలించుచు, బాహుల స్రుక్కించుచు కంఠంబుల జఱచుచుచరణంబుల బిట్టడుచుచు ఫాలతలంబుల నలంచుచు, శిరంబుల నెత్తురు జొత్తిల్ల మొత్తుచు, సోలుచు, వ్రాలుచు, దెలియుచు, మలయుచు, దేఱచు, మీఱుచు, గేరుచు, నితరేతర జయకాంక్ష లినుమడింప, చలంబుడింపక, తెంపు పొంపిరివోవ, మండల క్రమ భేదంబులు నూపుచు పెద్దసేపు పోరిరి[1]. "ఊరుల భేదించుచు" యని చెప్పటం బట్టి ఆ కాలమున గదాయుద్ధము నందు నాభికి క్రిందిభాగమున కొట్టగూడదను నియమము లేనట్టు భావింప వచ్చును. భారత యుద్ధమున భీముడు దుర్యోధనుని ఊరుభంగము జేయుటనుకొందఱు యోధులాక్షేపించిరి[2]. ప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుటకై భీముడావిధముగ చేసినట్లు కృష్ణుడును సమర్థించినాడు.

సుందరకాండలో అక్షుడు హనుమంతుని వక్షమును తన గదతో నొప్పింపగా హనుమంతుడు వాని గదను లాగికొని ఆతనిపై ప్రయోగించినాడు.

### 5.9. మల్లయుద్ధము లేక బాహు యుద్ధము (Wrestling) :

మల్లయుద్ధమును "నియుద్ధ" మనియు పిలుతురు. శాస్త్రబద్ధమైన యుద్ధ క్రీడలలో నిదియు నొకటి. ధనుర్వేదమున చెప్పబడిన ముక్తాముక్తాది చతుర్భేదములే గాక పంచమ భేదమైన "నియుద్ధము" కూడా తరువాత శాస్త్రజ్ఞులచే గ్రహింపబడినది.

మల్లవిద్య భారతీయుల ప్రాచీన మనోవినోదముగాను, బలవృద్ధికి వీరోచిత సాధనంగా కూడా ఉపయోగపడేది[3]. మల్లవిద్య వృత్తిగా గల మల్లులు రాజుల ఆశ్రయంలో ఉండేవారు. అయోధ్యలోని మహారథులంతా సింహము, పులులు, పందుల వంటి అడవి జంతువులను బాహు యుద్ధంలో ఓడించే వారని వాల్మీకము తెల్పుచున్నది.

"సింహ వ్యాఘ్ర వరాహాణాం మత్తానాం నదతాంవనే
హంతారో నిశితైః శస్త్రైః బలాత్ బాహుబలైరపి"[4]

1. భాస్కరా.యు. 1530 వచనం, 2. మహాభారతం - శల్యపర్వం 2-271.
3. రామాయణ కాలంలోని భారతీయ సంస్కృతి - 174 పేజి, 4. మూ.రా.బాల 5-21

ఈ విధంగా జంతువులతో పోరాడుట తరువాత కాలము నందలి శిల్పము లందును కనబడుచున్నది[1].

రాముని వద్ద మల్లదళముండెడిదని శ్రీమద్రామాయణమున చెప్పబడినది. రాముడు అరణ్య వాసమునకు బయులుదేరునపుడు తన ఆశ్రయముననున్న మల్లులకు బహుమానముల నిచ్చినట్లు చెప్పబడినది.[2]

మల్లయుద్ధము నందు మధ్యస్థుడుగా (Referee) ఉండువానిని 'ప్రాశ్నికుడ'ని పిలిచెడివారు.[3]

రామాయణ యుద్ధ ఘట్టములలో రావణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, అంగదుడు, మహాకాయుడు, విరూపాక్షుడు మొదలగు వారు మల్లయుద్ధ ప్రవీణులుగా కనబడుదురు. వీరు 'నియుద్ధ క్రీడ' విపులముగా రామాయణమున వర్ణింపబడినది. వానరులందఱు బాహు యుద్ధమున నేర్పరులే. రాజపుత్రులగు రామలక్ష్మణులును మల్లయుద్ధ ప్రవీణులైనప్పటికి వారి మల్లయుద్ధ మెచ్చటను రామాయణమున వర్ణింపబడలేదు. మల్లయుద్ధము కొంత మొరటుతనము గల యుద్ధక్రీడగా కనబడుతుంది.

రామాయణమున వర్ణింపబడిన మల్లయుద్ధములలో మచ్చునకు కొన్ని –

**5.9.1 రావణ సుగ్రీవుల మల్లయుద్ధము :**

రావణ సుగ్రీవుల మల్లయుద్ధాన్ని వాల్మీకి విపులంగా వర్ణించినాడు. ఆ యుద్ధ ప్రారంభమును గూర్చి ఈ విధంగా తెల్పినాడు.

"కృత్వా నియుద్ధం భృశముగ్ర వేగౌ కాలంచిరం గోపురవేది మధ్యే[4]

పట్టణ ద్వార మధ్యమన వారిరువురును నియుద్ధక్రీడ ప్రారంభించిరి. వారిరువురు ఒకరినొకరు త్రోసుకొనిరి. క్రిందకు లాగికొనియు, ఒండొరుల దేహములువంచియు, వెనుకడుగు వైచి అవకాశమున కెదురు చూచుచు ఒకరిచేతుల నొకరు పెనవైచి ఒండొరుల నొడిసిపట్టి ప్రాకార, పరిఖలమధ్య పడియు నేర్పుగా భూమిని తాకకనే పైకి లేచుచు నిట్టూర్పులు విడుచుచు, తమ్ముతామే ఆలింగనము చేసుకొనుచు, బాహుపాశములచే బంధించుకొని ఔమ్ములతో కొట్టుకొని, ఒకరినొకరు గట్టిగా

1. Ancient Life in Uttarapath, 224 పేజి, 2. మూ.రా.అయోధ్య – 36–4, 3. మూ.రా.అరణ్య 27–4, 5, 4. మూ.రా.యు. 40–16

అదుముకొని మండలాది వివిధ పద్ధతులలో ఒకరినొకరు చంపుకొనుటకు ప్రయత్నించుచు భక్ష్యమునకై పొంచి యున్న రెండు పిల్లులవలె పొంచి నిలుచుచు, మండలాది సంచారము చేయుచు, నియుద్ధక్రీడ సాగించినట్లు వాల్మీకి మహర్షి వర్ణించి నాడు. మండల సంచారమనగా పాదభ్రమణ విశేషమని రామాయణ వ్యాఖ్యాతలలో నొకరైన మహేశ్వర తీర్థులు వ్యాఖ్యానించిరి.

మండలమును గూర్చి భరతుడు ఈ విధముగా చెప్పియున్నాడు.

"ఏకపాద ప్రచారో యస్సచారీ త్యభిదీయతే
ద్విపాద క్రమణం యత్తు కరణనామ తద్భవేత్
కరణానాం సమాయోగాత్ ఖండమిత్యభిదీయతే
ఖండైః త్రిభిశ్చతుర్భిః వా సంయుక్తం మండలం భవేత్

భరతుడు మల్లయుద్ధమున నాలుగు విధములగు 'మండలము' లనే చెప్పినాడు. అవి 1. చారి మండలము, 2. కరణ మండలము, 3. ఖండ మండలము, 4. మహామండలము.

(i) ఒక పాదముతో ముందుకువచ్చి తిరుగుచూ శత్రువు నాక్రమించుట చారిమండలము.

(ii) రెండు పాదములతో తిరుగుచూ వచ్చి ఆక్రమించుట కరణ మండలము

(iii) అనేక కరణమండలముల సంయోగము ఖండమండలముగా చెప్పబడును.

(iv) మూడు లేక నాలుగు ఖండమండలముల సంయోగము మహామండలముగా చెప్పబడును.

ఈ మండలములు గదాయుద్ధము, చక్రశక్త్యాది ఆయుధ యుద్ధములందును గలవు.

వాల్మీకమునందు యుద్ధకాండలో 40వ సర్గయందు 23 నుండి 26 వరకు గల శ్లోకములలో వివిధములగు మండల పద్ధతులు చెప్పబడినవి. అవి:

"మండలాని విచిత్రాణి స్థానాని వివిధానిచ
గోమూత్రికాణి చిత్రాణి గతప్రత్యాగతానిచ
తిరశ్చీన గతాన్యేవ తథా వక్ర గతానిచ
పరిమోక్షం ప్రహారాణాం వర్జనం పరిధావనం
అభిద్రవణ మాప్లావ మాస్థానం చ సవిగ్రహమ్
పరావృత్త మపావృత్త మవద్రుత మవప్లుతమ్
ఉపన్యస్త మపన్యస్తం యుద్ధ మార్గ విశారదౌ
తౌసంచేరతు రన్యోన్యం వానరేంద్రశ్చ రావణః"

వివిధ మండలముల ననుసరించి, వివిధ స్థానములందు నిలిచి రావణ సుగ్రీవులు యుద్ధమును చేసినారు.

**వివిధ మండలములు :**

(i) గోమూత్రికము : గోమూత్రము వలె వంకర గమనము
(ii) గత ప్రత్యాగతము : ఉపసర్పణ, అపసర్పణములు
(iii) తిరశ్చీన గతాని : అడ్డముగా పోవుట
(iv) వక్రగతులు : సవ్యాపసవ్య వక్రగమనములు
(v) పరిమోక్షము : స్థానచలనము ద్వారా శత్రువుయొక్క దెబ్బను నిష్ఫలము చేయుట.
(vi) ప్రహారాణాం వర్జనం : ఎదురుదెబ్బతీసి తద్వారా శత్రువు దెబ్బనుండి తప్పించుకొనుట.
(vii) పరిధావనం : ఒకరు నిల్చియుండ వేఱొకరు చుట్టును తిరుగుట.
(viii) అభిద్రవణము : శీఘ్రముగా ఎదుర్కొనుట.
(ix) ఆప్లావం : మండూక గమనం (కప్పవంటి గమనము)
(x) ఆస్థానంచ సవిగ్రహమ్ : ధైర్యముతో నిలుచుట
(xi) పరావృత్తం : పెడమొగమై పోవుట.
(xii) అపావృత్తం : నిల్చినట్టే యుండి ప్రక్కకు జరుగుట.
(xiii) అవద్రుతం : శత్రువు నొడిచి పట్టుటకై శరీరమును ముడిచివంగుట
(xiv) అవప్లుతం : ఎదుటివానిని కాలితో తన్నుటకై ముఖము వంచి ఎగురుట.
(xv) ఉపన్యస్తం : ఎదుటివానిని పట్టుకొనుటకై చేయిచాచుట.
(xvi) అపన్యస్తం : ఎదుటివాడు పట్టుకొనకుండా చేతులు విదల్చుట.

వివిధ స్థానములు :

వైష్ణవము, సమపాదము, వైశాఖము, మండలము, ప్రత్యాలీఢము, ఆలీఢము యను స్థానములను గూర్చి ధనుర్యుద్ధమున చెప్పబడినది. ఈ విదమగు పద్ధతులలో రావణ సుగ్రీవులు మల్ల యుద్ధమును చేసినారు.

భాస్కర రామాయణ కర్త కూడ రావణ సుగ్రీవుల మల్లయుద్ధమును విపులముగా వర్ణించినాడు.

"బలువిడిలాగునంబెనచి పట్టుచు, పట్టిన నూడిపోవుచున్
మలయుచు, తాకుచుం, తిరిగి మర్మములంటగ వ్రేయుచున్ మహీ
స్థలి బడదాచుచుం గదియ, జానువు లూదుచు ముష్టికూర్పరా
దుల వడి నొంచుచుం గడకతో నిటులొండొరు మీఱి వెండియున్[1]

ముష్ఠి కూర్పరాదులనగా పిడికిలి, మోచేయి, మోకాలు మొదలగునవి. లాగున బెనచుట యనగా నొక విధమగు మల్లబంధ విశేషముతో పెనచుటయని వ్యాఖ్యాతలు తెల్పినారు.

రావణసుగ్రీవులింకను మల్లయుద్ధము చేసిన విధమిట్లు తెల్పబడినది.

"చిత్రగతిం పెనంగిరిల చెందుచు, క్రిందుచు, మీదు నౌచు, గ్రా
న్నెత్రు ధరాపరాగముల నిల్పు ముహూర్త్ల ఠ దుత్పతత్పత
ద్గాత్రములందు బెంజెమరుగ్రమ్మగ నూర్పులు సందడింప, గో
మూత్రక మండలీకరణముల్ మొదలైన విశేష భంగులన్[2]

వారు శరీరముల నుండి నెత్తురొలుకుచుండగా, చెమట గ్రమ్ముచుండగా క్రిందును మీదును అగుచు గోమూత్రికాది మండల పద్ధతులలో మల్లయుద్ధము చేసినారు.

వారి మల్లయుద్ధమును రంగనాథ రామాయణ కర్త గూడ ఈ విధముగ వర్ణించినాడు.

"కటములు సుదురులు కంధరంబులును । విటతాటములజేసి వీపెల్లజీరి
కడకాళ్ల తొడలతో గదియంగబట్టి । వడిగోపురంపుతో వైచ నొప్పించి"[3]

ఇందువీపెల్ల జీరుట వానర లక్షణమునకు చెందినదిగా చెప్పవచ్చును.

1. భాస్క.రా.యు. 480, 2. I bid... 481, 3. రంగ.రా.యు. 295 పేజి

## 5.9.2 అంగదమహాకాయుల మల్లయుద్ధం :

మఱియొక్క బాహు యుద్ధము అంగద మహాకాయుల మధ్య జరిగినది. మొదట వారిరువురు గదాయుద్ధము చేసినారు. గదలు విఱిగి పడుటతో బాహు యుద్ధ క్రీడకు పూనుకొనినారు[1]. భాస్కర రామాయణ కర్త వారి యుద్ధమును విపులముగా వర్ణించినాడు.

"పొడుచుచు, వ్రేయుచు, పట్టుచు
విడుచుచు; గ్రొవ్వేసకమెసగ, వెసదాకుచు బ
ల్విడి దిరిగి మడమ దాచుచు
బడవైచుచు క్రిందమీద బడుచు నెగయుచున్[2]

వారి బాహు యుద్ధమును చూచి, ఉభయ సైన్యముల వారును హాహాకారములు చేసినారు. మల్లయుద్ధము జరుగునపుడు ఉభయ పక్షముల వారును తమ యోధునకు విజయము గలుగవలెనని కోరి ఉత్సాహము కల్గించు మాటలు పల్కుటయు గలదు; అంగద మహాకాయులు యుద్ధము చేయునపుడు ఉభయ సైన్యశ్రేణులను వారిని పొగిడి ఉత్సాహవంతులను చేయుట భాస్కరరామాయణమున చెప్పబడినది[2]. నలుడు అంగదునితో ఈ విధముగా పల్కును.

ఉ॥ వాలి తనూజ! దోర్బల జవంబుల వాలికి నెత్తువత్తు, నీ
వాలమునన్ భవజ్జనకు డట్టి మహోద్ధతుడైన దుందుభి
న్లీల వధింపడే, యితని నీవును నింక వధించి దిక్కులన్
వాలిన తండ్రి కీర్తులకు వన్నియ వెట్టుదుగాక నావుడున్"[3]

నలుని మాటలను విని ఉత్సాహము పొందిన అంగదుడు తన అఱచేతి దెబ్బతో అతని తల పగుల వ్రేసినాడు.

## 5.9.3. విరూపాక్ష సుగ్రీవుల మల్లయుద్ధము :

విరూపాక్ష సుగ్రీవులు చేసిన మల్లయుద్ధమును భాస్కర రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

---

1. భాస్కర.రా.యు. 713, 2. భాస్కర.రా.యు. 716, 3. I bid... 719

సీ॥ మల్లయుద్ధము సేయ మది గోరి యిద్దఱు
దివురుచు విడుచుచు దెఱపి గొనుచు
బెడకేల వ్రేయుచు, బిడికిట పొడుచుచు
పుడమిపై బడగాచి యెడసి పోసి
కడిమి మీదికి జిమ్మి కరముల దట్టుచు
కాళ్ల దన్నుచును మోకాళ్ల జదిపి
బలుగేల వ్రేసిన బడు బంతికయివడి
నెగసి లాగముగొన యేపు మిగిలి
దైత్యుడర్కసూను దలమున జఱచిన
సోలి తెలిసి పేర్చి సురలు వొగడ
నురము వ్రేసెవాడు నొగి నెత్తురుమియుచు
గొండ యొఱగు భంగి గూలెనంత1

వారిరువురు మల్లయుద్ధము చేయవలెనను కుతూహలము గలవారై ఒకరినొకరు పట్టుకొనుటను విడుచుటను మధ్య కొంత విశ్రాంతి తీసుకొనుటయును. భుజమును వెనుకకు త్రిప్పి కొట్టుచు, పిడికిలితో పొడుచుచు, పైకెగర గొట్టి చేతులతో తట్టుచు, కాళ్లతో తన్నుచు, బంతివలె పైకెగురుచు అనేకవిధముల మల్లయుద్ధము చేసినారు. ఇందు "లాగముగొను" ట యొక మల్లబంధ విశేషముగా చెప్పబడినది. సుగ్రీవుడు విరూపాక్షుని యురముపై గొట్టుటతో నెత్తురు గ్రక్కుచు కొండవలె నేల గూలినాడు.

## 5.10 ముష్టి యుద్ధము :

ముష్టియనగా పిడికిలి యని యర్థము. పిడికిలి బిగించి చేయు పోరాటము ముష్టి యుద్ధముగా చెప్పబడును. ఇది నేటి "బాక్సింగ్" (Boxing) వంటిది. నేటి కాలమున బాక్సింగ్‌లో ఉపయోగించునట్టి తొడుగులను మహాబలవంతులగు ఆ కాలమునాటి వీరులు ధరించి యుండలేదు. మల్లయుద్ధమున కంటెను ముష్టి యుద్ధము కొంత అనాగరికము. విచక్షణా రహితంగా కొట్టుకోవడం ముష్టి యుద్ధమున కనబడుతుంది. ముష్టి యుద్ధమున పిడికిలి పోటులతో పాటు అఱచేతి చఱుపులు

1. భాస్కరా.యు. 1508 పద్యం

కూడా ఉంటాయి. రామాయణమున బాహు యుద్ధ, ముష్టి యుద్ధములు వేరు వేరుగా చెప్పబడినవి.

వానర రాక్షస వీరులు చేసిన బాహు యుద్ధమును గూర్చి తెల్పునపుడు వాల్మీకి ఈ విధంగా స్పష్టంగా తెలియజేయును.

"కేచి దస్త్రాణి సంసృజ్య బాహు యుద్ధమకుర్వత"[1]

కొందఱు/ ఆయుధములను విడిచి బాహు యుద్ధమును చేసినారు.

అట్లే ముష్టి యుద్ధమును గూర్చి చెప్పునప్పుడు దానినే స్పష్టంగా చెప్పాడు. అంగద వజ్ర దంష్ట్రులు గదలను విడిచి ముష్టి యుద్ధము చేసిన విషయాన్ని వాల్మీకి ఈ విధంగా చెప్పాడు.

"గదాం త్యక్త్వా తతస్తత్ర ముష్టి యుద్ధ మవర్తత"2

వానర రాక్షస వీరులందఱును ముష్టయుద్ధ ప్రవీణులే. వానరులు నిరాయుధులుగానే తమ ముష్టి ఘాతములతో చాలామంది రాఓసులను యమపురి కంపినారు.

ముష్టి యుద్ధమునకు బయలుదేరుటకు ముందు వస్త్రమును నడుమునకు గట్టిగా బిగించి కట్టుకొనుట గలదు. వాలి సుగ్రీవునితో ముష్టియుద్ధమునకు బయలుదేరు నపుడా విధముగ జేసినట్లు వాల్మీకము వర్ణించినది.

"గాఢం పరిదధే వాసో వాలీ పరమరోషణః[3]

వాలి మిక్కిలి కోపముగలవాడై తన వస్త్రమును గట్టిగా బిగియగట్టెను.

రామాయణమున వర్ణింపబడిన ముష్టియుద్ధాలలో కొన్ని –

### 5.10.1 వాలి సుగ్రీవుల ముష్టి యుద్ధము :

వాలి సుగ్రీవులు ప్రథమ యుద్ధమున పిడుగుల వంటి అఱచేతి చఱపుల చేత, వజ్రాయుధము వంటి ముష్టి ఘాతముల చేత ఒకరినొకరు ప్రహరించు కొనినారు. ఆ యుద్ధమున సుగ్రీవుడు ఓడిపోవుటను రంగనాథ రామాయణ కర్త ఈవిధముగా తెల్పినాడు.

---

1. మూ.రా.యు. 53-23, 2. మూ.రా.యు. 54-27, 3. మూ.రా.కి. 16-16

"వలతియై పోరాడి వాలికి నోడి, బలమేది యాతని బలుముష్టిహతుల
గుల్లల తిత్తియై నిట్టూర్పు లెసగ చెల్లబో నేనేల శ్రీరామునమ్మి
వచ్చితి పదివేలు వచ్చె జాల్నాకు, వచ్చిన త్రోవబోవగవలె ననుచు
మెలకువ చెడి తోకమెడ మీదవైచి, సొలసికెలంకు లజూచుచు పాతి[1]

వాలి యొక్క పిడికిలి దెబ్బలకు సుగ్రీవుడు గుల్లల తిత్తియైనాడు. వచ్చిన త్రోవనే వెళ్ల వలెనని నిశ్చయించుకొని తోకను మెడపైన వేసుకొని బయలుదేరినాడు. తోకను మెడపైన వేసుకొనుట ఓటమికి చిహ్నము కావచ్చును.

ముష్టియుద్ధమున కాహ్వానించుటకై వానరులు ఒక విధమగు ధ్వనిని చేసెడి వారు. కావుననే రాముడు వాలిని ద్వితీయ యుద్ధమున కాహ్వానించుటకై చేయవలసిన విధమును దెల్పుతూ ఇట్లు పల్కును.

"సుగ్రీవ! కురుతం శబ్దం నిష్ప తేద్యేన వానరః"[2]

సుగ్రీవా ! ఏ శబ్దము చేసిన వాలి వెంటనే వచ్చునో అట్టి శబ్దమును చేయుము. అంటాడు.

ముష్టి యుద్ధమునకు బయలుదేరువారు పిడికిలి బిగించి, పైకెత్తి పట్టుకొని ముందుకు నడుస్తారు. ఆ విషయాన్ని భాస్కర రామాయణ కర్త యీ విధంగా వర్ణించినాడు.

చం॥ అటుపొడగాంచి గాఢముగ నర్కజు చూచుచు భూరిముష్టి యు
ద్భట గతినెత్తికొం చరిగి పై బఱతేరగ భానుసూనుడుం
బటుబలశాలి వాలిగని బంధురముష్టి ప్రచండభంగి ముం
దట గనుపట్ట నెత్తికొని తద్దయు బల్విడి జేరెనేపునన్[3]

వాలి సుగ్రీవుని చూచుచు తన పెద్దదైన ముష్టిని పైకెత్తి పట్టుకొనుచు సుగ్రీవున కెదురు వెళ్లినాడు. సుగ్రీవుడు కూడా వాలిని చూచి తన భయంకరమైన పిడికిలి బిగించి పైకెత్తి పట్టుకొనుచు వాలికెదురు వెళ్లినాడు.

వాలిసుగ్రీవుల ముష్టియుద్ధము భయంకరముగా సాగినది. వారు తమ శరీర భాగములపై యథాశక్తిగా పిడికిలి పోట్లతో ప్రహరించు (Punches) కొనినారు.

1. రంగ.రా.కి. - 152 పేజి, 2.మూ.రా.కి. 14-16, 3. భాస్క.రా.కి. 220 పద్యం

పిడికిలి బిగించునపుడు వ్రేళ్లను గట్టిగా చేర్చి పట్టుకొనుటయు గలదు.[1]

ముష్టి యుద్ధమున కాలిత్రొక్కుళ్లతో నేలను దద్దరిల్ల జేయుటయు పెడబొబ్బలు పెట్టుటయు జరుగును. ఆ విషయమును భాస్కర రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

నింగియునేల యుంబగుల నిష్ఠుర భంగి జెలంగి, యార్చుచుం
బొంగి, పదోగ్ర ఘట్టనల భూమి చలింపగ బాఱుతెంచుచుం
జంగమ భూరి శైలముల చాడ్పున జేరుచు ఘోర, మత్త మా
తంగ యుగ క్రమంబుల మదంబున బోరుచు వీకదాకుచున్"[2]

వాలిసుగ్రీవులు నింగినేల పగులునట్లుగా పెదబొబ్బలు పెట్టినారు. కాలి త్రొక్కుళ్లతో భూమి చలించినది. వారిరువురు ప్రాణమున్న కొండలవలె, భయంకరమైన మదపుటేనుగల వలె పోరాటము చేసినారు.

భుజాస్ఫాలనము చేయుట మల్లయుద్ధమందును, ముష్టియుద్ధమందును కనబడును. వాలిసుగ్రీవుల భుజాస్ఫాలన ధ్వనికి "ఖగంబులు మృగంబులు కంచుమంచై పారి"[3] పోయినట్లు రామాభ్యుదయ కర్త వర్ణించినాడు.

### 5.10.2 హనుమద్రావణుల ముష్టి యుద్ధము :

రావణుడు వానర సైన్యముపై విజృంభించి యుద్ధము చేయుటను చూచి హనుమంతుడు వాని నెదిరించినాడు. రావణునకు కోపముగల్గునట్లు తనను గూర్చి చెప్పుకొనెను. ఆ సందర్భమున వారి నడుమ జరిగిన ముష్టి యుద్ధమును రంగనాథ రామాయణ కర్త మనోహరముగా వర్ణించినాడు. రావణుడు ముందుగా హనుమంతుని వక్షమును పిడికిలితో పొడిచినాడు. హనుమంతుడు బాధపడియు లెక్కజేయక "పిడికిట రావణుబెట్టుగా పొడిచినాడు[4] ఆ దెబ్బకు రావణుడు పెనుగాలికి కదలు చెట్టువలె కంపించి మూర్ఛిల్లినాడు. ఆ సందర్భమును రంగనాథ రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

"దనుజాధిపతియు నంతనె మూర్ఛదెలిసి। హనుమంతు జూచి యిట్లను, నీబలంబు గడుమెచ్చవచ్చు నీ ఘనముష్టిహతిని। గడకతో ప్రేతలోకము జూచివచ్చె.

1. మూ.రా.కి - 16-20, 2. భాస్కరా. 180 పద్యం, 3.రామాభ్యు - 5-305, 4. రంగ. రా.యు.338 పేజి

దేవారియనుడు నద్ధీరాత్ముడనియె । రావణ! వినుమీవు ప్రాణంబు తోడ
నున్నవాడ విదేల యురకనాలావు. నన్ను తించెదు లజ్జ జనియింప నాకు
నని పల్కి నీవునన్నటు పిడికిటను, గొను మొనపోటన్న గొనుమనియతడు"[1]

రామణుడు హనుమంతుని పిడికిటి పోటును మెచ్చుకొనినాడు. తాను ప్రేతలోకము చూచి వచ్చినట్లు చెప్పుకొనినాడు. అది విని హనుమంతుడు రావణునితో "నీవు ప్రాణములతోనున్నావు గావున నన్ను మెచ్చుకొనుట తగదు. నా బలము నాకే సిగ్గును గల్గించుచున్నది" యని పల్కును. దీనినిబట్టి హనుమంతుని ముష్టి ఘాతములెంత బలవత్తరము లైనవో తెలియగలదు.

కిష్కింధకాండలో వాలి, మాయావి యను రాక్షసునితో ముష్టి యుద్ధమును చేసినాడు. ఈ యుద్ధమందు ఆయుధ ప్రసక్తి లేదు. కేవలము పిడికిటి పోట్లు, అఱచేతి చరపులు మాత్రమే గలవు. అట్లే కుంభకర్ణుడు అంగదుని ఎదిరించిన సందర్భమున తన ముష్టితో ఆతనిని తెలివి తప్పించినాడు. ఆ విషయాన్ని మూల రామాయణం ఈ విధంగా చెప్తుంది.

"సలబ్ద సంజ్ఞో బలవాన్ ముష్టి మావర్త్య రాక్షస":[2]

బలవంతుడైన ఆ రాక్షసుడు తెలివిని పొందినవాడై పిడికిలి త్రిప్పి పెడచేతితో కొట్టగా అంగదుడు తెలివిదప్పి నేలపైబడెను. వానర రాక్షస వీరులు అనేక ఘట్టములలో చాలామంది ముష్టి ప్రహారములతో బాధించుకొనుట కలదు.

## 5.11 కూట యుద్ధము :

యుద్ధమున విజయము కొఱకై యుక్తులు ప్రయోగించుట, కపటనీతి ననుసరించుట జరుగుచునే యుండును. రాజనీతి యందు కూట యుద్ధము అనుసరింప దగినదే. ఆంధ్ర కామందక కర్త కూట యుద్ధమును ధర్మవద్ధమేయని, భారత యుద్ధంలో జరిగిన సంఘటనను ఉదాహరణగా దెల్పుచూ ఇట్లు పేర్కొన్నాడు.

ఉ॥ ఒక్కట కూట యుద్ధమున నుక్కఱ శత్రు వధించినన్ జయం
బెక్కుడు గల్గి పాపమొక, యించుక పొందదు నిశ్చయంబు, పే

1. రంగ.రా.యు. 338 పేజి, 2. మూ.రా.యు.67-50

రుక్కున ద్రోణసూనుడుఅకొక్క యెడన్నడు రేయి నిద్రమై
జొక్కిన పాండునందనుల జూచి వధింపడె సౌప్తికక్రియన్[1]

ఒక్కొక్కప్పుడు రాజు కూటయుద్ధాన్ననుసరించి విజయమును సాధింప వచ్చునని, ఆ విధముగ చేసినప్పటికి పాపమును పొందదని, ద్రోణపుత్రుడైన అశ్వత్థామ నిద్రించుచున్న ఉపపాండవులను సంహరించినాడు గదాయని ఈ పద్యమున చెప్పబడినది. సామ, దానభేద దండములుగాక మాయ, ఉపేక్ష, ఇంద్రజాల ప్రకారములు రణనీతిగానీ చెప్పబడినవి, యుద్ధమున మాయ ననుసరించుటయు నీతి మాయని ఆంధ్ర కామందకము ఇట్ల తెల్పినది.

సీ॥ "ఘనముగా మాయచేగట్టుట చీకట్లు
పెనువాన లగ్ని కల్పించుటయును
దవ్వున నున్నత ధ్వజములు గలిగిన
సేనల గన్పడ జేయుటయును
దునుకులు మొండెముల్ దుండంబులై బడ్డ
సొరగిన మూకల జూపుటయును
నడరి సముద్రంబు లటు ముంచుకైవడి.
పెల్లుగా వెల్లిగల్పించుటయును
ననగ ఇంద్రజాలంబు లద్భుతముగ
వైరి రాజులు భయమంద వలసి నేర్పు
దనర నొనరించవలయు నుదారలీల
నీతి మార్గం బెఱింగిన నృపవరుండు"[2]

యుద్ధరంగమున చీకట్లు కల్పించుట, నిప్పులు కురింపిచుట మొదలగునవి నీతి మార్గము నెఱిగిన రాజనుసరింప దగినవేయని పై పద్యమును చెప్పబడినది.

రాజు ధర్మయుద్ధం చేయడానికి పరిస్థితులు విరుద్ధంగా ఉంటే కూట యుద్ధం చేయవలెను. వివిధ కూట యుద్ధ పద్ధతులను గూర్చి కౌటిల్యుడు కూడా వివరించాడు[3].

ఇట్టి కపటనీతి రామాయణము నందలి యుద్ధ ఘట్టములలో చాలాచోట్ల కనపడుతుంది. ముఖ్యముగా ఈ కూట యుద్ధ పద్ధతి రాక్షసులయందే కనపడుతుంది.

1. ఆంధ్ర కామందకము – పేజి 11, 2. ఆంధ్ర. కామం. 7-176, 3. కౌటిల్యుని అర్థశాస్త్రం 512 పేజి

కావుననే గరుడుడు రామలక్ష్మణులను నాగపాశముల నుండి విముక్తులను చేసిన తర్వాత ఆతడు వారితో పల్కిన మాటలను వాల్మీకం ఈ విధంగా తెలిపింది.

"ప్రకృత్యా రాక్షసా స్సర్వే సంగ్రామే కూటయోధినః"[1]

రాక్షసులు స్వభావ సిద్ధముగా మాయా యుద్ధము చేయువారని దాని భావము. అంతేగాక ఆ సందర్భమున గరుడుడు పరిశుద్ధమగు మనస్సుగల వారికి, పరాక్రమ వంతులకు ఋజుస్వభావమే బలమని తెల్పుచూ పరోక్షముగా ఋజుస్వభావము గలవారి ముందు మాయలు పనిచేయవనియు రామలక్ష్మణులతో పల్కును.

**5.11.1. రామాయణము నందలి కూట యుద్ధములు - ప్రయత్నములు :**

**(i)** బాలకాండయందు తాటక రామునితో మాయా యుద్ధమే చేసినది. పెద్దయెత్తున ధూళి నెగజిమ్మి తన మాయతో అదృశ్యురాలై రామలక్ష్మణులపైన రాళ్ల వర్షము కురిపించినది. రాముడు తన బాణములతో శిలావర్షము నడ్డగించి దాని చేతులు నఱికినాడు. భాస్కర రామాయణ కర్త రాముడు మాయాస్త్రమును ప్రయోగించి దానిని నివారించినట్లు వర్ణించినాడు[2].

**(ii)** అయోధ్యకాండలో కైక దశరథునకు యుద్ధమున సహాయము చేసి వరములను పొందుటను గూర్చి రంగనాథ రామాయణ కర్త విపులముగా వర్ణించినాడు. ఈ వృత్తాంతము మూల రామాయణమున లేదు. శంబరునితో యుద్ధం చేయుచున్న ఇంద్రునకు సహాయం చేయడానికి వెళ్లిన దశరథునకు కైక సహాయకురాలుగా వెళ్లింది. ఆమెకు ధవళాంగుడను ముని మాయ నెదిరించు విధమును నేర్పియున్నాడు. కావుననే కైక శంబరుని మాయ నణచి భర్తను రక్షించుకొనినది. ఆ వృత్తాంతమును రంగనాథరామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

"పడతుక తొల్లి శంబరుడు నింద్రుండు । దొడరి పోరాడ నింద్రునకునై ప్రీతి
నినుదోడుకొని సైన్యనివహంబుదాను। జని రాత్రి మార్కొన్న శంబరు దోడ
బోరాడ దశరథ భూపాలుమీద । నా రాక్షసుడు మాయ లలుకబన్నుటయు
ధవళాంగుడను ముని దయనీవుగన్న। నవిరళంబగు మాయ నామాయ లడచి
నీ విభు నాదైత్యు నిశితాస్త్ర నిహతి । చావకుండగ గాచి సంప్రీతుజేసి
వసుధేసుచే రెండు వరముల నాడు । మసలక పడసితి మఱిచితే వాని"[3]

ఈ వృత్తాంత విషయాన్ని మంధర కైకతో అన్నది. దీనిని బట్టి మాయా యుద్ధాన్ని ఎదుర్కొనే విద్యలు కూడా రామాయణ కాలంలో ఉన్నట్లు తెలుస్తున్నది.

1. మూ.రా.యు. 50-53, 2.భాస్క.రా.బాల - 265, 3. రంగ.రా.అయోధ్య. 79 పేజి

యుద్ధకాండలో యుద్ధ విజయమునకై మాయను ప్రయోగించుటను గూర్చిన యనేక ఘట్టములు గలవు.

**(iii)** రావణుడు మంత్రాంగమును పూర్తి చేసుకొని రాముని యుద్ధము నందు గెల్చుట కష్టమని భావించి మాయావియగు విద్యుజ్జిహ్వుని పిలిచి సీతను మాయ పుచ్చుటకై తన వెంట తీసుకొని వెళ్లినాడు. ముందుగా తాను సీత వద్దకు వెళ్లి రాముడు ప్రహస్తుని చేతిలో మరణించినాడని పల్కి విద్యుజ్జిహ్వుని పిలిపించి ఆతడు మాయతో నిర్మించిన రాముని శిరస్సును, ధనస్సును చూపించును. ఆ విధముగా సీతను లొంగదీసుకొనవలెనని, రాముని బారినుండి తప్పించు కొనవలెనని యాతడు ఆలోచించినాడు. ఇచట యుద్ధము లేకపోయినను యుద్ధజయమును గూర్చి పన్నిన మాయగా దీనిని చెప్పవచ్చును. రావణుడు వెడలిపోవుటతో ఆ మాయా శిరము, ధనువు అదృశ్యము లైనవి.

**(iv)** అట్లే ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగబంధములతో బంధించిన తరువాత రావణుడు పుష్పక విమానముపై సీతను కూర్చుండబెట్టి ఆ దృశ్యములు చూపింపజేయును. రామలక్ష్మణులు మరణించిరని తెలిపినచో సీత తనకు లొంగి పోవునని తద్వారా యుద్ధ విజయమును సాధింపవచ్చునని ఆతడు తలచినాడు.

**(v)** ప్రహస్తాది రాక్షసవీరులు మరణించిన తరువాత కుంభకర్ణుడు యుద్ధమునకు బయలుదేరుటకు సిద్ధపడినపుడు మహోదరుడను వాడు తన బలము తఱిగిపోవుచు శత్రుబలము వృద్ధి చెందుచున్నప్పుడు బలమును చూపుట నీతికాదని కపటనీతియే అనుసరింప దగినదని పల్కును. ఆతడు రావణున కొక ఉపాయమును బోధించును.

"మేము మా శరీరములకు రామ నామాంకితములైన బాణములతో గాయములు చేసుకొని రక్తసిక్త గాత్రులమై వచ్చెదము. మేము రామలక్ష్మణులను భక్షించితిమని పల్కుచు నీ పాదములు పట్టుకొందుము. నీవు మాకు అనేక బహుమానముల నిచ్చి ఒక రాక్షసుని ఏనుగుపై నెక్కించి రామలక్ష్మణులు యుద్ధమున హతులైనారని చాటింపుము. నీవును విజయమును పొందినట్లు నటించుచు దాసదాసీ జనములకు బహుమానములనిమ్ము. ఈ వార్త సీతకు చేరిన తరువాత నీవు ఆమె వద్దకు పోయి ఓదార్చి ఆమెను ధనధాన్యాదులనిచ్చి లోభ పెట్టుము.

"నైరాశ్యాత్ స్త్రీ లఘుత్వాచ్చ త్వద్వశం ప్రతి పత్స్యతే"[1]

---

1. మూ.రా.యు. 64-33

నైరాశ్యము వలనగాని లేక లఘుత్వముచే గాని సీత నీకు స్వాధీనమగును. ఆ విషయము తెలిసిన రాముడు యుద్ధమును విరమించును. దీనివలన యుద్ధ జయము, సీత రెండును లభింపగలవు" అని పల్కును. కుంభకర్ణుడు రాక్షసుడై యుండియు యీ కపటోపాయమును నిరాకరించుట విశేషము.

**(vi)** వజ్రదంష్ట్రుడను రాక్షసుడు "పరాకు పడక ఉపాయములను ప్రయోగించువాడే శత్రువులను జయింపగలడ"ని రావణునకొక కపటోపాయమును దెల్పును.

"కామరూప ధరులైన రాక్షసులు కొన్నివేల మంది మనుష్యుల ఆకారములు ధరించిన వారై రాముని వద్దకు పోయి ఎంతమాత్రము తొట్రుపాటు చెందక రామునితో "నీ తమ్ముడు భరతుడు పంపగా వచ్చినామని చెప్పవలెను. అప్పుడు రాముడు వానరసేనను విడిచి ఈ సేనతోమనపైకి రాగలడు. అంత మనము వివిధ ఆయుధములతో వానరసేన యున్న చోటికి పోయి వారిని సంహరించుదము. ఆ తరువాత రామలక్ష్మణులును మన చేతిలో ప్రాణములు విడిచెదరు"[1] అని తెల్పెను.

**(vii)** ఎక్కువగా ఇంద్రజిత్తు ఇట్టి కపటోపాయముతోనే యుద్ధము చేయుట కన్పట్టును. రామలక్ష్మణులను నాగపాశ బద్ధులను చేయు సందర్భమున నాతడు అదృశ్యుడై రామలక్ష్మణులపై బాణములను ప్రయోగించినాడు. నాగాస్త్ర బంధములతో వారిని బందించినాడు. ఇంద్రజిత్తు ఉనికిని గూర్చి తెలుసుకొనుటకై నీలుడు, అంగదుడు, వినతుడు, శరభుడు, ఋషభుడు మొదలగు వారిని రాముడాజ్ఞాపించగా వారు ఆకాశమున ప్రవేశించినను ప్రయోజనము లేకపోయినది. రామలక్ష్మణుల శరీరములు పూర్తిగా బాణములతో నిండియుండుటను చూచి సుగ్రీవుడు భీతి చెందినాడు. అప్పుడు విభీషణుదాతనికి ధైర్యము చెప్పి.

"తతస్సలిల మాదాయ విద్యయా పరిజప్యచ
సుగ్రీవ నేత్రేధర్మాత్మా సమమార్జ విభీషణః"[1]

తరువాత నీటిని తీసుకొని మంత్రములతో జపించి సుగ్రీవుని నేత్రములను తుడిచినాడు. అప్పుడు సుగ్రీవుడు ఇంద్రజిత్తును చూడగల్గినాడు. మాయను నివారించుటకు మరల మాయయే ప్రయోగించుటయు నిందు కనబడును.

---

1. మూ.రా.యు. 8-13 నుండి 15 శ్లో॥, 2.మూ.రా.యు. 46-35

**(viii)** ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపలేక పోవుటకు విచారించిన రావణుడు "పలుమఱు చెప్పనేల ? నిను పంపుట ఊరక వచ్చుచుంటకే" 'త్రుంపుము పొమ్ము, జయించి రమ్మోగిన్'[1] యని ఆజ్ఞాపించి పంపినాడు. అంతట ఇంద్రజిత్తు యుద్ధమునకు బయలుదేరుటను భాస్కర రామాయణ కర్త ఇట్లు దెల్పినాడు.

మ॥ అనినన్ రావణి తండ్రి వీడుకొని మున్నాకుంభకర్ణాది, వీ
రని కాయంబులు గూలె నింక ననిలో రాముం దదీయానుజున్
ఘన బాహాయుగ శక్తి గెల్వగ నశక్యం బంచు మాయాబలం
బున నోడింపగ నుత్సహించి కదలెన్ భూరి ప్రతాపంబునన్" [2]

నికుంభిల యాగమును నిర్విఘ్నముగ నెఱవేర్చుకొనుటకై మాయా సీతను కల్పించి రథము నందుంచుకొని యుద్ధరంగమునకు వెడలినాడు. హనుమంతుడు చూచుచుండగనే మాయా సీత శిరమును ఖండించినాడు. ఇంద్రజిత్త ఆలోచనలకు తగినట్లుగనే హనుమంతుడు దుఃఖితుడై వానర వీరులతో రాముని వద్దకు తిరిగి వెళ్లినాడు. ఇంద్రజిత్తు యుద్ధ విజయమును గల్గించు నికుంభిలా యాగము చేయుటకు వెళ్లినాడు.

ఇచట మాయా సీతను గల్పించుట ద్వారా ఇంద్రజిత్తు రెండు ప్రయోజనములను సాధించినాడు. మొదటిది రాముని మరియు వానరసేను నిర్వీర్యులను జేయుట, రాముడు సీత మరణించిన దుఃఖమున యుద్ధ కార్యమునుండి విముఖుడై, కలత చెందిన వాడగుచుండగా ఆతనిని సులభముగా జయింప వచ్చును. రెండవది అజేయమగు శక్తిని ప్రసాదింపగల నికుంభిలా యాగము నిర్విఘ్నముగా నెఱవేర్చుకొని తద్వారా రామలక్ష్మణులను సులభముగా జయింపవచ్చును. అతని ప్రయత్నము తాత్కాలికముగా ప్రయోజనము పొందినదైనను పూర్తి ఫలితము నీయలేదు.

**(ix)** రావణుడు కపటనీతిలో అందెవేసిన చేయి. హనుమంతుడు లక్ష్మణుని పునర్జీవితుని చేయుటకై రెండవమారు ద్రోణాద్రికి సంజీవకరణిని దెచ్చుటకై వెడలినపుడు అతనికి విఘ్నము గలిగించుటకై కాలనేమియను రాక్షసుని నియోగించినాడు. కాలనేమి కపటమునిగా హనుమంతుడు వచ్చు మార్గమున నుండి ఆతనిని చంపదలచి అచ్చట నొక మహామకరిగల సరోవరమున నీరు త్రాగుటకు దిగునట్లుగా జేసినాడు. ఆ

1. భాస్క.రా.యు. 1279 పద్యం, 2. I bid... 1280 పద్యం

ప్రయత్నము విఫలమగుటతో పక్షి రూపము, సింహరూపము ధరించి హనుమంతు నెదరించినాడు. పిమ్మట సుగ్రీవుని రూపమున వచ్చి లక్ష్మణుడు మూర్ఛదేటినాడని ఓషధు లక్కఱ లేదని పల్కును. హనుమంతుడు ఆతని మాయా జాలమున చిక్కక ఆతని శిరమును ఖండించి ఓషధిపర్వతమును తీసుకొని బయలుదేరినాడు. మార్గమధ్యమున హనుమంతుని రావణ ప్రేరితుడైన మాల్యవంతుడు ఎదరించి ఆతని చేతిలో మరణించినాడు.

## 5.12 ఆకాశ యుద్ధము :

మహాభారత యుద్ధంలో కంటే రామాయణంలో కనిపించే ప్రత్యేక యుద్ధము ఆకాశ యుద్ధము. వానర రాక్షసులలో పెక్కమంది ఆకాశ యుద్ధంలో ప్రవీణులైన వారే. ఆ కాలమున రావణుడు, ఇంద్రజిత్తు, అక్షకుమారుడు వంటి మహావీరులకుగల దివ్యరథములు ఆకాశమునందును ప్రయాణము జేయగలవి. రావణుడు సీతనపహరించుకొని తీసుకొని వచ్చునప్పుడు ఆకాశమార్గమున ప్రయాణించు దివ్య రథముపైననే ఆమెను తెచ్చినాడు. పుష్పక విమానము ప్రత్యేకముగా ఆకాశ యానమున కుపకరించునట్టిది.

భరద్వాజ మహర్షి వేదములను మథించి యంత్ర సర్వస్వమును సాధించినాడు. అందలి నలుబదియవ ప్రకరణములో "విమాన ప్రకరణాన్ని" తెల్పినాడు.

పృథి వ్యప్స్వంతరిక్షేషు । ఖగవద్గొ గతస్స్వయం
యస్సమర్థో భవేద్గన్తుం । స విమాన ఇతి స్మృతః[1]

భూమి, ఆకాశము, జలములందు పక్షివలె వేగముగా సంచరించు శక్తిగలదానిని విమానమనెడి వారు.

అట్టివిమాన రథాదులు లేకుండగనే వానర రాక్షసవీరులు ఆకాశమున నిలిచి యుద్ధమొనరించినారు. అందులకు రామాయణమున అనేక ఉదాహరణలు గలవు.

### 5.12.1 హనుమంతుడు చేసిన ఆకాశ యుద్ధం :

---

1. శ్రీమద్వాల్మీకి రామాయణం - చందూరి వెంకట సుబ్రహ్మణ్యంగారు పేజి 35

సుందరకాండలో అశోక వనాన్ని నాశనం చేసిన తరువాత హనుమంతుడు ఆకాశమున నుండియే ఎక్కువ భాగం యుద్ధాన్ని చేశాడు. మంత్రి పుత్రులు హనుమంతుని బాణ వర్షముతో కప్పిచవేయగా అతడు చేసిన ఆకాశ యుద్ధాన్ని వాల్మీకి ఇట్లు వర్ణించాడు.

"సతైః క్రీడన్ధనుష్మద్భిః వ్యోమ్ని వీరః ప్రకాశతే
ధనుష్మ ద్భిర్యధా మేఘై ర్మారుతః ప్రభురమ్బరే[1]

ఇంద్ర ధనుస్సులతో కూడిన మేఘములతో వాయుదేవుడు ఆకాశమునందు ఆడుకొనుచున్నట్లు హనుమంతుడు ధనుర్ధారులైన మంత్రి పుత్రులతో ఆకాశమునందు క్రీడించెను.

అట్లే అక్ష కుమారుని రథము ఆకాశమునందును సంచరింపగలదు[2]. అక్షకుమారుడు ప్రయోగించిన బాణములను తప్పించుకొనుచు హనుమంతుడు ఆకాశమున సంచరించినాడు. హనుమంతుడు అక్షుని రథమును, రథాశ్వములను విఱుగునట్లు చేయగా అతడు ఖడ్గమును ధరించి ఆకాశమున కెగిరినాడు. దానిని వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

"సతం పరిష్వజ్య మహారథో రథం
సకార్ముకః ఖడ్గధరః ఖముత్పతన్
తపోభి యోగా దృషి రుగ్ర వీర్యవాన్
విహాయదేహం మరుతామివాలయమ్[3]

తన తపః ప్రభావముచేత స్వర్గ లోకమునకు ఎగిరి వెళ్లుచున్న ఋషివలె నాతడు కనబడినాడు.

హనుమంతుడు ఆకాశమునందు సంచరించుచున్న అక్ష కుమారుని వద్దకు మెల్లగా వెళ్లి ఆతని పాదములను బట్టి అనేక పర్యాయములు విసురుగా త్రిప్పి త్రిప్పి నేలమీద వేసి కొట్టి చంపినాడు.

**5.12.2. జటాయు రావణుల ఆకాశ యుద్ధం :**

జటాయు రావణుల మధ్య జరిగిన ఆకాశ యుద్ధాన్ని వాల్మీకి విపులంగా వర్ణించాడు. రావణుని రథము ఆకాశగమనముగలది. రావణుడు తన రథముపై సీతను తీసుకొని వెళ్లుచుండగా జటాయువు అడ్డుపడినాడు. ఆతని రథమును నేలగూల్చి

1. మూ.రా.యు. 45-10, 2. మూ.రా.సుం. 47-5, 3. I bid... 47-33

నాడు. రథము విఱిగిన తరువాత కూడా రావణుడు సీతను తీసుకొని ఆకాశమున కెగిరినాడు. ఆకాశమునందే రావణుడు ముహూర్త కాలము యుద్ధముచేసి తన ఖడ్గముతో అతని ఱెక్కలు నఱికినాడు.[1]

### 5.12.3. శతబలి, శతమాయుల ఆకాశయుద్ధం :

శతమాయుడు గరుత్మంతుని వలె ఒక ఘటుఖడ్గమును, పెద్ద పరిఘను తీసుకొని చటుల వేగముతో పైకెగిరినాడు. శతబలియు నొక కత్తిని ఒక బ్రద్ధపఱియను తీసుకొని ఆకాశమున కెగిరినాడు. బ్రద్దపఱియ అనగా పేముతో తయారైన డాలు. వారి ఆకాశ యుద్ధమును రంగనాథ రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

"పటు ఖడ్గమును పెద్ద పరిఘయు గొనుచు। చటుల వేగంబున శతమాయుదెగయ
పరవశంబున వాలు పడియున్న బ్రద్ద। పఱియనుగొని శతబలియు తో నెగసె
నెగసి భేరుండంబు లెడ రెండు గలిసి। యొగిపోరు తెఱగున నురువడి మిగుల
వ్రేయుచు దిరుగుచు వెసదప్పుకొనుచు । పాయుచుడాయుచు పాటవంబొప్ప
గెరలుచు తేరుచు గ్రించు మీదగుచు । పొరిపొరి నాకసంబున పోరుతఱిని
శతమాయుడడిదంబు జళిపించి పూన్చి । శతబలి విపులవక్షం బేయుటయును
సరభసుడై యప్డు శతబలి బ్రద్ధ । పఱిదప్ప నొడ్డి కృపాణోగ్ర ధార
చలమున దెగవ్రేసె శతమాయుతొడలు । తలక్రిందుగా వాడు ధరమీద బడగ"[2]

శతబలి శతమాయుల యుద్ధం పూర్తిగా ఆకాశంలోనే జరిగింది. ఇరువురు ఖడ్గ యుద్ధాన్ని వివిధ పద్ధతులలో చేసినారు. శతబలి తన పదునైన ఖడ్గముతో శతమాయుని తొడలను తెగవ్రేయగా వాడు ఆకసమునుండి తలక్రిందులుగా నేలపై బడినాడు.

ఇంద్రజిత్తు రథముతో సహాదృశ్యుడై ఆకాశమున నుండి యుద్ధమును చేసినాడు. వానరులలో హనుమంతుని వంటి మహావీరులు ఆకాశమున నిలిచి యుద్ధము చేసినారు.

### 5.13 రాత్రి యుద్ధము :

సాధారణముగా యుద్ధము సూర్యుడస్తమించగనే విరమించబడు చుండును.

1. మూ.రా.అరణ్య 51-42, 2. రంగ.రా.యుద్ధ. 327 పేజి

యుద్ధ విరామ సూచకముగా నగారాలు మ్రోగించుట వంటివి జరుగుచుండును. చీకటి వలన సందిగ్ధత ఏర్పడును. అందువలన యోధులు తమవారిని తామే చంపుకొనుటయు జరుగును. కావుననే రాత్రి యుద్ధము నిషిద్ధమైనది. మహాభారతం కూడా రాత్రి యుద్ధాన్ని నిషేధించినది. కానీ ద్రోణుని నాయకత్వంలోని నాల్గవనాటి రాత్రి దీపాల వెలుగులో యుద్ధం జరిగింది రథానికి ఐదు, ఏనుగునకు మూడు, గుఱ్ఱానికి ఒకటి వంతున కరదీపికలను కౌరవులు ఏర్పాటుచేసుకొనినారు.[1]

వానర రాక్షస వీరులకు మధ్య రెండుమార్లు రాత్రి యుద్ధం జరిగింది. రామరావణ యుద్ధం ఏడు అహోరాత్రులు జరిగినట్లు తెలుగు రామాయణములు వర్ణించినవి.

(i) ప్రథమ యుద్ధం :

మొదటి దినమున వానర రాక్షసులకు జరిగిన యుద్ధము సూర్యాస్తమయానంతరమును సాగినది. ఆ విషయమును వాల్మీకి ఇట్లు తెల్పినాడు.

"అన్యోన్యం బద్ధవైరాణం ఘోరాణాం జయమిచ్ఛతామ్
సంప్రవృత్తం నిశాయుద్ధం తదావానర రక్షసామ్[2].

పరస్పరము జయమును గోరుచున్న ఆ భయంకరులగు వానర రాక్షసుల నడుమ రాత్రి యుద్ధము జరిగినది.

ఆ అంధకారమున వానరులు, రాక్షసులు ఒకరినొకరు గుర్తింపలేని వారై తమ పక్షము వారినే చంపుకొనుట జరిగినది. అంధకారమున జరిగిన భయంకర యుద్ధమును రంగనాథ రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

"ప్రొద్దుగ్రుంకిననైన బోవకచలము । పెద్దయై కపులును బేర్చి రాక్షసులు
నతినిబిడంబైన యందకారమున । నతిభయంకరమైన యనిసేయునపుడు
పొడు పొడుడన్మాట పోకుడన్మాట । విడువిడు డన్మాట వ్రేయుడన్మాట
చలముడింపక చంపుచంపుడన్మాట । తొలగక తలద్రుంచుత్రుంచు డన్మాట
యిందు రాలేదేడి యేడి యన్మాట । యిందురానిమ్ము రానిమ్మనుమాట
అటమీద హుంకృతుల్ హాసముల్ చెలగ – నిటుచెల్లుమాటల యెక్కువ లెటిగి

1. మహాభారతం – ద్రోణ – 5–144, 2. మూ.రా.యు. 44–2

పోరుచోఁ గెందూళి భోరున నెగయ । పేర్చి యా చీకటి పెద్దయొౌటయును
భ్రమయుటజేసి యేర్పఱుపంగరాక । తమతమ వారల తామె చంపుదురు"[1]

ఆ సమయమున రాముడు అగ్నిజ్వాలలవంటి బాణములను ప్రయోగించి దిక్కులను, విదిక్కులను కాంతిమంతములను చేసినాడు[2]. ఆ చీకటి యందు కూడ రాముడు బంగారు పింజలు గల వేలాది బాణములను ప్రయోగించగా ఆ రాత్రి మిడుగురులచే శరత్కాలపు రాత్రివలె ప్రకాశించినది. ఆ రాత్రి యుద్ధముననే ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశ బద్ధులను చేసినాడు.

**(i) రెండవ రాత్రి యుద్ధము :**

హనుమంతుడు ఓషధి పర్వతమును తెచ్చిన పిమ్మట రామలక్ష్మణులు గాయములు తొలగిన వారైనారు. మరణించిన వానరవీరులు నిద్ర మేలుకొనినట్లుగా పునర్జీవితులై లేచినారు. అప్పుడు యుద్ధనీతి విశారదుడగు సుగ్రీవుడు రామునిజూచి కుంభకర్ణుడాదిగా గల వీరులు మరణించినారు. కావున లంక నాక్రమించుట తగునని పల్కుటను భాస్కర రామాయణ కర్త ఇట్లు తెల్పినాడు.

అ॥ వె॥ కాన నేటి రాత్రి కాకుత్థ్స కులవీర । కపులనెల్ల లంకగాల్ప బనుపు
మనిన వానరేంద్రుదట్ల నియోగించె । సకల వృక్షచరుల సమ్మదమున[3]

ఉ॥ అంత నిశాచరేంద్రు పురమంతయు గాల్వప్లవంగ వీరుల
త్యంత కుతూహలంబున దినాంతముగోరగ నంతరిక్షగో
ళాంతర వీధి శోభిలుచు నంబుజబంధుడు వారుణాంబుధి
ప్రాంతము సేరె జక్కవలు పశ్చిమ భాగము సూడనోడగన్[4]

బలవంతులైన వానరశ్రేష్ఠులు కొఱవులు చేతబట్టి ప్రాకారములనెగబ్రాకిరి. అన్నివైపుల నుండి తఱుమగా నగర ద్వారముల చెంత కావలియున్న రాక్షసులు పరుగెత్తిరి అంతట వానరులు లంకలోనికి ప్రవేశించి వేలాది రాక్షస గృహములను తగులబెట్టిరి. అశ్వశాలలు, గజశాలలు, ధనాగారములు, రాజభవనములు అన్నియు తగులబడినవి. ముహూర్త కాలములో ఆ మహాపురి ప్రళయ కాలమున మండు భూమివలెనైనది. స్త్రీల ఆర్తనాదములు పది యోజనముల వఱకు వినబడినవి. ఆ రాత్రి సమయముననే

1. రంగ.రా.యు. 311 పేజి, 2. మూ.రా.యు.44-22, 3.భాస్క.రా.యు.1130, 4. Ibid... 1131

రాముడు తన దునుర్విద్యా నైపుణ్యముతో లంకానగర ద్వారమును నేలగూల్చినాడు. వానర వీరులు కొఱవులు చేతబట్టి ద్వారము వద్దకు వచ్చి నిల్చుటను చూచి రావణుడుకోపించినాడు. రావణుడు కుంభకర్ణుని పుత్రులను యుద్ధమునకు పంపినాడు. ఆ రాత్రిని వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

"తత్ర తారాధిపస్సాభా తారాణాంచ తథైవ చ

తయో రాభరణస్థాచ బలయోర్ద్యా మభాసయన్[1]

అప్పుడుదయించిన చంద్రుని కాంతి, నక్షత్రముల కాంతి, ఉభయ సైన్యములు దాల్చిన ఆభరణముల కాంతులును అకాశమును ప్రకాశింపజేసినవి.

రామరావణులు సప్త అహోరాత్రములు యుద్ధము చేయుటను భాస్కర రామాయణ కర్త ఈ విధముగా విర్ణించినాడు.

"ఒక్క నిమిషార్థంబునుడుగక, నిద్రాది వ్యవహారంబుల నొందక క్రమక్రమప్రవర్థమాన భుజలాఘవులై సప్తాహోరాత్రంబులు సమరంబు సలిపిరి"[2]

వాల్మీకి ఈ విషయమును మరియొక విధముగా ఇట్లు వర్ణించినాడు.

"నైవ రాత్రం నదివసం । నముహూర్తం నచ క్షణమ్

రామరావణ యోర్యుద్ధం విరామ ముపగచ్ఛతి[3]

రాత్రిగాని, పగలుగాని, ఒక ముహూర్త కాలముగాని, ఒక్క క్షణకాలము గాని రామరావణుల యుద్ధమునకు విరామము గలుగలేదు.

**5.14 ఇతర యుద్ధములు :**

వానరులు, రాక్షసులు ఆయుధములతోను, ఆయుధములు లేకుండగను చేసిన విశేషమైన యుద్ధము లనేకములు గలవు. మచ్చునకు కొన్ని

**5.14.1 హనుమంతుడు పరిఘతో చేసిన యుద్ధం :**

వానర రాక్షస వీరులకు సంబంధించిన ప్రథమ యుద్ధం సుందరకాండ లోనే ప్రారంభమైతుంది. హనుమంతుడు రావణునిచే పంపబడిన ఎనుబది వేల కింకరులతో చేసిన యుద్ధమే మొదటిది. ఈ యుద్ధమును హనుమంతుడు రామ లక్ష్మణులకు, సుగ్రీవునకును జయము పల్కి ప్రారంభించినాడు[4]. ఈ యుద్ధమున

1. మూ.రా.యు. 75-50, 2. భాస్కర.రా.యు. 2129, 3. మూ.రా.యు. 111-37, 4. మూ.రా.సుం. 42-33.

రాక్షసవీరులందఱు ముద్గర, పట్టిస, శూల, తోమరాది ఆ యుధములు ధరింపగా హనుమంతుడు ఆ ఉద్యానవనపు ముఖద్వారమునకు గల భయంకరమైన ఇనుప గడియను తీసుకొనినాడు. తన శరీరమును చాలా పెద్దదిగాజేసి లంకా పట్టణము మారుమ్రోగునట్లు జబ్బలు చఱచినాడు. యుద్ధోత్సాహ సూచకముగా యోధులు జబ్బలు చఱచుట పెక్కుచోట్ల కనబడును. రాక్షస వీరులను చూచి హనుమంతుడు తోకను నేలకు గట్టిగా కొట్టినాడు. యుద్ధమునకు ప్రత్యర్థులను కవ్వించుటకై వానరులు చేయు పనిగా దీనిని భావింప వచ్చును.

కింకరుల వధనుగూర్చి భాస్కర రామాయణ కర్త ఈ విధంగా వర్ణించినాడు.

"తోరణ నిక్షిప్తంబైన, దుర్భర భారక్రూరాయస పరిఘమును గొని ఘోరనిశాచర బలమును గూలమోదినాడు"[1].

### 5.14.2. హనుమ నికుంభుల యుద్ధం :

హనుమంతుడు నికుంభుని నేలకు కొట్టి ఆతని ఱొమ్ముపై కూర్చుండి మెడత్రిప్పి చేతులతోనే ఆతని శిరమును త్రుంచినాడు. ఆ విషయమును భాస్కర రామాయణ కర్త ఇట్లు తెల్పినాడు.

ఉ॥ నెట్టన వాయుసూతి రజనీచరు నుద్ధతి బట్టి నేలతో
బిట్టుగవ్రేసి యెమ్ములు విభిన్నములైపడ మేను నుగ్గుగా
మెట్టుచు ఱొమ్ముపై నిలచి మించివడిన్ మెడద్రిప్పి చేతులం
దట్టి శిరంబుద్రుంచి సముద్రగ్రత నార్చెననూన తేజుడై[2]

ఇది నేటి కరాటే యుద్ధములోవలె చేతిని కత్తిలాగా చేసి కొట్టుటవంటిది.

### 5.14.3. కుంభకర్ణుడు చేసిన భయంకర యుద్ధము :

కుంభకర్ణుడు అసాధారణ శరీరంగలవాడు. ఆతని చేతి శూలాయుధం కూడా అసాధారణమైనదే. ఆ శూలము సహస్ర భారాయస కల్పితము అనగా వేయి బారువుల ఇనుముతో చేయబడినది. వానరులు విసరిన చెట్లు, కొండలు, మొదలగు వానిని ఆతడు దానితోనే నివారించినాడు. శూలముతో వానరులను గుదులుగా గ్రుచ్చినాడు. ఆతడుపయోగించిన మరొక ఆయుధము గద. గదతో ఒక్కొక్క దెబ్బను

1. భాస్క.రా.సుం.354, 2. భాస్క.రా.యు. 1230

వందల, వేల సంఖ్యలో వానరులను నేలగూల్చినాడు. కొందఱు వానరులను కౌగిటలో చదియజేసినాడు. కొందఱను మ్రింగివేసినాడు.

అతని భయంకర యుద్ధమును భాస్కర రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

"ఒక్కొక్క వ్రేటునంబుడమి నొక్కట నూఱువేలు మొత్తముల్
క్రిక్కిరియం బడల్పడ బొరిన్ గదవ్రేయుచు బాహువీధికిన్
జిక్కినఁ గౌగిటంజదియ జేయుచు మ్రింగుచు విక్రమింపగా
నక్కడ నిక్కడన్ నిలిచి రత్తఱి గుంపులుగట్టి వానరుల్[1]

అతడు పాతాళ సన్నిభమైన తన కంఠబిలమున వానరులను దిగ్వైచి మ్రింగుచున్నప్పుడు కొందఱు తప్పించుకొని ముక్కు రంధ్రములనుండి, చెవి రంధ్రముల నుండి బయటకు రాగా వారిని కాళ్లతో నేలకు త్రొక్కిచంపి యుద్ధభూమిని రక్తమాంసములతో భయంకరమైనదిగా చేసినాడు. అతనిని రామలక్ష్మణులు కాళ్లు, చేతులు, కంఠము వేరువేరుగా బాణములతో నఱికి సంహరించినారు.

రామాయణంలో అసాధారణ దేహులైన విరాధ, కబంధులును అసాధారణ పోరాటాన్నే చేసినారు. అతికాయుడును కుంభకర్ణుని వంటి పెద్ద శరీరము గల వాడైనప్పటికి అతని యుద్ధము కుంభకర్ణునికి వలె అనాగరికమైనదిగాదు.

**5.14.4. నీల ప్రహస్తుల యుద్ధము :**

నీలుడు వానరుల సర్వసైన్యాధిపతి. ప్రహస్తుడు రాక్షసుల సర్వ సైన్యాధిపతి. ప్రహస్తుడు తన మంత్రులతో సహా బయలుదేరి రథముపై నెక్కి వానర సేనను తన బాణములతో చీకాకు చేసినాడు. అంతట నీలుడొక పెద్ద తాటి చెట్టును తీసుకొని దానితో అతని రథమును నుగ్గు చేసినాడు. అప్పుడు ప్రహస్తుడు ముసలాయుధమును ధరించి నీలు నెదిరించుటను భాస్కర రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

"అసమునసట్లు పోరు సమయంబున రక్కసుడల్కతో మహా
యసముసలంబు హేమవలయద్యుతు లారగద్రిప్పి వీకమై
నొసలవియంగ వ్రేయ గడునొచ్చియు నాతడు వానిగ్రమ్మఱన్
వసమఱచేతి వృక్షమున వక్షము బల్విడివైచె నార్చుచున్[2].

1. భాస్క.రా.యు. 922, 2. భాస్కర.రా.యు. 757

ఆ ముసలాయుధము బంగారుకట్ల గలది. కావుననే అది త్రిప్పుచుండగా బంగారు కాంతులు వెదజల్లబడినవి. ప్రహస్తుడు దానితో నలుని ముఖముపై కొట్టగా నాతడు గాయపడియు లెక్కసేయక తన చేతి వృక్షముతో నాతని వక్షమును కొట్టినాడు. ప్రహస్తుడును ఇనుప రోకలిని రెండు చేతులతో గట్టిగా పట్టుకొని నీలుని కొట్టబోగా ఆతడు ఒక పర్వత శిఖరముతో ప్రహస్తుడని శిరస్సును వ్రక్కలు చేసినాడు.

### 5.14.5. నరాంతకుని యుద్ధము :

రావణ పుత్రుడైన నరాంతకుడు గుఱ్ఱము నధిరోహించి ప్రాసాయుధముతో పోరాటము చేసెను. ప్రాసము ఈటె వంటిది. హలాయుధ కోశమున దీని లక్షణము గలదు.* ప్రాసము ఏడుమూరల పొడవున నుండు వెదురుకు సంబంధించిన కఱ్ఱ. ఇది లోహపు ములికిగలిగి పదునైన అంచులు గలిగి యుండును. దీనిని ప్రయోగించుట యందు నాలుగు దశలు గలవు. అవి 1. ఆకర్షము, 2 వికర్షము, 3 ధూననము, 4. వేధనము, వేధనమనగా చీల్చుట. గోవింద రాజీయమున దీనికి "ఈట్టి" యను ద్రావిడ నామము చెప్పబడినది.

నరాంతకుడు తన ప్రసాయుధముతో ఒక్కక్షణములో ఏడువందల మంది వానరులను చీల్చి వైచినట్లు వాల్మీకము తెల్పుచున్నది.

"సవానరాన్ సప్తశతాని వీరః
ప్రాసేన దీప్తేన వినిర్బిభేద
ఏకః క్షణేనేంద్ర రిపుర్మహాత్మా
జఘాన సైన్యం హరిపుంగవానామ్"[1]

అట్టి నరాంతకుని అంగదుడు పిడికిలితో పొడిచి చంపినాడు.

అట్లే అంగదుడు మహానాధుని తలయొడసి పట్టి..... జఱజఱ త్రిప్పి నేలకు మోది సంహరించినాడు. అంగదుడే మహాకాయుని నెత్తిని అఱచేతితో పగులగొట్టినాడు. ద్వివిదుడు శోణితాక్షుని రూపు తెలియకుండునట్లు నేలపై ప్రామినాడు.

### 5.14.6. అమూలకములైన విచిత్ర యుద్ధములు :

పైన తెల్పినవి గాక అమూలకములైన కొన్ని ప్రత్యేక యుద్ధములను కూడ

---

* ప్రాసస్తు సప్త హస్తస్యాత్ ఔన్నత్యేన తుషైణవః లౌహశీర్షస్తీక్ష పాదః కౌశేయస్త బకాంచితః
ఆకర్షశ్చ వికర్షశ్చ ధూపనం వేధనం తథా చతుస్ర ఏతాగతయః ఉక్తాః ప్రాసం సమాశ్రితాః

1. మూ.రా.యు. 69-70

తెలుగు రామాయణ కర్తలు వర్ణించినారు. అట్టి వానిలో ఖడ్గరోమ, వృశ్చికరోమ, సర్పరోమ, అగ్నివర్ణుల యుద్ధము చెప్పదగినది. వీరి యుద్ధ పద్ధతి చాలా విచిత్రమైనది. ఆశ్చర్యకరమైనది కూడా.

**(i) ఖడ్గరోముని యుద్ధము :**

ఖడ్గరోముడు శరీరమంతట ఖడ్గములవంటి రోమములు గలవాడు. ఇతడును పర్వతాకారుడు. అతి బలోన్నతుడు. రావణ ప్రేరితుడైన ఇతడు హనుమంతు నెదిరించినాడు. తన "రోమశిత ఖడ్గధారల" నొంచినాడు. అతడు తన రోమ ఖడ్గములతో పర్వతములను కూడా ముక్కలు చేయగలవాడని భాస్కర రామాయణ కర్త వర్ణించినాడు. హనుమంతుడు మరియొక పెద్ద పర్వతము నాతనిపై పడవైచి నాతని సంహరించినాడు.

**(ii) సర్పరోముని యుద్ధము**

సర్పరోముడు సర్పములే రోమములుగాగలవాడు. ఆ రోమములందు పాములకు వలెనే విషము కూడ గలదు. ఖడ్గ రోముడు మరిణించిన తరువాత సర్పరోముడు అంగదు నెదిరించుటను మొల్ల ఇట్లు వర్ణించినది.

"రోజి కలన ఖడ్గ రోముండు గూలుట
సర్పరోముడెఱిగి సాహసమున
వాలి సుతుని దాక వాని రోమంబుల
విషము సోకి నొచ్చి వేగదెలిసి"[1]

సర్పరోముని విషము సోకి బాధపడిన అంగదుడు వెంటనే తెలివి తెచ్చుకొని వాని ముక్కుదూలము పగులునట్లు కొట్టి తరువాత తన బాహుదండముతో వాని శిరము చెక్కలై ప్రీలిపడునట్లు చేసెను.

**(iii) వృశ్చిక రోముని యుద్ధము :**

సర్పరోముడు మరణించిన తరువాత వృశ్చిక రోముడు వానర సైన్యము నెదిరించినాడు. ఇతడు వృశ్చికములే రోమములుగా గలవాడు. భాస్కర రామాయణ కర్త ఆతని విజృంభణమును ఇట్లు వర్ణించినాడు.

---

1. మొల్ల రా.యు. 3-38

ఉ॥ వృశ్చిక రోముడంత బరివీత దురాప విషాగ్ని విస్ఫుర
ద్వృశ్చిక రోముడై భయద వేషమునం గపిరాజు సేనలన్
నిశ్చల వృత్తినొంచి యతి నిష్ఠుర శూరత దాకితాకి తే
జశ్చటు లాత్ముడై పఱపు చండ భుజాయుధ దుర్నిరీక్ష్యుడై"[1]

విషాగ్నిచే ప్రకాశించు రోమములు గలవాడగు వృశ్చిక రోముడు భయంకరాకారుడై తన భుజాయుధముతో చూడ శక్యముగాని వాడై వానరసేన నెదిరించినాడు. నీలుడు కోపించి ఆతనిపై ఒక "ఉరుసాల తరువును ప్రయోగింపగా దానిని వృశ్చిక రోముడు" విషరోమ కంటకాగ్రముల ద్రుంచినాడు. మరల నీలుడు భూరిశాఖల నొప్పు బూజంబువెఱికి గొని వచ్చి వాని వక్షోవీధి వ్రేసి... హతజీవు జేసినాడు.

**(iv) అగ్నివర్ణుని యుద్ధము :**

అగ్నివర్ణుడు సాక్షాత్తు అగ్నివర్ణుడే. అగ్నితో సమానమైన వాడే. అతడు యుద్ధానికి వచ్చుటను భాస్కర రామాయణ కర్త ఇట్లు వర్ణించినాడు.

"కల్పావసాన నిష్క్రాంత మహావహ్ని
దానవ రూపంబు దాల్చె నొక్కొ
జగములన్నియు వేడ్క జవిచూడ వచ్చిన
జలపాయిమైన కృశానుడొక్కొ
విశ్వేశుఫాలంబు వెడలి యేతించిన
దర్పకాంతకుడైన దహనుడొక్కొ
దశకంధరోత్కృష్ట దారుణ క్రోధాగ్ని
పరిణాహ గురుపరిపాకమొక్కొ
యనగ రోదోంతరం బెల్ల దనదు గాత్ర
నిర్గతార్చులు దగ్రత నిండి పర్వ

---

1. భాస్కరా.యు. 1988

హరికులాటవి గాల్పంగ నాగ్రహించి
యగ్ని వర్ణుండు చనుదెంచె నార్పులొదవ[1]

ఈ విధముగా బయలుదేరిన అగ్నివర్ణుడు తనమేని మంటలతో విజృంభించినాడు. అతడు తన శరీరపు మంటలతో పర్వతములను కూడ భస్మము చేయగలవాడు. వానిపై రాముడు వారుణాస్త్రమును ప్రయోగించినాడు. ఆ అస్త్ర ప్రభావముతో అగ్నివర్ణుడు నేలగూలుటను రంగనాథ రామాయణ కర్త ఈ విధముగా వర్ణించినాడు.

"కప్పారు మేఘంబు గప్పి యార్భటము । లుప్పొంగ జడివానలుడుగక కురిసె
యలవేడి మంటల నార్చిపెల్లార్చి । ఖలునగ్నివర్ణు నొక్కటనేల గూల్చె[2]

అగ్నివర్ణుని మంటలు వారుణాస్త్ర జలధారలతో నశించి యాతనిని నేల గూల్చినవి.

## 5.15 యుద్ధరంగంలో హోమాలు :

యుద్ధరంగంలో హోమ కార్యాలను నిర్వహించే విధానం రాక్షసుల యుద్ధ పద్ధతులలో కనిపిస్తుంది. రామాయణమున వర్ణింపబడిన యుద్ధ ఘట్టాలలో ఇంద్రజిత్తు యుద్ధరంగానికి బయలుదేరే ముందు హోమ కార్యాల నాచరించడం కనబడుతుంది. ఇవి కూడా క్షుద్ర యాగముల వంటివే. యుద్ధ విజయాన్ని కలిగించునట్టివి. కుటిల నీతితో కూడినట్టివి.

ఇంద్రజిత్తు ప్రథమ యుద్ధమున కేవలం మాయను ప్రయోగించుటయే గలదు. ఆ తరువాత చేసిన యుద్ధము లందన్నిట హోమ కార్యనిర్వహణము జరిగినది.

### 5.15.1. ఇంద్రజిత్తు ద్వితీయ యుద్ధము :

మకరాక్షుడు మరణించిన తరువాత రావణుడు కోపించిన వాడై ఇంద్రజిత్తును యుద్ధమునకు వెళ్లవలసినదిగా ఆజ్ఞాపించినాడు.

ఇంద్రజిత్తు యుద్ధ భూమికి చేరి ఉచిత ప్రదేశమున రథము దిగి కరితురగాది సైన్యముల నియోగించి, అగ్నిని ప్రతిష్టించినాడు. ఆతడు హోమ కార్యము నిర్వర్తించిన విధమును రంగనాథ రామాయణ కర్త విపులముగా వర్ణించినాడు.

---

1. భాస్కర.రా.యు. 1994, 2. రంగ.రా.యు. పేజి 456

"చనుదెంచి రణమహీ స్థలముననిలిచ । ఘనభుజుండత్యంత కౌతూహలమున
రక్త వస్త్రంబుల రక్తమాల్యముల । రక్త గంధంబుల రాజితుండగుచు
వరమంత్రముల హుతవహు ప్రతిష్టించి । శరములు తోమరచయములు వరుస
పరిథులుగా జేసి పలుస్రుక్స్రువములు । కరమర్థి లోహముల్‌గా సంఘటించి
తనలోని నిష్ఠ యుదాత్తమై యొప్ప । దనుజేంద్ర తమయు డథర్వణోక్తముగ
దగనెయ్యిలాజలు దాడి సమిధలు । నొగి వేడ్క వేల్చుచు హోమాంతవేళ
గడిది కృష్ణచ్ఛాగ కంఠరక్తంబు । నడరెడు వహ్ని బూర్ణాహుతి వేల్వ
ననలుండు పొడసూపి హవ్యముల్ గొనియె । ననలునికరుణ బ్రహ్మాస్త్రంబు రథము
ధనువును కవచంబు దద్దయు బ్రీతి। గొనియార్చుటయును దిక్కులు పెల్లగిల్ల"[1]

ఇంద్రజిత్తు ఎఱ్ఱని వస్త్రములను, ఎఱ్ఱని పూలదండలను, ఎఱ్ఱని గంధములను ధరించినవాడై అగ్నిని ప్రతిష్ఠించి బాణములు, తోమరములు మొదలగునవి పరిధులుగాజేసి, తాంగ్ర పుల్లలు సమిధులుగా, ఇనుప స్రుక్స్రువములు సిద్ధము చేసుకొని, నేయి వరిపేలాలను హోమముగావించెను. తరువాత నల్ల మేకను బలియిచ్చి దాని కంఠ రక్తమును పూర్ణాహుతిగా సమర్పించి నాడు. అగ్నిదేవుడు స్వయముగా ప్రత్యక్షమై హవ్యములను స్వీకరించినాడు. దానవ గురూపదిష్టమైన, అథర్వణ తంత్ర విధానమున జరిపిన హోమము పూర్తియైన తర్వాత ఆ హోమ గుండము నుండి వెలువడిన రథమును, ధనువును, కవచమును అగ్నిదేవుని వలన పొందినవాడై, బ్రహ్మాస్త్ర మంత్రములచే వాని నభిమంత్రించి యుద్ధమునకు బయలుదేరినాడు. ఆ రథము నధిరోహించి ఇంద్రజిత్తుమాయా యుద్ధమును చేసినాడు.

### 5.15.2 ఇంద్రజిత్తు తృతీయ యుద్ధము :

మకరాక్షుడు మరణించిన తరువాత రావణునిచే ప్రేరితుడై ఇంద్రజిత్తు ఉత్తర ద్వారము వద్ద రామలక్ష్మణుల నెదిరించుటకై బయలుదేరినాడు. యుద్ధ భూమికి చేరి రథమును దిగి రాక్షస సైన్యమును తన చుట్టును నిలుపుకొన్నవాడై హోమ కార్యమునకు పూనకొనినాడు.

ఈ వృత్తాంతమును రంగనాథ రామాయణ కర్త విపులముగా ఇట్లు వర్ణించినాడు.

---

1. రంగ. రా.యు. 376 పేజి

"గురుతర వేది త్రికోణమై పెద్ద। పరపొంది దక్షిణ ప్రవణమైయున్న
భూరి శ్మశానాగ్ని పొలుపారదెచ్చి। ధీరుడై వేదిలో దీపింపజేసి
రక్త వస్త్రంబులు, రక్తమాల్యములు। రక్త చందన మనురక్తుడై దాల్చి
దండంబు నుపవీత తతియు మౌంజయును। నిండుమనంబుతో నెరయంగబూని
యలవడ నచట ఖట్వాంగ ధ్వజంబు। నిలిపి కపాలంబు నిష్టతో నెక్కి
పరగంగ కంకాళ పరిధిగావించి। తిరముగా దక్షిణదిశ స్రుముక్స్రువంబు
లినుప పాత్రలనుంచి యేర్పడ గృష్ణ। తనుడైన వాని రక్తమును మాంసమును
పొరిపొరి నవినిండబోసి మౌనంబు। ధరియించి యప్పుడథర్వణ క్రమము
దప్పకయుండ మంత్రములుచ్చరించి। చొప్పడ నినుప స్రుక్స్రువములు పట్టి
కమియ పావకుడును గడునొప్ప తాటి। సమిధలు తిలలును సర్షపంబులును
హోమంబు సేయంగ నురుతరంబగుచు। నా మహాధూమ మజాండంబు గప్పె
నాయగ్నిలో నుండి యప్పుడు వేగ। యాయతంబైనట్టి యరదంబు వెలుగ
రయమున నుగ్ర కరాళకేశములు। భయదరూపంబు కపాలపాత్రమును
తళతళమను కోఱదవడలు మెఱయ। మలగకార్చుచు నస్థి మాలిక లలర
నెఱమంట లొలికెడు నేత్రంబు లొప్ప। నుఱకహాసముతోడ నొక కృత్తి వెడలి
పంపుము, పంపుమే పనికైన నన్ను। సొంపారజేసెద సురవైరి యనుడు
నాకృత్తి నడిగి ఇంద్రాది శస్త్రములు। నాకృత్తి గైకొని యాకాశమునకు
నరదంబు తోడనె యరిగి వానరుల। దిరిగి యేయుటకు నదృశ్యుడై యుండె[1]

ఈ హోమకార్యము మొదట దానికంటె మరికొంత పెరిగినది. హోమ గుండము త్రికోణాకృతిలో నున్నది. దానిలోనికి శ్మశానాగ్నిని తెచ్చివేసినారు. ఖట్వాంగ ధ్వజమును నిల్పినాడు. కపాలము నొకదానిని అతడు ఆసనముగా చేసుకొనినాడు. కంకాళములను పరిధులుగా నేర్పఱచుకొనినాడు. దక్షిణ దిశయందేర్పరచిన ఇనుప పాత్రల యందు నల్లని శరీరము గలవాని రక్త మాంసములు నింపినాడు. ఇందును అథర్వణ మంత్రములుచ్చరించుట గలదు. ఇనుప స్రుక్స్రువములే ఉపయోగింప బడినవి. తాటి సమిధలు, తిలలు, సర్షపములు, హోమ ద్రవ్యములుగా వేల్చుట జరిగినది.

---

1. రంగ. రా. పేజి 389

ఆ హోమగుండము నుండి రథ సహితముగా నొక కృత్య వెలువడినది. ఆ కృత్య ఉగ్రకరాళ కేశములు, కపాల పాత్ర ధరించినది. భయంకరమైన కోరలతో ఎముకల దండలతో, మంటలు చిమ్ము కన్నులతో నున్నది. దహన మధ్యమునుండి వెలువడిన ఆ కృత్యను భాస్కర రామాయణ కర్త మరికొంత విపులముగా వర్ణించినాడు.

సీ॥ మృత్యువు జిహ్వతో మేలమాడెడు నసి
దాల్చి కపాల పాత్రంబు వట్టి
బాడబార్చుల బోలు పల్ల వెంట్రుకలును
చండప్రకాశ దంష్ట్రా యుగంబు
మెఱవ మండుచునున్న మిడిగ్రుడ్లు గనలంగ
పెనుపైన పునుకల పేర్లు గలిగి
యట్టహాసమున వియచ్చరులదరంగ
మెట్టిన బుడమియు బిట్టు గ్రుంగ
గృత్య యేతెంచి మాయుగ్ర కృత్యు బలికె
పంపు మెయ్యేది యైననే తెంపు తోడ
నిపుడజేయుదు ననవుడు నింద్రజిత్తు
దేరువడి నెక్కి శక్తితో దివికి నెగసె[1]

ఇంద్రజిత్తు ఆ కృత్యతో సహా నదృశ్యుడై వానరుల పైన బాణ వర్షమును కురిపించినాడు. అవి పిడుగుల కంటె బెట్టిదములైనట్టివి. రాముడు ఇంద్రజిత్తును జయించు మార్గమును గూర్చి ఆలోచించుచుండగా వాయుదేవుడు రాముని వద్దకు వచ్చి "కృత్యను అంగీరసంబైన అమోఘ బాణమున బెడబాపు" మని దెల్పినాడు. పిమ్మట రాముడు ఆగ్నేయాస్త్రముతో కృత్యను పడగొట్టినాడు. ఇంద్రజిత్తు రథముతో సహా భూమికి దిగి వచ్చినాడు.

ఈ కృత్య వృత్తాంతము మూల రామాయణమునందు లేదు.

### 5.15.3. ఇంద్రజిత్తు చతుర్థ యుద్ధము :

ఇంద్రజిత్తు వానర వీరులను గాయపఱచి లంకకేగి మరల రావణ ప్రేరితుడై యుద్ధ భూమికి బయలుదేరినాడు. ఈ పర్యాయము నాతడు హోమ కార్యము చేయించు

1. భాస్క.రా.యు. 1262

నట్టి పురోహితుని కూడ వెంట బెట్టుకొని యుద్ధభూమి కేతెంచినాడు. ఆ హోమ వృత్తాంతమును రంగనాథ రామాయణకర్త విపులముగా వర్ణించినాడు.

"ఎలమితోడన పురోహితుని దోడ్కొనుచు । బొలుపారగా రణభూమి కేతెంచి
చెన్నొంద హోమంబు సేయంగబూని । యున్నంతఁ బరిచారు లొగివేగమునను
బరగంగనరసి కపాలపాత్రికలు । సొరిదినుక్కునసైన స్రుక్స్రువంబులును
శస్త్రంబులును, దాటి సమిధలు రక్త । వస్త్ర గంథాదులు వరుస దెచ్చుటయు
రక్తాంబరములు రక్తమాల్యములు । రక్త గంధంబును రయమొప్పనతడు
ధరియించి మారణ తంత్రమార్గమున । బరువడి దోమర ప్రాసఖడ్గముల
సరిపరిధులు వెట్టి సప్రాణకృష్ణ । హరిణంబు మెడ యస్థియదిపుచ్చుకొంచు
నక్తంచరాధీశు నందనుండెలమి । యుక్తక్రమంబున హోమంబు సేయ"[1]

ఈ హోమ కార్యము నిర్వహించునపుడు ప్రాణముతో నున్న జింక యొక్క మెడ యస్తిని పట్టుకొనుట విశేషము.

హోమాంతమున నాలుగు గుఱ్ఱములతో గూడినది, మనోహరముగా నలంకరింపబడినది, సింహ, అర్థచంద్ర చిహ్నములు గలది, వైఢూర్యమయమైన పడగతో ప్రకాశించునది, బ్రహ్మాస్త్ర రక్షతో అదృశ్యమగునది యగు రథము హోమ గుండము నుండి వెలువడినది.

ఈ యుద్ధమునందును ఇంద్రజిత్తు వానరవీరులను గాయపఱచి విజయ గర్వముతో లంకకు తిరిగి వెళ్ళినాడు. హోమ కార్యములు నిర్విఘ్నముగా నెఱవేరిన యుద్ధములలో ఇంద్రజిత్తుకు విజయమే గల్గినది.

### 5.15.4. ఇంద్రజిత్తు నికుంభిలా యాగం :

ఇంద్రజిత్తు చేసిన నికుంభిలా యాగ వర్ణనయు రంగనాథ రామాయణమున విపులముగా గలదు.

"అని నికుంభిళకేగి యచట నిశాటు । డెనసిన నిష్ఠతో నేపు దీపింప
కల్లు నెత్తురు పాలు ఘనకచ్ఛపముల । బల్లుల పిల్లుల బలుసర్పములను
కారుకోళ్లను మంచిగంధంబు తేనె । నారికేళంబుల నల్లని కోళ్ల

1. రంగ.రా.యు. 393 పేజి

సూకరంబుల మతిసారిదికేశముల । కాకుల తెల్లని గార్ధభంబులను
కాఱెనుపోతుల ఘనమేషములను । నాఱు నాలుగు రెండు నఱువదికరుల
క్రొండగొఱ్ఱెలు వేయి కోటుల లక్ష । మండూకములఁ గోటి మాణిక్యములను
ముత్యంపు చిప్పలు మూడర్బుదముల । కాత్యాయనీ దేవికడ నిష్ఠ నిలపి
మనమున నిగమన మంత్రపూతముగ । ననలుని రుధిరమాంసాదుల దనిపి
హోమంబు సేయుచు నుండె నయ్యెడను"[1]........

ఇచ్చట ఇంద్రజిత్తు క్షుద్రమార్గమున కాత్యాయనీ దేవిపూజను చేసినాడు. రాక్షసులలో తాంత్రిక పూజా విదానమున్నట్లు దీనివలన తెలియుచున్నది.

నికుంభిళా యాగమును పూర్తి చేసినచో ఇంద్రజిత్తును జయించుట ఎవ్వరికినీ సాధ్యమయ్యెడిది కాదు. అతడు దేవదానవుల కజేయుడయ్యెడివాడు. ఆ హోమ కార్య విధానమును ఇంద్రజిత్తు బ్రహ్మను మెప్పించి ఉపదేశమును పొందినాడని విభీషనుడు రామునితో తెల్పినట్లు రంగనాథ రామాయణ కర్త వివరించినాడు.

"బ్రహ్మ మెప్పించి యాపరమేష్ఠి వలన । బ్రహ్మ శిరంబను బాణంబువిల్లు
కవచంబు ఖడ్గంబు కవదొనల్మఱియు । నవిరళ మంత్రపూతాస్త్రముల్వడసి
కామగాశ్వంబును కమనీయ కేతు । భీమంబు మారుతస్థిత వేగంబు
నగురథం బాయగ్ని యందు వెల్వడిన । దగనా రథంబెక్కి ధనువందెనేని
నా వాసవారాతి నాలంబులోన । దేవాసురాదులు దృష్టింపలేరు"[2]

అని చెప్పును. పిమ్మట విభీషణుడు ఇంద్రజిత్తు హోమము చేయుచున్న ప్రదేశమునకు లక్ష్మణుని తీసుకొని వచ్చి ఆ హోమమును చూపి ఇట్లనును.

"పూర్వమీ ఇంద్రజిత్తు ఇచటనే హోమము చేసి భూతములకు బలుల నిచ్చి కోరిక నెఱవేర్చుకొని యుద్ధమున అదృశ్యాకారుడై ఇంద్రు నోడించినాడు. ఇప్పుడీ అగ్నినుండి వెడలు నట్టిదియు, రక్తమాల్యాంబరధారియు, అసితకాయుడునైన సూతునితో, రక్తరుచిరాశ్వములతో అగ్నివర్ణముననున్నట్టిదియు నగు ఆ పెద్ద రథము నెక్కి వచ్చినచో ఈతడజేయుడగు" నని తెల్పును.

ఈ యాగమునకు గల మరొక ప్రత్యేకత యజ్ఞభంగము జరిగినచో యాగ కర్త మరణమును పొందుటయై యున్నది.

1. రంగ.రా. పేజి 396, 397, 2. రంగ.రా.యు. 399 పేజి

### 5.15.5 రావణుని పాతాళ హోమం :

రామరావణుల ద్వితీయ యుద్ధానంతరము రావణుడు కాందిశీకుడై లంకా నగరమునకు చేరి యంతఃపురమున సేదదీర్చుకొనినాడు. రాముని పరాక్రమమునకు భయమును చెందినాడు. యుద్ధరంగమున ఎచట చూచినను రాముడే కన్పించుటను, పిడుగులకంటె భయంకరములగు రాముని అస్త్రములను దలచి విచారమును, ఆశ్చర్యమును చెందినాడు.

రాముని జయింపవలెనన్న భసితాంగరాగ గాత్రుడు, భుజగభూషణుడు అభ్రగంగా సలిలార్ద్ర జటాజూటుడు త్రిపురాంతకుడు. ఆదిమధ్యాంతరహితుడునగు శివుని యనుగ్రహము లేక అసాధ్యమని భావించినాడు. ఆ సమయమున రావణుడు పల్కిన మాటలను భాస్కర రామాయణ కర్త ఇట్లు దెల్పినాడు.

"మునునాడు సంగీతమును మెచ్చి వరమిచ్చె
నగసుతానాథుండు నాకు ప్రీతి
నరులకు నీ వోడునప్పుడు ననుగూర్చి
హోమంబు విధితోడ నొనరజేయ
దివిరి గ్రక్కున నొక్క దివ్యరథంబందు
జనియించు నురుజవాశ్వముల తోడ
కమనీయమగు మహాకవచంబు మాహేశ్వ
రంబగు దివ్యచాపంబు గలుగు
నడుమ విఘ్నంబు గాకుండ నడచెనేని
జయము చేకుఱు ననయంబు సంగరముల
ననియెగావున నేడు నాకట్లు చేయ
వలయు నీపగ దీర్పంగ వలను గలుగ"[1]

రావణుడు మండోదరితో ఈ విధముగా పలికి బ్రాహ్మణులకు అనేక ధనములనిచ్చి రత్నమాల్యాంబరాభరణ యజ్ఞోపవీతాలంకృతుడై పరమేశ్వరాలయమునకు వెళ్లి అచట ఒక వేదిక నిర్మించుకొని రక్షణార్థమై రాక్షసుల నియోగించి హోమ కార్యమును ప్రారంభింప దలచినాడు.

1. భాస్క.రా.యు. 1582

కానీ మండోదరి పల్కిన హితవచనములతో అప్పటికా ప్రయత్నమును విరమించినాడు.

మరల లక్ష్మణుడు ఫంజీవ కరణిచే పునర్జీవితుడైన తర్వాత రాముని ప్రతిజ్ఞను గూర్చి విని కలత చెందినాడు. తమ కులగురువైన శుక్రుని వద్దకు వెళ్లి తన దీనస్థితిని చెప్పుకొనినాడు. అప్పుడు శుక్రుడు పల్కిన మాటలను భాస్కర రామాయణ కర్త ఇట్లు తెల్పినాడు.

"సమరక్షోణి తలంబు నందు బగఱన్ సాధింపగా దివ్యమం
త్రములుం, దంత్రములుం మహౌషదులు, దథ్యం బార నుండంగ నీ
కు మనస్తాపమిదేల యేగలుగ రక్షోనాధ నీ శత్రు సం
ఘము ప్రాణంబులు దాల్చి యాజినిలువంగానోపునే చెప్పుమా!"[1]

యుద్ధ రంగమునందు శత్రువులను జయించుటకు ఆ కాలమున దివ్యమంత్రములు, తంత్రములు, ఓషధులు ఉన్నట్లుగా దీనివలన దెలియుచున్నది. హోమ కార్యము నెఱవేర్చినచో శత్రుజయము గల్గునని చెప్పుటను భాస్కర రామాయణ కర్త ఇట్లు దెల్పినాడు.

"ఉరుతరమైన ధైర్యమున హోమము నీకు సపేత విఘ్నమై
జరిగిన దివ్యఖడ్గశరచాప రథాశ్వములున్ మణిప్రభా
గురుతర విస్ఫుర త్కవచకుండలముల్ ప్రభవించు నగ్నిలో
నరుదుగ వానిదాల్చి విమతాళి జయించెదవీవు నాజిలో"[2]

అగ్నికుండము నుండి దివ్యరథము, దివ్యఖడ్గ శరచాపములు, దివ్య రథాశ్వములు, కవచకుండలములు ప్రభవించునని, వానిని ధరించినచో శత్రు జయము గల్గునని తెల్పును.

ఈ పాతాళ హోమ కార్యక్రమము నిర్విఘ్నముగ సాగుటకై మాయో పాయములను పన్నుటలో శ్రేష్ఠుడైన విద్యుజ్జిహ్వుని రావణుడు తన దగ్గఱ నుంచు కొనినాడు. పాతళ గుహలోనికి ప్రవేశించి ఆతడు చేసిన హోమవిధిని భాస్కర రామాయణ కర్త ఈ విధముగా తెల్పినాడు.

---

1. భాస్క.రా.యు. 1834, 2. I bid.... 1835

"రక్త స్రగను లేపన పటాలంకృతుడై, గంధకుసుమాక్షతార్చితమైన వేదిక యందు యథావిధి ననలంబు ప్రతిష్ఠించి హోమీయంబులగు పాత్రలు సంస్కరించి తత్సమీపంబున నస్త్ర పరిధులు సేర్చి బిల్వ భల్లాతక కరంజంబుల సమిథలు, తత్ఫలంబులును, సర్షపాగురు గుగ్గులు దూర్వలును, దధి మధు ఘృత రక్త సురలును, బ్రవాళపాయస దర్భలును, కాక గృధ్రకంకశ్యేన, కురర భల్ల సర్పంబులును, ఛాగ మీన మకర కచ్ఛప మేషంబులును ధాతు రసంబులును, గర్పూర కుంకుమ చందన కుసుమంబులును కేశంబులును వేల్చుచు నిశ్చల నియమంబున హోమంబు సేయునంత"[1]

ఈ హోమ కార్యమునందును క్షుద్ర పద్ధతులు అవలంభింప బడినవి. అంగదాదులు ఈ పాతాళ హోమ కార్యమునకు విఘ్నము గల్గించినారు. ఈ హోమ కార్య వృత్తాంతమంతయు అమూలకమే.

## 5.16 ఉపసంహారము :

ఈ విధముగా రామాయణ కాలంనాటి యుద్ధములందు నాగరిక, ఆటవిక పద్ధతుల మిశ్రమము కనబడును. వేదకాలం నాటి యుద్ధముల తర్వాత చెప్పదగినదీ యుద్ధమే. ఇతిహాస కాలపు యుద్ధములలో మొదట చెప్పదగినదియు నిదియే. ఒక విధముగా భారత యుద్ధానికిగాని, తరువాత కాలంలో వచ్చిన యుద్ధ శాస్త్రాలకు గాని రామాయణ యుద్ధమే ఆధారమైనట్టిది. రామాయణం వేదధర్మ మూలమైనది. వేదకాలంనాటి పద్ధతుల ననుసరించి నట్టిది. అర్థశాస్త్రం, కామందక నీతిశాస్త్రం ఇత్యాదులన్నీ వేదధర్మ ప్రతిపాదకములైన పద్ధతుల ననుసరించు నట్టివై వానిని సమర్థించినవి. కావుననే ఆయా గ్రంథములను గూడ వ్యాసరచన కాధారముగా తీసుకొనుట జరిగినది. రామాయణమున యుద్ధతంత్ర విజ్ఞానమునకు సంబంధించిన విషయము లీవ్యాసమున గ్రహించినవి గాక ఇంకను పెక్కు గలవు. సిద్ధాంత వ్యాస పరిధిని దృష్టి యందుంచుకొని కొన్ని విషయములనే ఇందు తీసుకొనుట జరిగినది.

భౌతిక బలసంపద కంటె ధర్మము ప్రధానమైనదని రామాయణ యుద్ధమున నిరూపింపబడినది. బలసంపన్నుడైనను పరసంపన్నుడైనను పరుల సంపదగోరు వాడు వినాశనమును తప్పక పొందగలడని రామాయణ యుద్ధము ప్రబోధించుచున్నది.

1. భాస్కర.రా.యు. 1839

యుద్ధ విద్యలలో ప్రవేశమున్నట్టి, కొంత నాగరికులైనట్టి రాక్షసులు వానరులతో కూట యుద్ధమునకు పాల్పడినారు గాని యుద్ధమందెక్కడను వానరులు మాయలను ప్రయోగించుట కనబడదు. వానరులలో కొందఱు కామరూప విద్య తెలిసిన వారుండినను, వానరులు అట్టి మాయల ప్రయోగింపక పూర్తిగా ఋజుయుద్ధమే చేసినారు. రామలక్ష్మణులును అంతియే. యుద్ధ విషయమున భారతీయులు ఋజు మార్గమునే అనుసరించెడి వారని రామాయణ యుద్ధమునందు నిరూపించ బడినది. వివిధములైన ఆయుధములను ప్రయోగించుట సుశిక్షితులైన వీరులకే సాధ్యమగును. అట్టి ఆయుధ విద్యలు నేర్చుకొనుటలో మన ప్రాచీనులకు గల ఆసక్తియు ఈ యుద్ధము వలన తెలియుచున్నది వివిధాయుధములతో చేయబడిన యుద్ధములను బట్టి ఆ యుద్ధ పద్ధతులు రామాయణ కాలముననే ప్రసిద్ధములైన వనియు తెలియుచున్నది.

ముఖ్యముగా ధనుర్విద్యలో రామాయణ కాలపు క్షత్రియులు మిక్కిలి నిపుణులుగా తెలియబడుచున్నారు. తర్వాత కాలమున ధనుర్విద్య క్షత్రియుల సొత్తే గాక వీరులగు వారందఱకు ఆరాధ్యమైనదైనది.

రామాయణ, మహాభారత యుద్ధముల క్రమ పరిణామమును పరిశీలించినచో రామాయణ యుద్ధపు పరిణత దశ భారత యుద్ధమునందు కన్పట్టును.



# ఉపయుక్త గ్రంథసూచి

# [BIBLIOGRAPHY]


| | రచయిత పేరు | గ్రంథ నామము | |
|---|---|---|---|
| | తెలుంగు గ్రంథములు : | | |
| 1. | అనంతరామ శాస్త్రి, నేతి | కవిత్రయ భారతం-రాజనీతి<br>అరుణా పబ్లికేషన్స్<br>పట్టాభిపురం<br>గుంటూరు | 1988 |
| 2. | ఆరుద్ర | సమగ్ర ఆంధ్ర సాహిత్యం - 8వ భాగం<br>యం.శేషాచలం & కంపెనీ<br>మచిలీపట్నం | 1965 |
| 3. | కృష్ణమాచార్యులు | "ధనుర్విద్యా విలాసము"<br>మద్రాస్ గవర్నమెంట్ ఓరియంటల్ సిరీస్<br>తంజావూరు | 1950 |
| 4. | గోపరాజు, కొఅవి | "సింహాసన ద్వాత్రింశిక<br>ఆం.ప్ర. సాహిత్య అకాడమి, హైదరాబాద్ | 1982 |
| 5. | చెంగారెడ్డి, డి. | శ్రీమదాంధ్ర మహాభారతము - రాజనీతి<br>ప్రియదర్శిని పబ్లికేషన్స్, తిరుపతి | 1989 |
| 6. | తిక్కన సోమయాజి | మహాభారతం<br>ద్రోణ-శాంతి-శల్యపర్వములు<br>ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగుశాఖ<br>హైదరాబాద్ | 1969 |
| 7. | దామోదరరెడ్డి, పి. | ప్రాచీనాంధ్ర కావ్యాలు-రాజనీతి<br>12-310సి, అశోక్‌నగర్, అనంతపురం | 1994 |
| 8. | దొరస్వామి శర్మ, రావూరి | తెలుగు సాహిత్యంలో రామకథ<br>త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్టణం | 1972 |
| 9. | నవనప్ప | ఖడ్గలక్షణ శిరోమణి<br>మద్రాస్ ఓరియంటల్ సిరీస్<br>మద్రాస్ గవర్నమెంట్, తంజావూరు | 1950 |
| 10. | నారాయణామాత్యుడు, అయ్యలరాజు | హంసవింశతి<br>ఆం.ప్ర. సాహిత్య అకాడమీ<br>హైదరాబాద్ | 1985 |

| రచయిత పేరు | గ్రంథ నామము | |
|---|---|---|
| 11. ప్రతాపరెడ్డి, సురవరం | రామాయణ విశేషాలు<br>సురవరం సాహిత్య వైజయంతి కమిటి<br>ఆంధ్రసారస్వత పరిషత్<br>తిలక్‌రోడ్, హైదరాబాద్ | 1987 |
| 12. బాలశౌరి రెడ్డి | రామాయణకాలంలో భారతీయ సంస్కృతి<br>బి.వి.ఎస్.పబ్లికేషన్స్, 27 వడివేలుపురం<br>వెస్ట్‌మాంబలం, మద్రాస్-33 | 1981 |
| 13. బుద్ధారెడ్డి, గోన | రంగనాథ రామాయణం<br>తెలుగు విశ్వవిద్యాలయం<br>కళాభవనం, హైదరాబాద్ | 1989 |
| 14. భాస్కరుడు, హుళక్కి | భాస్కర రామాయణం<br>వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్<br>మద్రాస్ | 1965 |
| 15. మలయవాసిని కొలవెన్ను | ఆంధ్ర వాఙ్మయం - రామాయణం<br>ప్లాట్ నెం.63, లాసన్స్ బే కాలనీ<br>విశాఖపట్నం-17 | 1985 |
| 16. మొల్ల ఆతుకూరి | మొల్ల రామాయణం<br>బాలసరస్వతీ బుక్ డిపో<br>నెం.4, సుంకు రామిశెట్టి వీధి, మద్రాస్-1 | 1987 |
| 17. రఘునాథాచార్యులు యస్.బి. | ఆర్షవిజ్ఞాన సర్వస్వము పార్ట్-I<br>తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి | 1982 |
| 18. రామరాజ భూషణుడు | వసుచరిత్ర<br>వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్<br>మద్రాస్ | 1967 |
| 19. రామభద్రకవి అయ్యలరాజు | రామాభ్యుదయం<br>ఆం.ప్ర. సాహిత్య అకాడమి<br>కళాభవన్, హైదరాబాద్ | 1967 |
| 20. రాహుల్ సాంకృత్యాయన్ | ఋగ్వేద ఆర్యులు<br>విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్<br>విజయవాడ | 1974 |
| 21. వెంకట కవి, జక్కరాజు | ఆంధ్ర కామందకము<br>మద్రాస్ ఓరియంటల్ సిరీస్, తంజావూరు | 1950 |
| 22. వెంకట రంగయ్య, మామిడిపూడి | కౌటిల్యుని అర్థశాస్త్రం<br>ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్,<br>వాల్తేరు, విశాఖపట్నం-3 | 1981 |

| రచయిత పేరు | గ్రంథ నామము | |
|---|---|---|
| 23. వెంకటావధాని, దివాకర్ల | 1. సాహిత్య సోపానములు<br>ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాద్ | 1981 |
| | 2. రామాయణ సర్వస్వము<br>సంస్కృత భాషా ప్రచార సమితి,<br>హైదరాబాద్ | 1985 |
| 24. వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి, చందూరి | శ్రీమద్వాల్మీకి రామాయణం<br>కాశ్యపస్వాధ్యాయ కేంద్రం<br>497, కమలానగర్, హైదరాబాద్ | 1992 |
| 25. శ్రీనాథుడు | శృంగార నైషధం<br>ఆం.ప్ర. సాహిత్య అకాడమి<br>కళాభవన్, హైదరాబాద్ | 1967 |
| 26. శ్రీనివాస శాస్త్రి, రాణి | ప్రాచీన భారతీయ విజ్ఞానం<br>భారతీయ రసాయనశాల<br>సత్యనారాయణపురం, విజయవాడ | 1981 |
| 27. సత్యనారాయణ, విశ్వనాథ | నా రాముడు<br>వి.యస్.యన్. అండ్ కో, విజయవాడ | 1986 |
| 28. సూర్యనారాయణ శాస్త్రి, మల్లాది | సంస్కృత వాఙ్మయ చరిత్ర<br>(ద్వితీయ భాగం)<br>ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాద్ | 1961 |
| 29. సోమన, నాచన | ఉత్తర హరివంశము<br>వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్<br>మద్రాస్ | 1967 |

తెలుఁగు వ్యాసములు :

| | | |
|---|---|---|
| 1. ఆరుద్ర | "ద్వంద్వ యుద్ధం<br>సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం<br>భాగము-5, హైదరాబాద్ | 1966 |
| 2. జోషి, ఆర్.యం. | "ప్రాచీన భారత యుద్ధతంత్రం"<br>సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం<br>భాగము-6, హైదరాబాద్ | 1969 |
| 3. ప్రభాకర శాస్త్రి, వేమూరి | "ధనుర్విద్యా విలాసం – పీఠిక | 1950 |
| 4. లక్ష్మీ కాంతయ్య, గరికిపాటి | "ధనుర్విద్య"<br>సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం<br>భాగము-5, హైదరాబాద్ | 1966 |

| రచయిత పేరు | గ్రంథ నామము | |
|---|---|---|
| 5. వీరభద్ర రావు, ఆదిరాజు | "చతురంగ బలములు – II" సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం భాగము–3, హైదరాబాద్ | 1966 |
| 6. వెంకట శేషయ్య, బిరుదు | "చతురంగ బలములు – I" సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం భాగము–3, హైదరాబాద్ | 1962 |
| 7. వెంకటరావు, నిడదవోలు | "ఖడ్గ లక్షణ శిరోమణి – పీఠిక" | 1950 |
| 8. సుబ్రహ్మణ్య శర్మ, పురాణం | "ప్రాచీన భారతీయ సైనిక వ్యవస్థ" భారతి, నవంబర్, 1961 | 1961 |
| 9. సుబ్బయ్య గారు, ప్రతాప | "కాల్బలము" సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం భాగము–3, హైదరాబాద్. | 1962 |

సంస్కృత గ్రంథములు :

| | | |
|---|---|---|
| 1. అమరసింహుడు | అమరకోశము | |
| 2. గోవిందరాజు | రామాయణము – వ్యాఖ్యానము (గోవింద రాజీయము) | |
| 3. మనువు | మనుస్మృతి | |
| 4. మహేశ్వర తీర్థులు | రామాయణము – వ్యాఖ్యానము (మహేశ్వరతీర్థ వ్యాఖ్య) | |
| 5. వాల్మీకి | శ్రీమద్రామాయణము శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్స్, హైదరాబాద్ | |
| 6. వ్యాసుడు | భగవద్గీత | |

ఆంగ్ల గ్రంథములు :

| | | |
|---|---|---|
| 1. JOSHI, N.P. | Life in Ancient Uttarapatha Sanskrit University Varanasi | 1967 |
| 2. RAMESH CHANDRA DUTT | Ancient India 2000 BC - 800 AD [illegible] Co., Delhi | 1980 |


❊❊❊